# "20 వేల పౌండ్లే!" అన్నారు అక్కడున్న పెద్దలు ఐదుగురూ - దాదాపు ఏకగ్రీవంగా.

అది తన యావదాస్తిలోనూ సరిగ్గా సగం. మిగతా సగమూ ప్రయాణానికి ఖర్చుపెట్టదలచుకున్నాడు ఫిలియాస్ ఫాగ్.

# కాలం 19వ శతాబ్దం (తృతీయపాదం); పందెం 80 రోజులలో భూప్రదక్షిణం; పణం 20 వేల పౌండ్లు.

ఆనాడు విమానాలు లేవు. రైళ్ళూ ఓడలూ ఆడినమాట తప్పబోము అని కనీసం శపథాలుకూడా చేయడం లేదు. అయినా మెలకువతో ప్రయాణంచేస్తే 80 రోజులలో భూప్రదక్షిణం సాధించవచ్చునన్న ధీమాతో ఫాగ్ ఈపందెం కాశాడు. అతడి జయాపజయాలమీద లండన్ ప్రజలుకూడా లక్షలాదిగా పందాలు వేసుకున్నారు.

సాహసోపేతమైన ఈ యాత్రలో ఫిలియాస్ ఫాగ్ ఎదుర్కొన్న సమస్యలూ, ఉపద్రవాలూ, ఆమధ్యలో డిటెక్టివ్ ఫిక్స్ తెచ్చిపెట్టిన చికాకులూ ఈతిబాధలూ, ఫాగ్ వెంటతీసుకెళ్ళిన మంచి ఫ్రెంచినౌకరు పాస్పార్టూ అవకతవకలూ అనుభవైకవేద్యాలే అనిపించినా, వీటిని మనోహరంగా వర్ణిస్తూ

## అద్భుత రసాన్ని అద్భుతంగా పోషించిన ప్రఖ్యాత రచయిత జూల్స్ వెర్న్ నవల

## [illegible] ప్రదక్షి[illegible]

**చదువుతూ ఉంటే మనంకూడా ఫిలియాస్ ఎక్కిన ఓడమీద, రైలుమీద, ఏనుగుమీద వెళ్తున్నామన్న భావం కలుగుతుంది.**

## ఫిలియాస్ ఫాగ్ యాత్ర 1872 అక్టోబరు 2 బుధవారం ఆరంభం అవుతుంది.

**ఆంధ్రసచిత్రవారపత్రికలో ఈ సరికొత్త సీరియల్ 1960 డిసెంబరు 21 బుధవారం ఆరంభమవుతుంది.**

## పందెం ఒడ్డిన రోజునే ఫాగ్ టిక్కెట్లు బుక్ చేసుకొన్నాడు; బయల్దేరాడు.

**మీరూ ఇవాళే మీ కాపీ రిజర్వుచేసుకొని సిద్ధంగా ఉండండి. బయల్దేరండి!!**

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


## ఉత్తరాలు

### తెలుగు వెలుగులు

30-11-60 తేదీ పత్రికలో "తెలుగు వెలుగులు" శీర్షిక క్రింద ప్రచురించబడిన శ్రీ మారెళ్ళ కేశవరావుగారి సంగ్రహ జీవిత చరిత్ర అత్యంత శ్లాఘనీయము.

'బాహ్యప్రపంచాన్ని చూడలేకపోయినా అంతరంగంలో నాదబ్రహ్మను సాక్షాత్కరింపచేసుకొన్నవాడు శ్రీ మారెళ్ల కేశవరావు.' అన్న వాక్యం అక్షరాలా నిజం.

మంచాళ వెంకట్రావు (హైదరాబాద్)

*　　*　　*

తెలుగు వెలుగులు 61లో చెప్పినట్లు విజయనగరం సంగీత కళాశాల అంధ బాలబాలికలకు శిక్షణ ఇవ్వటం వాస్తవమే. శ్రీ మారెళ్ళవారి గురించి వ్రాసినప్పుడు "అంతరంగంలో నాదబ్రహ్మను సాక్షాత్కరింప చేసుకున్నవాడు శ్రీ కేశవరావు" అని బహు యథార్థంగా నుడివారు. ఇచ్చటి సంగీత కళాశాలలో శిక్షణపొందినవారందరూ మహానుభావులై వెలుగుచున్నారని గర్వంగా చెప్పగలను. సమయంలో ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకుంటే అదృష్టవంతులం. కాని చాలకాలంనుంచి ఈ కళాశాలలో 'వాయులీనా'నికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, మిగతా గాత్ర, మృదంగ, వైణిక, తరగతులను చిరుచూపు చూడటం ఒక అలవాటైపోయింది. ఆ పొరపాటును ఇప్పటికైనా సవరించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇటువంటి పొరపాట్లవల్ల (మా) విజయనగరానికే అప్రతిష్ఠ అని భావిస్తున్నాను.

"శ్రీ వాణి" (విజయనగరం)

*　　*　　*

30-11-60 తేదీగల వారపత్రిక "తెలుగు వెలుగులు" శీర్షికలో, శ్రీ మారెళ్ళ కేశవరావు గారిని గురించిన వ్యాసము నన్నాకర్షించినది. ఆ రాత్రే రేడియోలో ఆయన వాయులీన కచేరీ ప్రసారితమయింది. 'జంత్రగాత్రముల రాలరగించు విమల గాంధర్వం' ఆయన కమానుమీటుగా తొణికిసలాడింది. రేడియో విన్న తరవాత మరొకసారి పత్రిక తెరచి 'తెలుగు వెలుగులు' శీర్షిక చదివాను. శ్రీ కేశవరావుగారిని పరిచయంచేసిన రచయితకు నా ధన్యవాదములు. 'తెలుగు వెలుగులు' శీర్షిక ద్వారా ఆంధ్రులలోని 'అమూల్య రత్నా'లను అందరికీ పరిచయం చేయడంలో మీ పత్రిక


# వేపుడు కాఫీ విత్తులు

తాజాగా చాలాకాలము వుండగలవు. స్వచ్ఛమైనవిగా కూడా వుండగలవు. రెండు వారములకు మీకు కావలసిన సరకు ఒకే దఫా కొని, మంచి డబ్బాలలో భద్రపరిచి, అవసరమైనపుడు మర పట్టి, కాఫీ చేసికొని ప్రత్యేకమైన తాజా కాఫీ రుచి, సువాసన అనుభవించండి.

వేపుడు కాఫీ విత్తులు

లభించు స్థలము:

## ఇండియా కాఫీ డిపో

15, ఆర్మినియన్ వీధి, మద్రాసు-1; 192, మౌంట్ రోడ్, మద్రాసు-2: 12, రంగనాథన్స్ వీధి, త్యాగరాయనగర్, మద్రాసు-17; 9, డాక్టర్ సుబ్బరాయన్ రోడ్, సేలం; వెస్ట్ బౌలివార్డ్ రోడ్, తెప్పకుళం, తిరుచినాపల్లి; 1వ నార్తు చిత్తై రోడ్, మధురై.




కాఫీ బోర్డు

చేస్తూన్న సేవ వర్ణనాతీతము.

షష్టిపూర్తి చేసుకొన్న తర్వాత 'తెలుగు వెలుగులు' శీర్షికను ఆపివేయగలరని ఆశించిన 'మిత్రద్వయం' (విజయవాడ) అటువంటి అభిప్రాయాన్ని వ్యక్తపరచడం శోచనీయమైన విషయం ఆంధ్రులు గర్వించవలసిన 'తెలుగు వెలుగులు' శీర్షిక అంతం కాకుండా క్రొత్తవెలుగులతో ప్రకాశిస్తుందని ఆశిస్తున్నాను.

బి. వి. నరసింహం (భిలాయి)

* * *

మీరు శ్రీ మారెళ్ళ కేశవరావునుగురించి వ్రాసినది చాలా వాస్తవముగా నున్నది. కేశవరావుగారి సంగీతము మల్లెపూవుల వాసనలా, మంచి గంధంలా......అనిపిస్తుంది.

సి. ఎస్. రాజేశ్వరరావు (అనంతపురం)

* * *

## కార్టూనులు

30-11-60 సంచికలో ఊమెన్‌గారి కార్టూనులో గుప్తకనిన కలలన్నీ ఎగిటికలలైనాయి అని వ్రాశారు. ఊమెన్‌గారు పొరపాటున ఊహించారు. అధిష్ఠాన వర్గము కూడ గుప్త అభ్యర్థిత్వమును బలపరుస్తున్నారని తెలుసా?

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి (పొన్నెకల్లు)

* * *

శంకర్ గారి "ఎప్పుడూ ఇంతే" షష్టిపూర్తి చేసుకున్నా గాని, పాపం ఆయన గాగు వంట చేయటంమాత్రం ఇంకా మానలేదు. మా లాంటి వనితల్లో ఈ లాంటి గయ్యాళిగంప ఉన్నట్లయితే వనితాలోకంకే గొప్ప కళంకం. ఈ వారంలో "మా ఆయననుకున్నాను" అన్నలా వుంటాయి శంకర్ గారి చిత్రాలు. ఒక్కసారైనా పురుషుని గొప్పతనం శంకర్ తన "ఎప్పుడూ ఇంతే" కార్టూన్లలో చాటించలేదు. ఇల్లా ఎప్పుడూ ఆయన కార్టూన్లలో ఆడవారికే ప్రాముఖ్యం ఇవ్వటంలో, ఏదో ఒక కారణం ఉండాలి.

ఆర్. మణి (సికింద్రాబాదు)

* * *

ఎప్పుడూ యింతే శీర్షిక ఎప్పటికీ ఇలానే ఉంటుందని ఎప్పుడూ ఇలానే అనుకుంటూంటా! శంకర్ గారికి అలాంటి భార్య దొరుకుతుందేమో? హతోస్మి! అలా జరుగకుండుగాక!

భళ్లమూడి సత్యనారాయణరావ్ (అద్రా)

* * *

## కథగాని కథలు

మీ పత్రిక అంతా బాగానేవుంది గానీ... కథగానికథ (లు) చదువుతుంటే నవ్వు కాదు కాని ఏడుపు వస్తుంది. కడుపుబ్బ నవ్వించే కథలకు 5 రూపాయలున్నూ, ఏమీ నవ్వురాని కథలకు 10 రూపాయలు ఇవ్వడం యిదెక్కడి న్యాయమండీ?

ఎ. కమలకుమారి (వాడ్రేవుపల్లి)

* * *

మీ సచిత్ర వారపత్రికలోని కథకాని కథలు నన్ను కడుపుబ్బనట్లు నవ్విస్తున్నాయి. రచయితలకు నా ధన్యవాదాలు.

ఆర్. సుధీర్ రెడ్డి (హనుమకొండ)

* * *

## "ఎదురు తెన్నులు"

23-11-60 వ తేదీ పత్రికలో "ఎదురు తెన్నులు" అనే రచన—భావనలో చాలా గొప్పగా ఉన్నది. భావప్రకటన చక్కగా లేదు. నడక కుంటుపడింది. కారణం నాలుగుచోట్ల గణభంగం జరిగింది. కడపట యతిభంగంకూడా ఏర్పడ్డది. మొత్తంమీద సదానందం గారిని మెచ్చుకోవాలి.

ఎస్. వి. శేషఫణిశర్మ (తిరుపతి.)

యతినియతిరచయితే పాటించలేదు.

* * *

## కులతత్వాన్ని రెచ్చగొడుతున్నారు

23-11-60 పత్రికలో శ్రీకృష్ణ గారి "న్యూఢిల్లీ లేఖ" వారి సంకుచితత్వాన్నీ, కులతత్వాన్నీ చక్కగా వెలికి తెచ్చింది.

"రాముడు క్షత్రియుడు. అయినప్పటికి రామలీల ఉత్సవాలలో రాముని పాత్రను ఒక బ్రాహ్మణుడు ధరిస్తున్నాడు"—ఇది వారి ఉక్రోషం. ఇలాంటి అవరకమైన భావాలు పత్రికాముఖంగా వెలువరించడం వల్ల వారు కులతత్వాన్ని రెచ్చగొడుతున్నారు. రాముని పాత్రను ఎవరుధరిస్తే




సుఖజీవిత సేవ

భారత "సిద్ధవైద్య మహిమ" మన దేశ సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

"మేల్‌మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన మేహ, కుష్ఠురోగనివారిణి భయంకరమైన మేహ వ్యాధివల్ల కష్టపడువారలకు పునరన్నమిచ్చు అద్భుత సంజీవి మేహరోగ నివారణ నూనె, లేహ్యము.

డా॥ కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్‌మాయిల్. (P. O.) (N. A. Dt.) S. India.



30 సంవత్సరాలుగా ప్రఖ్యాతివహించిన నూనెలు

అగ్‌మార్కు-కాబడిన ఎ.యస్.బ్రాండ్ నువ్వుపప్పు నూనె




అగ్‌మార్కు-కాబడిన మేన్షన్‌బ్రాండ్ నువ్వుల నూనె




ఆహారకల్తీచట్టం లోని నిబంధనలను తు.చ. తప్పకుండా అమలు పరచుటం ద్వారా నికార్సయిన ప్రవర్తనను, నిజాయితీని నిరూపించి, వ్యాపారరంగం యొక్క స్థాయినే పెంపొందించగలిగామని తెలియజేయుటకు

ఎంతయో సంతోషించుచున్నాము

ఇప్పుడు ఆంధ్రదేశం మొత్తము మీద ఇండియన్ గవర్నమెంటువారి అగ్‌మార్క్ పద్ధతిని ప్రప్రథమముగా ప్రవేశపెట్టినామని చెప్పుకొనుటకు..... గర్వించుచున్నాము.

మీకు కావలసినప్పుడెల్లా ఇండియన్ గవర్నమెంటువారి అగ్‌మార్కు-సీలుకలిగిన డబ్బాను అడగండి

అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట

ఇండియా పలుతావులందు మా ఏజెంట్లు కలరు

విజయవాడ, గుంటూరు, బందరు, రేపల్లె, తెనాలి, బాపట్ల, చీరాల, వేటపాలెం, ఒంగోలు, మద్రాసు, హాస్పేట, బళ్లారి, అనంతపురం, గుంతకల్లు, కర్నూలు, నంద్యాల, విశాఖపట్నం, విజయనగరం, బరంపురం, కటక్, ఖర్గపూరు, కలకత్తా, జంషెడ్పూర్, సింద్రీ, ధనబాద్ లలో మా ఏజంట్లు, స్టాకిస్టులు గలరు.

ఆంధ్రప్రదేశ్ సోల్ రిప్రజెంటేటివ్:

శ్రీ జి. సుబ్బారావు, తెనాలి.

డిపోలు: (1) డాక్టరు ఉశిక్కి స్ట్రీట్, తెనాలి (2) 3096 సుబ్రిక్ స్ట్రీటు, సికింద్రాబాదు (3) 129/L5, రోడ్ నెం.11, B.H.Area, ఖద్మా, జెంషెడ్పూరు ప్రత్యేక సౌకర్యం: నేడు ప్రతీచోట చౌకగా లారీపార్సెలు సర్వీసు అందుబాటులో నున్నది. గావున పైపట్టణాలకు చేరువలోనివారు లారీ సర్వీసుద్వారా మా సరుకులను రవాణా చేయించుకోవచ్చును.

నేమిటి? "రామునిపాత్రను ఒక అబ్రాహ్మణుడే–ఆ మాటకొస్తే–ఒక రాజపుత్రుడే" ధరించాలని ఏముంది? ఈ కులతత్వపు కుళ్ళు కాలవలలోకి మహానుభావుడైన రాముణ్ణి లాగవద్దని మహానుభావులైన "శ్రీ కృష్ణ" గారికి నా మనవి. ఇలాంటి అపాయకరమైన "చిత్ర" ప్రచురించవద్దని మీకు నా వినతి.

ఎస్. బి. ఎస్. రావు (అనంతపురం)

* * *

## కుటుంబ నియంత్రణం

కుటుంబ నియంత్రణగురించి బాగా తెలిసినవారు, వారి అనుభవాలను విశదీకరించి వ్రాయడం వనితలకు ఉపయోగకరంగా ఉంటుందనుకుంటాను. పట్టిచెత్తవ్యాసాలకంటె, ఉపయోగకరమైనవి తెలుసుకోవడం ఉత్తమం. అందరికీ తెలియాలంటే పత్రిక

# ఉత్తరాలు

(వీక్లీ)లో వెయ్యాలి. నూటికి కనీసం 50 మంది ఈపత్రిక చదివేవారున్నారు. అందుచేత సిగ్గుపడవలసిన పనిలేదు. ఎవరైనా నవ్వుతారని భయపడక తాము అమలు చేస్తున్నపద్ధతులను వివరించుతూ తెలుపవలసిందిగా కోరుతున్నాను. ఇలా వ్రాసినందుకు సోదరీమణులు నవ్వరని తలుస్తున్నాను.

కె. రాధాదేవి (వరంగల్)

* * *

## నేనూ-నా పాప

80_11_60 తేదీ సంచికలో "నేనూ-నాపాప" అనే శీర్షికతో ఉన్న పర్షియా మహారాణి స్వీయకథ చాలా బాగావుందని తెలుప సంతోషపడుతున్నాను. ఆ మహారాణి తలంపులో "నా పాప పుట్టినరోజు నేను తరించినరోజు" అన్నవాక్యం గొప్ప ఆనందాన్ని కల్గించేలాగవుంది. ఇంతచక్కని స్వీయకథను అందించిన మీకు ధన్యవాదాలు.

మండవ శ్రీనివాసరావు (హైద్రాబాదు)

* * *

80-11-60వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో పర్షియామహారాణికథ "నేను నా పాప" చదివాను. చాలబాగుంది. పేజీలు ఎక్కువ చేయమని కోరుతున్నాను." ★

టి. వరదరాజన్ (నెల్లూరు)





ఒక చిన్న చెంచాడు ఈనో ఒక గ్లాసెడు నీళ్లలో కలిపిన అది మిక్కిలి రుచికరముగా నుండును, అలసటను పోగొట్టి వికాసత్వము నిచ్చును. మెరయుచు పొంగే ఈనో 'ఫ్రూట్ సాల్ట్' సౌమ్యముగా పనిచేయును. అది కడుపులో అస్వస్థతను వేగముగా పోగొట్టి జీర్ణశక్తిని క్రమపరచి, దీర్ఘ ఉపశమనమును కల్గించును.






ఈనో ఆమెకు వెంటనే గుణమిచ్చింది

ఈనో 'ఫ్రూట్ సాల్ట్'

'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిష్టరు చేయబడిన ట్రేడు మార్కులు

బీచమ్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 15

14-12-60
బుధవారం

శార్వరి మార్గశిర బహుళ ఏకాదశి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

'ముస్తాబు'

చిత్రకారుడు: కో. ధర్మారావు (విజయనగరం)



## కథకానికథ

కథకాని కథల పోటీకి రచనలు పంపేవారు కొంతమంది తమ రచనలు కేవలం చిన్న చీటీముక్కలమీద వ్రాసి పంక్తిలో పంక్తిని ఇరికిస్తున్నారు. ఇలాంటివి పరిశీలించటం కష్టం కాబట్టి రచనలు పంపేవారు రచనకుతగ్గసైజు కాగితంమీద పంక్తికీ పంక్తికీ మధ్య బాగా ఖాళీవదలుతూ వ్రాయాలని కోరుతున్నాము. కాగితాలకు ఒకవైపునే వ్రాయడం కూడా అవసరం.

—సంపాదకుడు

## రచయితలకు మనవి

కొందరు రచయితలు తమ రచనలతోపాటు కాక, విడిగా స్టాంపులు పంపుతున్నారు. ఈకారణంగా ప్రచురణార్హంకాని రచనలను తిప్పి పంపేందుకు వీలు కలగటంలేదు. రచయితలు ఈ విషయాన్ని గమనించి, రచనలతోపాటు స్టాంపులు పంపితే ఏ ఇబ్బంది ఉండదు. రచనలను తిప్పి పంపే విషయమై ఎలాంటి పరిస్థితులలోను ఉత్తర ప్రత్యుత్తరాలకు సావకాశం ఉండదని మనవి చేస్తున్నాం.

రచయితలు, రచనలతో తమ చిరునామా కల కవర్లు (స్టాంపులతో సహా) జతపరిచి పంపితే, ప్రచురణకు స్వీకరించని రచనలను, మరికొంత త్వరలో తిప్పి పంపే వీలు ఉంటుంది.

★

## గమనిక

కార్టూన్ పోటీలో పాల్గొనగోరేవారు తగుమాత్రపు సైజు కాగితంపై ఇండియన్ ఇంకుతో కార్టూన్ వ్రాసి పంపాలి. క్రింద చిరునామా స్పష్టంగా వ్రాయాలి. చాలీచాలని కాగితాలపై పెన్సిల్‌తోను, కలంతోను వ్రాసే బొమ్మలు పోటీకి స్వీకరించడం లేదు.

—సంపాదకుడు.


ఉపాధ్యాయుల జీతాలస్కీ
అడ్డుపడుతున్న ప్రబుద్ధులు
ఎయిడెడ్ స్కూళ్ళ నిర్వాహకుడు
ప్రత్యేకాధికారి
పురపాలకసంఘం కమీషనర్


స్వాతంత్ర్యంకోసం లుముంబా యత్నం
హేఁహే మళ్ళీ అతణ్ణి మనం పంజరంలో బంధించగలిగాం


ఇది లోపాయకారి వ్యవహారం అనుకోండి
కట్నం
OOMMEN
వరకట్ననిషేధం బిల్లు శాసనం అయ్యాక..





## అలవాటులో పొరబాటు
### (మొదటి బహుమతి రు. 10 లు)

అప్పుడు మా యింట్లో కలశం పెట్టి, దసరా పూజలు చేశారు. మా నాన్నగారు చాల మందిని భోజనాలకు ఆహ్వానించారు. ఆహూతులలో మా యింటి ప్రక్కనే కాపురం వుంటున్న ఆచార్యులుగారు కూడా ఒకరు. ఆయన మా హైస్కూలు హెడ్ మాస్టరు.

అందరు వచ్చి సావిట్లో కూర్చున్నారు. లోపల దేవీపూజ జరుగుతున్నది. హెడ్ మాస్టరుగారు లోపలకు వచ్చి ఉన్నవారినందరిని ఒకసారి పరికించి చూచారు. తరువాత తిన్నగా వెళ్ళి బల్ల ముందు వున్న కుర్చీలో ఆసీనులైనారు. అది అసలు మా నాన్నగారి ఆఫీసు బల్ల. కాసేపు అక్కడ కూర్చున్న పెద్దలతో పిచ్చాపాటి మాట్లాడి ఆఖరుకు రాజకీయాలలోకి దిగారు. అందరు తలోరకంగా తమ ఉద్దేశ్యాలు చెబుతున్నారు. ఇంతలో మా ఆచార్యులుగారు మాట్లాడడం మొదలెట్టారు. ఆయన మాట్లాడుతున్నప్పుడు, క్లాసులో అవుతేనేమి, బయటనవుతేనేమి, మధ్యలో ఎవ్వరిని మాట్లాడనివ్వరు. ఆసంగతి అందరికీ తెలిసినదే కనుక, ఎవ్వరు కలుగజేసికోనకుండా బుద్ధిమంతులైన బడిపిల్లలలా మాట్లాడకుండా వింటున్నారు. ఇలా దాదాపు గంటసేపు గడిచింది. లోపల పూజ అవుతునే ఉన్నది. మాస్టరుగారు ఇంకా మాట్లాడుతూనే ఉన్నారు. ఇంతలో పూజ అయినది, మహానైవేద్యం పెట్టారు. దేవికి హారతి ఇస్తూ లోపల జాగంట గణగణ కొడుతున్నారు. ఆ జాగంట మా బడిలో లాంగ్ బెల్ మాదిరిగా కొడుతున్నారు. గంట వినబడేసరికి, హెడ్ మాస్టరుగారు అలవాటు ప్రకారము మాట్లాడుతున్న విషయం ఠఖీమని ఆపి, “మిగతాది వచ్చే పీరియడ్‌లో” అని క్లాసులోంచి బయటికి వెళ్లినట్లు హాలులోంచి బయటికి నడచినారు.

కృత్తివెంటి సత్యవాణి (విజయవాడ)

* * *

## ఏడిస్తే కొడతా నన్నావుగా!
### (రెండవ బహుమతి రు. 5 లు)

మా రజనికి నాలుగేళ్ళు. ఒట్టి అల్లరిపిల్ల. కొట్టక ముందే కొట్టినంత అల్లరిచేసి ఏడుస్తుంటుంది. కొట్టకపోయినా కోప్పడితేనే ఏడుపు మొదలు. ఒక రోజు బాగా కోపం వచ్చి పని తొందరలో ఈసారి ఏడ్చావంటే చావగొట్టి చెవులు మూస్తాను అన్నా. అవాల్టికి అయిపోయింది. మరొక రోజు ఏదో అల్లరి చేస్తే నాలుగు అంటించాను. మాట్లాడకుండా నుంచుంది. ఎప్పుడూ కొట్టక మునుపే ఏడ్చే పిల్ల ఏడవకుండా వుండడం చూసి “ఏమే ఏడుపు రావడం లేదే”మని అడిగాను. ఆ రోజు “ఏడిస్తే చావగొట్టి చెవులు మూస్తానన్నావ్ గాదమ్మా” అంటూ బిగ్గరగా ఏడ్చేసింది. ఆ మాటలు వింటుంటే మా కందరికీ భలే నవ్వు వచ్చింది.

పి. పద్మ (ఆత్కూరు)

* * *

## సరైన జవాబు
### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను ఐదవతరగతి చదివేరోజుల్లో, మా క్లాసులో ‘ప్రసాదం’ అనే కుర్రాడుండేవాడు. వాడు వట్టి అమాయకుడు. ఒకనాడు చరిత్రక్లాసు జరుగుతోంది. మా చరిత్రోపాధ్యాయుడు, “ఝాన్సీ లక్ష్మీబాయ్ ఎప్పుడు జన్మించింది?” అని అడిగారు. మేమందరము జవాబు తెలియక తికమక పడుతున్నాం. మన ప్రసాదంవంతు వచ్చింది. వాడు ఠీవిగా నిలబడి, “ఝాన్సీ లక్ష్మీబాయ్ వాళ్ళమ్మ కన్నప్పుడు జన్మించింది” అని బదులు చెప్పాడు. మేమంతా గొల్లుమని నవ్వాం. అయ్యవారికి కోపంవచ్చి, వాడ్ని ఆ ప్రశ్నకు సరైన జవాబును నూట ఎనిమిది సార్లు (ఇంపోజిషన్) వ్రాసి తెమ్మని చెప్పారు. వాడు ఇంపోజిషన్ వ్రాయ మొదలు పెట్టాడు. వాడేం వ్రాస్తున్నాడో చూద్దామని నేను వాడి నోటుబుక్కును చూచాను. (నాది వాడి ప్రక్కసీటే లెండి.) వాడు వ్రాసిన జవాబు చూస్తే నాకు ఆపుకోలేనంత నవ్వు వచ్చింది. ఇంతకీ వాడు వ్రాసిన జవాబేమంటే, “లక్ష్మీబాయ్, వాళ్ళమ్మ కన్నప్పుడు పుట్టనేలేదు” అని. ఆ రోజు అయ్యవారు వాడికి ఒక రూపాయి జరిమానా వేశారు. బడి విడిచిపెట్టిన తర్వాత, నేను వాడ్ని “ఆవిధంగా ఎందుకు వ్రాశావురా?” అని అడిగితే, వాడిచ్చిన సమాధానమిది. అయ్యవారు సరైన జవాబును నూటయెనిమిదిసార్లు వ్రాసితెమ్మని, కోపంగా చెప్పినపుడు, ‘ఏం వ్రాయాలి సార్’ అని అయ్యవారిని అడగటానికి వాడికి భయమేసిందట. పైజవాబు సరిగ్గా వుంటుందని మనసును దిటవుచేసుకొని, జవాబు వ్రాసేశాడట. ఈ సంఘటనను తలచుకునేకొద్ది, నా కిప్పటికీ నవ్వు వస్తూంటుంది.

ఆర్. పెరుమాళ్లు (బొలారం)

## మొత్తానికి నష్టం
### (రెండవ బహుమతి రు. 5 లు)

తెనాలి మా మేనమామగారింటికని హైద్రాబాద్ నుంచి రాత్రి జి. టి. లో బయలుదేరాను. పై బెర్త్ మీద బెడ్ పరచి పండుకొని పత్రిక చదువుకుంటున్నాను. పావుగంటలో ఖాజీపేట వస్తుందనగా పత్రిక ముగించి పెట్టె అంతా ఒకసారి కలయజూశాను. నాకెదురుగా క్రింది బెర్తులో ఒక బుర్రమీసాలాయన జేబులో నుండి డబ్బుతీసి — ఆరు పది రూపాయల నోట్లు — మరొకసారి లెక్కపెట్టుకొని అటూ ఇటూ చూసి తిరిగి జేబులో పెట్టుకున్నాడు. ఆ బెర్తుమీదే చివర కూర్చున్న ఒక బట్టతల పెద్దమనిషి ఇదంతా చూడనట్లు జాగ్రత్తగా చూచాడు. మిగతా వాళ్ళంతా నిద్రపోతున్నారు. కాజీపేట రాగానే బట్టతలాయన “డబ్బు పోయింది. దొంగ— దొంగ” అని అరిచాడు. క్షణంలో ఇద్దరు పోలీసులు వచ్చారు. తనవి ఆరు పది రూపాయలనోట్లు పోయినవని చెప్పాడు బట్టతలాయన.

అందరి దగ్గరా వెతుకగా బుర్రమీసాలాయన దగ్గర సరిగ్గా 6 పది రూపాయల నోట్లు దొరికాయి. అదే నా డబ్బు అన్నాడు బట్టతలాయన తడుముకోకుండా. ఈ డబ్బు ఎవరిదని ప్రశ్నించారు పోలీసులు బుర్రమీసాలాయనను. బట్టతలాయన దగ్గర దొంగిలించిన మాట నిజమేనని ఒప్పుకున్నాడు బుర్రమీసాలాయన. బట్టతలాయనకు ఆశ్చర్యము మేసింది. పోలీసులు నోట్లవంక కాసేపు చూచి “మీరిద్దరూ పోలీసు స్టేషనుకు నడవండి” అన్నారు ‘దొంగ’ను ‘దొర’ను కూడా ఉద్దేశించి. “నేనెందుకు, నా డబ్బివ్వండి. బండి కదులుతుంది” అన్నాడు బట్టతలాయన ధీమాగా, “ఎందుకా! దొంగనోట్ల యజమానిగా నిన్ను, దొంగగా అతన్ని అరెస్టుచేస్తున్నాము” అని. వాళ్ళిద్దరికీ సంకెళ్ళు వేశారు పోలీసులు. బట్టతలాయన ముఖంలో కత్తి వాటుకు నెత్తురుచుక్క లేదు. అప్పుడర్థమైంది నాకు ఆ బుర్రమీసాలాయన తాను దొంగనని ఎందుకు ఒప్పుకున్నాడో.

జరిగిన విషయమంతా వివరంగా చెప్పిన తర్వాత బండిలో వాళ్ళంతా గొల్లుమన్నారు.

కె. సంపత్ కుమార్,
(హైదరాబాద్).

ఆంధ్రసచిత్రవారపత్రికకు ప్రత్యేకం
పరియా మహారాణి ఫరాపహ్లావీ
స్వీయ కథ

(గతవారం తరువాయి)

అనుభూతులు అనేక రకాలు. తీయని మరందాలు చిందేవి కొన్ని, తీరని ఆవేదనల కుందేవి మరికొన్ని. ఆనందం ఉండే ఏ మధురానుభూతి అయినా అనుభవం కాగానే ఎక్కడలేని ఆశ జీవితం మీద పుట్టుకొస్తుంది. నా చిట్టి పాపడిని చూసుకుంటే నాకు కలిగే అనుభూతి, ఆనందం, ఆశకూడా ఒక్కసారి ముప్పిరిగొంటాయి.

నా పాపడు పుట్టిన ప్రసూతిగృహానికి ఎదురుగా ఒక చక్కదనాలతోట ఉన్నది. అది మంచి పోషణలో ఉన్న ఉద్యానవనం, నా పడక ప్రక్కనే టెలిఫోన్ సౌకర్యం అమర్చబడింది. చక్రవర్తి నా చెంత లేనప్పుడు రాజభవనంలో ఆయనతో మాట్లాడటానికి ఇది ఎంతో ఉపకరించింది. కాని చాలసేపు ఆయన నన్ను విడచివుండేవారు కాదు. నాగది ప్రక్కనే మరోగది ఆయనకు సిద్ధం చేశారు.

మా ఇద్దరికీ ఎప్పుడూ ఏవో కబుర్లే — మరో విషయం ఏముంటుంది మా మధ్య? మా చిరంజీవి పెంపకం, చదువు, ఇవే మా చర్చ.

మా బాబును వేయి కన్నులతో, కంటికి రెప్పలా కాపాడుతునే నర్సు మిస్ గయాన్ దొరకటంకూడా మా అదృష్టమే. తీయగా విశాలంగా దేవతలా నవ్వుతూ, చల్లగా, తల్లిలా వుండే గయాన్ నా బాబును ఎంతో ప్రేమతో చూసింది. కాని ఆమెకు వీడొక్కడే కాదు. మరో డజనుమంది పాపలున్నారు. ఇంతమందికీ ఆమె చల్లని చేయి కావాలి. తల్లిప్రేమ కావాలి.

ఈ గొడవంతా చూసి నాకే గయాన్ మీద జాలి, గౌరవం కలిగాయి.

మా బాబు పోషణభారం నేనే వహించాలనిపించింది. అయితే డాక్టర్లు అనుమతించాలి గాని నేనే పాలిచ్చి నా పాపను పోషించుకోవాలని ఉవ్విళ్ళూరాను. నా కోరిక తీరింది. డాక్టర్లు అంగీకరించారు.

నర్సు ఎంత మంచిదయినా ఏమయినా ఆ కారణంతో స్వంతపిల్లల పోషణభారం వాళ్లకు అప్పగించాలంటే నాకు గిట్టదు. ఎవరి పిల్లలను వాళ్లు పోషించుకోనడంకన్న ధర్మంగాని, తృప్తిగాని మరొకటి లేదు.



నా జీవితం అంతా నా పిల్లల పోషణకే అంకితం చేస్తాను. ఏ ధర్మం నేను నిర్వర్తించలేకపోయినా ఈ విధ్యుక్త ధర్మం నేను నిర్వహించి కృతార్థురాలనైతే చాలు. నా పాపలకి ఏ లోటూ లేకుండా, పుట్టినందుకు విచారించవలసిన స్థితి వాళ్ళకు రాకుండా నేను వాళ్ళను పెంచుకుంటాను. ఒకవిధంగా నేను దురదృష్టవంతురాలను. పదేళ్ళ పసితనంలో నే తండ్రిని కోల్పోయాను. తండ్రి వాత్సల్యం చవిచూడని నిర్భాగ్యురాలను.

నాయీ చిన్నారి కుమారుడు విడిది చేయబోయే సౌధం నేను దాదాపు వంద సార్లు తనిఖీ చేశాను. ఇరవై ఏళ్ల క్రితం ఆ సౌధం చక్రవర్తి తొలి కుమార్తె (మొదటి భార్య కూతురు) షానాజ్ రాకుమారికోసం నిర్మించారు. మా ఏకాంత సౌధానికి ఈ భవనం యాభై గజాల దూరంలో ఉంటుంది.

ఆ రాకుమారుడి మందిరం సుందరంగా అందరంకలసి అలంకరించాము. పడకగది లేత రంగులతోను, పైకప్పు చక్కని చిత్రలేఖనంతోను అలంకరించాము. నేలమీద నీలంరంగు కార్పెట్ పరచి, ద్వారాలకు అందచందాల కర్టెన్‌లు అమర్చాగు పరిచారికలు. మిక్కీ మౌసూ, వాల్ట్ డిస్నీల కులాసా బొమ్మలు గదిగోడలనిండా చిత్రించారు.

ఇక మా అమ్మ! ఆవిడ ఏపని చేసినా అర్థ రహితంగా చేయదు. పాపడు పడుకునే గదిలో తెల్లని సాటిన్ కర్టెన్‌లకూ, దిండు గలీబులకూ, పక్క దుప్పట్లకూ చక్కని అల్లికలు అల్లింది. ఆ అల్లికలు అందరిదృష్టినీ ఆకర్షించేస్తాయి. పాపాయికి ఏ 'దిష్టి' అయినా తగులుతుందేమోనని ఆమె బెంగ.

రాకుమారుడి గది నీలినీలాలతో సోయగాలుపోయింది. ఆ గదినిండా మాఅబ్బాయి ఆడుకోడానికి ఆడుకొలేనన్ని గిలకొట్టాయలు ఉన్నాయి. చాలావాటిని మా అమ్మ తెలిసినవారిపాపలకు పంచిపెట్టింది. ఈ రాకుమారుడి కోసం ప్రపంచం నలుమూలలనుంచి ఎన్నో బహుమతులువచ్చాయి. పెద్ద ఎలుగులు, నీలి ఏనుగులు, గుర్రాలు, రకరకాల లక్కపిడతలూ, గిలకొట్టాయలూ చాలా వచ్చాయి. మావాడు వీటికి పనిచెప్పాలంటే ఇంకా బాగా పెద్దవాడు కావాలి.

ముస్తాబుకు చాలాదుస్తులుకూడావచ్చాయి మా పాపకి.

కాని నేను మూడేసి జతలు చొక్కాలు, పాంట్లు, బూట్లు, టోపీలు అల్లాను నాబాబు కోసం. అవి ముందు తొడిగి చూసి ఆనందించాలని నిశ్చయించుకొన్నాను. అవి కూడా లేతనీలి రంగువే.

పుట్టిన ఆరోరోజున అధికారపూర్వకంగా బాబు పేర అందరికీ విందు జరిగింది. ఆరోజు ఆదివారం, వాడికి పేరు కూడా లాంఛనంగా ఆవేళ పెట్టారు. పర్షియాలో కల్లా ప్రముఖ మతాధిపతి ముల్లా డాక్టర్ ఇమామి ఖురాన్ చేతపట్టుకుని పాపడి తల మీదఉంచి ఆ పసివాడి చెవిలో రహస్యంగా "నీ పేరు రేజాసైరస్ ఆలీ" అన్నారు. అదే ఖురాన్‌బాబు పుట్టిననాడుకూడా డాక్టర్ ఇమామి తీసుకువచ్చారు.

వాడు నాపోలిక అంటారు చక్రవర్తి. కాని అచ్చం ఆ పోలికలన్నీ తండ్రివే నంటుంది మా అమ్మ. ప్రజలు అటూయిటూ కూడా అన్నారు. నేనుమాత్రం ఆ గొడవ అస్సలు పట్టించుకోలేదు.

క్రమశిక్షణ పేరిట ఇప్పట్నించే చుట్టూ వాడికి హద్దులు పెట్టాలని నాకు లేదు. హాయిగా, కులాసాగా వాడు ఆడుకోవాలని నా ఆశయం.

చక్రవర్తి చదువుకు నేరోజుల్లో ఒక ఖైదీలాగా బ్రతికామని చెబుతూ ఉంటారు. ఆయన భద్రతకోసం రాజవంశం ఆయనకు ఎన్నో ఆంక్షలు రక్షణలు పెట్టింది. ఇతర పిల్లలతోపాటు స్వేచ్ఛగా తిరిగి ఆడిపాడటానికి ఆయనకు వీలు ఉండేది కాదట. దానికి సర్కారు అధికారుల అనుమతి కావాలి. దానితోపాటు వెంబడి రక్షకభటులు!

అయితే మాపాప పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, తనతండ్రిలాగా స్వదేశం, ప్రజ — ఈ రెంటిపట్ల తన ధర్మం గుర్తించే పాఠాలన్నీ నేర్చుకోవాలని మేము ఇద్దరమూ కోరుతున్నాము. ఇటు స్వేచ్ఛ కూడా వాడికి వుంటుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించే మహావకాశం — అందులో వుండే మాధుర్యం, రాకుమారుడు తెలుసుకోవాలి. అది తనకీ, తనవారికీ శ్రేయస్కరం.

భగవంతుడి కరుణాప్రసాదం ఈ అందాల పసిబాలుడు. వాడికి మేము చేయవలసిన ముఖ్యవిధి పెంపకం. అది మేము శక్తివంచన లేకుండా అహర్నిశం చేస్తాము. అంతకన్న మాకు కావలసింది మరొకటిలేదు. మరో ధర్మంలేదు. ఆ ధర్మం మేము విస్మరించము. నాబాబు అల్లా మాకు ప్రసాదించిన అపూర్వవరం. మహాఫలం. ★

(అయిపోయింది)


# గ్లూకోవిటా

## అధిక శక్తికరం




మీ నిత్య భోజనమునకు దివ్యమైన అదనపు ఆహారం, గ్లూకోవిటా మీ శరీరానికి కావలసినట్టి పెత్తురు చక్కెరంను సమకూర్చును.

పసిలోనైనా, అలంయందైనా నిస్సత్తువైయుండు పురుషులకు, ఎదిగే పిల్లలకు, గర్భిణీ స్త్రీలకున్న పసి బిడ్డ తల్లులకున్ను అతి దివ్యమైన శక్తి—దాయకం.

గ్లూకోవిటాను, టీ, కాఫీ, పాలు, చల్లని పానీయములలో కలిపి సేవించండి. ఒక కప్పు లేక గ్లాసుడు పానీయములో ఒకటి నుంచి మూడు టీ చెంచాలనిండుగా గ్లూకోవిటా వేసి కలపండి. సులభంగాకరుగును.

అధిక శక్తి కోసం
గ్లూకోవిటా

కార్న్ ప్రొడక్ట్స్ కో. (ఇండియా) ప్రైవేట్ లి.



భారతదేశంలో ఏజెంట్లు: ప్యారీ అండ్ కో. లిమిటెడ్




# మనుషులూ మనసులూ

పరిమళ రామచంద్రన్

(గత సంచిక తరువాయి)

## 7

తరువాత నాలుగురోజులపాటు కాంతారావు అనూరాధ వాళ్ళింటికి వెళ్ళలేక పోయాడు. అనూరాధకు కనబడటానికి అతడికి ధైర్యం చాలలేదు. వీలయినంత వరకు ఆమెను తప్పుకు తిరిగేందుకు ప్రయత్నించాడు. యూనివర్సిటీలో గాని, యూనివర్సిటీకి వెళ్ళే దారిలో గాని ఎక్కడ అనూరాధ కనబడుతుందో అని భయపడ్డాడు.

రోజూ సాయంత్రం యూనివర్సిటీ నుంచీ పావుగంట ఆలస్యంగా వచ్చేవాడు— మామూలు వేళకు వస్తే అనూరాధ కంటబడవలసి వస్తుందేమోనన్న భయంతో. ఓ సాయంత్రం ఇలాగే ఆలస్యంగా వస్తున్నాగా వస్తూ, లోపలి గేటు దగ్గర నిలబడి బయటి హాల్లోకి చూశాడు. హాల్లో అనూరాధ కూచుని వుంది!

భయపడ్డాడు. ఈవిడ ఎదురు చూస్తున్నది బహుశా తన కోసమే గావల్ను!!

ఏమనుకుంటోందో తన్ను గురించి...?

అనూరాధ అప్పుడే అక్కణ్ణుంచీ లేచి వెళ్ళేట్టు కనబడక పోవటంవల్ల, ఆడవాళ్ళ గేటులోంచీ వెడదామని అటువేపు దారి తీశాడు కాంతారావు. ఆడవాళ్ళ గేటు ఫిజిక్సు లేబరేటరీ అవతల వుంది. అతడక్కడికి వెడుతుంటే, డిమాన్‌స్ట్రేటరు సరోజ ఎదురయింది. సరోజ వయస్సు పాతికపైచిలుకు ఉంటుంది.

"ఇలా బయల్దేరా రెక్కడికి?" అని నవ్వుతూ ప్రశ్నించింది సరోజ ... అది అమ్మాయిల హాస్టలుకు వెళ్ళేదారి.

"ఊఁహు...ఇక్కడికే..." అన్నాడు ఎటూ చెప్పటానికి తోచక. ఇహ అంతకన్నా ఏం చెప్పగలడు?

"అనూరాధ కోసమా? ఆ పిల్ల అక్కడికి రాలేదే!" అంది సరోజ. అనూరాధ అతడితో స్నేహంగా ఉండటం సరోజకు తెలుసు. తరచుగా స్నేహితురాళ్ళను పరామర్శించేందుకు అనూరాధ హాస్టలుకు వెడుతుంటుంది కాబట్టి, అతడావిడకోసం అక్కడికి వెడుతున్నాడేమో ననుకుంది సరోజ.

"కాదులెండి. వేరేపనుంది ... వస్తాను." అంటూ తొందరగా బయటపడ్డాడు కాంతారావు. అతడికి మండిపోయింది — సరోజ వేసిన ప్రశ్నకు ... ఎక్కడికయితే యీ మనిషి కెందుకంట?... పనిలేకపోతే సరి!

అతడు వెళ్ళేసరికి ఆడవాళ్ళగేటు మూసి వుంది. చేసేదిలేక, నొసటి వ్రాతను నిందించుకుంటూ వెనక్కి తిరిగాడు. అతడు డిపార్టుమెంటు రూమ్సు దగ్గరికి వచ్చేసరికి, ప్రొఫెసరు తన గదిలోంచి బయటకు వస్తున్నాడు.

"ఏమిటోయ్, ఇంకా యింటికి వెళ్ళలేదా?" అని పలకరించారాయన కాంతారావును.

"లేదండి...కాస్త తలనొప్పిగా ఉంది,"— చిన్న అబద్ధం ఆడేశాడు కాంతారావు—ఆ అబద్ధం సందర్భోచితం కాకపోయినా.

ప్రొఫెసరుగారు నవ్వారు.

"ఎవరేనా తలనొప్పి వస్తే యింటికి వెడతారు. మరి నువ్వేమో తలనొప్పిని ఇక్కడే ఉండి పోయ్యావన్నమాట! రిసెర్చి వర్క్ జాస్తవటం వల్ల బుర్ర పెర్వర్టెడ్ అయిందా యేమిటోయ్?... త్వరగా ఏ రిక్షాలోనో

ఇల్లుచేరి, నొప్పెయిను రాసుకు పడుకో."

"అలాగేనండి" అంటూ ప్రొఫెసరుతో బాటే నడక సాగించాడు కాంతారావు. గేటు దగ్గరికి వచ్చాక లోపలికి చూశాడు. హాల్లో అనూరాధ లేదు. వెళ్ళిపోయినట్టుంది.

"థాంక్ గాడ్" అనుకున్నాడు. హాలు దాటి వచ్చాక ప్రొఫెసరుతో చెప్పేసి ఇంటి దారి పట్టాడు.

* * *

తమాషాయేమిటంటే, నిత్య జీవితంలో కొన్ని సందర్భాల్లో నిజాలు అబద్ధాలయినట్టే, అబద్ధాలు కూడా నిజాలవుతుంటాయి. కాంతారావు ప్రొఫెసరుతో తలనొప్పిగా ఉందని అబద్ధం ఆడినా, ఇంటికి వెళ్ళాక నిజంగానే తలనొప్పి పట్టుకుంది.

అతడు కాసేపు చల్లగాలిలో పడుకుందామని మేడమీదికి వెళ్ళబోతుంటే, వరండాలో భర్తతో సరదాకు పేకాడుతున్న హేమ అంది:

"అలా వున్నావేమిటన్నయ్యా?" అని.

"తలనొప్పిగావుంది చెల్లాయ్" అన్నాడు బాధగా.

"పుస్తకాల బీరువాలో అమృతాంజనం వుంది-రాయి" అంది హేమ.

"కానీ...ఈసారి నువ్వు ఆట చెప్పాలి" అని హేమాను హెచ్చరించాడు రమణ-పేకాటలో బయటిప్రపంచాన్నే మరచిపోయినవాడై.

ఇంట్లోకివెళ్ళి బీరువాలో వెతికాడు కాంతారావు. కణతలు పగలగొట్టినట్టు బాధగా వుండటంవల్ల ఎడంచేత్తో తల గట్టిగా పట్టుకుని, మెల్లగా బీరువాలో కలయజూచాడు. అమృతాంజనండబ్బా అగుపించలేదు. వాకిట్లోకి వచ్చి ఆ సంగతి హేమకు చెప్పి మేడమీదికి వెళ్ళిపోయాడు. అతడలా తలపట్టుకునే మేడ మెట్లెక్కుతుంటే అతడివేపు జాలిగా, రమణవేపు దీనంగా చూస్తూవుండిపోయింది హేమ.

తను వెళ్ళి బీరువా వెదికితే?—అనుకుంది మళ్ళీ. ఆటమధ్యలో లేచి పోతే భర్త ఏమనుకుంటాడోనని అలాగే కూర్చుండిపోయింది. మనస్సు వికలంగా వుంది.

పేకాట సజావుగా సాగలేదు. ఇద్దరికీ విసుగెత్తింది, ఆపేశారు. గబగబా ఇంట్లోకి వెళ్ళి బీరువాలో పుస్తకాలన్నీ తీసి కిందపడేసి అమృతాంజనంకోసం వెతికింది హేమ. అది కనబడలేదు.

అప్పుడు గుర్తొచ్చింది హేమకు—క్రితం రాత్రి రత్నమ్మ తలనొప్పి నెపంతో అమృతాంజనం తలకతో మెత్తుకుంటూండగా తను చూసిన వైనం.

వెళ్ళి రత్నమ్మ నడిగింది. ఆవిడ అక్కడనుంచి లేవకుండానే చాలా దీర్ఘంగా ఆలోచన చేసి, దాన్ని వంటయింట్లో గూట్లో పెట్టినట్లు తేల్చింది. వెళ్ళి చూస్తే గూటికి అడ్డంగా ఆవిడ మడిబట్ట ఆరగట్టివుంది. దాన్ని అడ్డం తొలగిస్తేగాని గూట్లో వున్న డబ్బా రాదు.

ఈ సంగతి హేమ రత్నమ్మతో చెబితే, ఆవిడ—"అయ్యొయ్యో, ఎలాగమ్మా; అది మడిబట్టే!..." అంది—ఇక యీ విషయంలో తనేం చెయ్యలేదన్న ధ్వనితో.

"నీ మడి మండిపోను!" అనుకుంది హేమ. అవతల మనిషి తలనొప్పితో యాతన పడుతూంటే—యీవిడకి తన మడిబట్ట యెక్కువయింది! ఇటువంటి మనుషులు ఎలా పుడతారో భూమ్మీద!"

అలా అనుకోవడం మినహా మరేం చెయ్యలేకపోయింది హేమ. రత్నమ్మతో వాగ్వాదం ఆవిడ నోటిముందు గెలవటం హేమ కలలోకూడా వూహించలేని సంగతి. అందువల్ల తను చెష్టఅయిపోవటం తప్ప మరోటి వుండదు.

నిస్సహాయంగా వెళ్ళి వాకిట నిలబడింది ఒకవేపు రక్తబంధం జీవ్వన పేరుకుపోతోంది. రమణ ఏమీ తోచనివాడల్లే కాలక్షేపానికి వెంపర్లాడుతున్నాడు.

ఉన్నట్టుండి రమణ "హేమా! సినిమాకు వెడదాం పద!" అన్నాడు.

హేమ అదిరిపడ్డది.

"వద్దండీ! ఈపూట నాకేమంత వుత్సాహంగా కూడా లేదు."

"ఫరవాలేదు...ఉత్సాహం లేకపోయినా భర్తకోసం ఆ మాత్రం త్యాగం చేస్తున్నావనుకో."

నిర్మొగమాటంగా త్యాగం చెయ్యమని అడుగుతూ, తను భర్తనన్న విషయం పదే పదే జ్ఞప్తి చేస్తున్న వ్యక్తికి ఆవిడ యేం జవాబు చెప్పగలదు?

"ఈ పూట మానుకుందామండీ...అన్నయ్యకు కూడా తలనొప్పిగా వుందట పాపం"

రమణ మొహం ముడుచుకుపోయింది.

"అవునే...నీకు అన్నయ్య తరువాతనేగా మేమంతా!" ఈ మాటలలో ఎంత తీవ్రత చూపించవచ్చో అంతా చూపించాడు రమణ.

ఈ మాటలు హేమ హృదయంమీద వాడి బాణాల్లా పనిచేశాయి.

ఛీ, ఏమ్మనుషులు! అనుకుంది హేమ. ఎంతసేపూ ఎదుటివాళ్ళ హృదయానికి గాయం చేసి సంతోషించాలనుకుంటారేమిటి?

ఉపాధ్యాయుడు—వ్రాయవేమిరా?

విద్యార్థి—నాకు పలక లేదండి.

ఉపా—గట్టిగా పిలు పలుకుతుంది.

—ఏ. రమాదేవి (కాకినాడ)

అన్నయ్యంటే ఇంత వైమనస్యం దేనికి! అన్నయ్యపట్ల తను ఈమాత్రమేనా వాత్సల్యం చూపడం తప్పా?

హేమకు కోపం వచ్చింది. మేడమీదికి వెళ్ళి, నిద్ర పోతున్న అన్నయ్యను కళ్ళు తెరిపించి కూచోబెట్టి, "నీకు బుద్ధిలేదు. ఈ ఇంట్లోంచి వెళ్ళిపో"—అని చెబుదామా అనిపించింది. తనలోని కోపాన్ని ఎవరిమీద చూపించి మనసును తేలిక చేసుకోవాలో తెలియలేదు హేమకు.

ఎలాగయితేనేం సినిమాకు వెళ్ళటానికి ఒప్పుకుంది హేమ. రమణను టాయిలెట్ కానిమ్మని చెప్పి ఇంట్లోకి వెళ్ళింది. రత్నమ్మ పెరట్లో వుంది. హేమ గబగబా వంటింట్లోకి వెళ్ళి రత్నమ్మ మడిబట్టను లాగి పారేసి, గూట్లోవున్న అమృతాంజనం డబ్బా తీసుకొని మేడమీదికి వెళ్ళింది.

కాంతారావు మగతనిద్రలో వున్నాడు. కొంచెం జ్వరంకూడా తగిలినట్టుంది. హేమ అమృతాంజనం రాస్తుంటే కనులు విప్పి చూశాడు.

రమణా హేమా కలిసి సినిమాకు బయలేరబోతుండగా రత్నమ్మ తన మడిబట్టకు పట్టిన దుర్గతి గ్రహించి అన్యాపదేశంగా దండకం చదవసాగింది. హేమ ఏమీ జవాబివ్వలేదు—ఆవిడే నోరునొచ్చి వూరుకుంటుంది లెమ్మని. తనని కాదన్నట్టుగా సినిమాకు వెళ్ళింది.

వెళ్ళిందే కాని ఆమె మనసు మనసులో లేదు. రత్నమ్మ బహుశా తనకోపాన్ని అన్నయ్యపైకి తిప్పింది గావల్ను! ఎంతకయినా ప్రతిభావంతురాలు కదా రత్నమ్మ!

సినిమానుంచి రాగానే మనసు నిలువక నేరుగా మేడమీదికి వెళ్ళి చూసింది. కాంతారావు నిద్ర పోతున్నాడు. జ్వరం ఎక్కువ కాస్తోంది. రత్నమ్మగారు పథ్యం అయినా ఇచ్చినట్టు లేదు.

ఈ మనిషికేం ఖర్మం పట్టిందని? ఇక్కడ వుండి యీ అవస్థంతా ఎవరు పడమన్నారు? ఇంకొకచోట వుంటే డబ్బు ఖర్చు పెట్టి రాజోపచారాలు చేయించుకో వచ్చునే! ఇంత చదువు చదివినా ఈపాటి తెలియని మనిషి ప్రపంచంలో ఎలా నెగ్గుకురాగలడు!

దండెంమీద శాలువా తీసి అతడికి కప్పి వెళ్ళింది హేమ.

మర్నాడు పొద్దునకూడా కాంతారావుకు జ్వరం అలాగే వున్నది. హేమ భర్తతో చెప్పింది. ఆయనతో చెబితే వున్న జ్వరాన్నంతా తీసేస్తాడని కాదు; తను చెప్పవలసి వుందని భావించింది కాబట్టి చెప్పింది. రమణ ముక్తసరిగా "మందు తెప్పించి ఇవ్వు," అని చెప్పేసి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిపోగానే హేమ నారాయ

(51-వ పేజీ చూడండి)

# మన దేహస్థితి

## రోగకారక క్రిములు

గత వారం క్రిములను గురించి కొద్దిగా తెలుసుకున్నాము. సాధారణంగా క్రిములు శరీరంలోకి మూడు మార్గముల గుండా ప్రవేశిస్తవి. (1) చర్మం గాని, మ్యూకస్ మెంబ్రేను గాని క్రిములతోనో క్రిములున్న ప్రదేశంతోనో సంయోగం పొందినప్పుడు (2) క్రిమి భూయిష్ఠమైన గాలిని లోపలికి పీల్చినప్పుడు (3) క్రిములు చేరిన ఆహారమునో పానీయమునో మనం తీసుకున్నప్పుడు, ఈ విధంగా క్రిములకు శరీరంలో ప్రవేశించడానికి వీలు కలగంగానే అవి తమ టాక్సిన్లతో చర్మమునో, మ్యూకస్ మెంబ్రేనునో ఛేదించి శరీరంలో ప్రవేశిస్తవి. బేక్టీరియా, ఫంగస్, పేరసైట్, వైరస్ అని రోగకారక క్రిములు నాలుగు విధములు. ఈ నాలుగు విధములయిన వ్యాధికారక సూక్ష్మజీవులూ శరీరమును పై విధంగానే వ్యాధిగ్రస్తము చేస్తవి. వైరస్‌ను గురించి ఇంతకుముందు ప్రస్తావించలేదు. వైరస్ బేక్టీరియా కన్నా అతి సూక్ష్మమైన క్రిమి. దానిని ప్రస్తుతం తయారైన మైక్రోస్కోపులతో చూడడం సాధ్యం కాదు. కల్చర్ల ద్వారా పెంచడమూ సాధ్యం కాదు-(ఆయా క్రిమి ప్రవృద్ధికి దోహదం చేసే ఆహారపదార్థంలో క్రిములను వేసి వాటిని పెంచడమును "కల్చరు" అంటారు.) పేరసైట్లు సాధారణంగా, తాముగా శరీరంలో ప్రవేశించవు. దోమవంటి కీటకములు మనల్ని కరిచినప్పుడో, ఆయా పేరసైట్లతో నిండి ఉన్న మాంస ఆహారములను మానవులు భక్షించినప్పుడో, ఇవి దేహంలో ప్రవేశిస్తవి. అంటే, అవి మానవదేహంలో ప్రవేశించడానికి మరొక జీవి సహకారం కావాలన్న మాట. మలేరియా, ఫైలేరియా, అతి దీర్ఘ నిద్ర గలిగించే స్లీపింగ్ సిక్‌నెస్ అనే వ్యాధి యీ వర్గానికి చెందినవి. వాటిని గురించి విపులంగా సందర్భం వచ్చినప్పుడు చర్చిస్తాను. "ఇన్‌ఫ్లుయెంజా" మశూచికము, మొదలయిన వ్యాధులు వైరస్ వల్ల కలిగే వ్యాధులు - బేక్టీరియావల్ల కలిగే వ్యాధులన్నీ, స్పర్శ వాయ్వాహారపానీయాదులవల్లనే కలిగినా, ప్లేగు వ్యాధిని కలిగించే క్రిమి మాత్రం, ఎలుకల శరీరంమీద జీవించే పేను వంటి కీటకం కాటు ద్వారా శరీరంలో ప్రవేశిస్తుంది. కొన్ని విషజ్వరములలో, ఏ మార్గం గుండా ఇన్‌ఫెక్షన్ మన శరీరంలో ప్రవేశించిందో యింకా శాస్త్రజ్ఞులు తెలుసుకోలేదు.

శరీరం అంతరాశములలో ఉండే టిష్యూలు, వాటిని క్రమ్మి ఉండే మెంబ్రేనులు, సాధారణంగా క్రిమిరహితములుగానే ఉంటవి. సకృత్తుగా క్రిములు శరీరంలో ప్రవేశించినా, వ్యాధి యేర్పడకముందే ల్యూకోసైట్లు వాటిని దిగమింగి చంపివేయడంవల్ల వ్యాధి యేర్పడదు. కొంతమంది జీర్ణ, శ్వాసకోశములను కప్పి ఉండే మ్యూకస్ మెంబ్రేనులలో అనేకరకముల వ్యాధికారక క్రిములు బహుకాలం వర్ధిల్లుతూ, ఏ అపాయమూ కలిగించకుండా ఉండవచ్చును. ఇటి మనుషులను 'కేరియర్స్' (Carriers) అంటారు. వీరిని 'క్రిమి వాహకులు' అనవచ్చును. ఒక్కొక్కప్పుడు ఒక వ్యాధితో బాధపడిన తరువాత, ఆ వ్యాధి నయమైనా, ఆ వ్యాధికారక క్రిములు రోగిలో బహుకాలం వుండవచ్చును. వారు ఆ వ్యాధితో బాధపడక

డా॥ గాలి బాలసుందరరావు

పోయినా, ఇతరులను ఆ క్రిమి కోపానికి గురి చేయవచ్చును ఈ 'కేరియర్ స్థితి'లో. అట్టివారు కొన్ని సంవత్సరము లుండవచ్చును. సాధారణంగా టైఫాయిడ్ బహుసంఖ్యాకులలో ఏకకాలంలో సంభవించడం యీ కేరియర్లవల్లనే. ఈ పరిస్థితిని ఎపిడెమిక్ అంటారు.

ఒక వ్యాధికి కారణమైన క్రిమి కొంతమందిలో రోగం కలిగించడానికి, మరికొంతమందిలో నిర్వీర్యమై, అక్కర్లేని అతిథిలాగా పడివుండడానికి కారణం ఏమిటి? ప్రతివ్యక్తిలోనూ, కొన్ని క్రిముల రోగకారకశక్తిని నిరోధించే శక్తి సాధారణంగా ఉంటుంది. ఆ శక్తి కొందరిలో అధికంగా ఉండవచ్చును. మరికొందరిలో అల్పంగా ఉండవచ్చును. కొందరిలో అసలే లేకుండా ఉండవచ్చును. ఈ చివరజాతి మనుష్యులలో రోగక్రిమి ప్రవేశించినప్పుడు రోగం తీవ్రంగా ఏర్పడుతుంది ఈ శక్తి కొద్దిగా వున్నవారిలో రోగం యేర్పడినా తేలికగా పోతుంది. ఇంతేకాదు. కొన్ని పరిస్థితులలో ఈ క్రిమి నిరోధకశక్తి ఉన్నవారిలో కూడా ఇతర పరిస్థితులలో అవి తగ్గిపోవడమో అసలు లేకుండా నేపోవడమో సంభవించవచ్చును. ఒక క్రిమిని నిరోధించే శక్తికలవారికి మరొక క్రిమిని నిరోధించే శక్తి లేకపోవచ్చును. ఒక్కొక్కప్పుడు ఒకజాతికే ఒకవ్యాధిని నిరోధించేశక్తి ఉండవచ్చును. నీగ్రో జాతికి సిఫిలిస్ అనే వ్యాధి రాదు. ఒక క్రిమికి లొంగిపోయి రోగగ్రస్తం అయ్యే శరీరస్వభావాన్ని 'ససెప్టిబిలిటీ' (Susceptibility) అంటారు. అంటే వారిలో ఆరోగానికి ఒక సుముఖత్వం లేక అనుకూలత ఉన్నదన్న మాట. ఇంతేకాదు. ఒక రోగక్రిమి రోగకారకశక్తి, ఎప్పుడూ ఒకలాగా ఉండదు. కొన్ని అనుకూల పరిస్థితుల్లో అది హెచ్చుగానూ అననుకూల పరిస్థితుల్లో తక్కువగానూ ఉంటుంది. కాని వ్యక్తి అలిసి ఉన్నప్పుడూ, జలుబు చేసినప్పుడూ, ఆహారాదులు సరిగా లేక శరీరం దుర్బలమై ఉన్నప్పుడు, విరుద్ధ శీతోష్ణస్థితులకు గురిఅయినప్పుడు రోగక్రిమి విజృంభణకు ఎక్కువ అవకాశం వుంటుంది. అంటే రోగానికి ప్రధాన కారణములు నాలుగు: (1) దేహంలో క్రిమి ప్రవేశం. (2) ససెప్టిబిలిటి. (3) క్రిమి ఉగ్రతం. (4) క్రిమి వృద్ధికి అనుకూలపరిస్థితులు. రోగి టిష్యూలను ఎంతత్వరగా తీవ్రంగా మార్చివేస్తే ఆ క్రిమి అంత ఎక్కువగా వీర్యవంతమైందన్న మాట.

కొన్ని క్రిములు శరీరంలో ఒక భాగంలో ప్రవేశించి, మరొక భాగాన్ని రోగగ్రస్తం చేయవచ్చును. "మెనింజైటిస్" అనే మెదడు వ్యాధికి కారణమైన మెనింగో కాకస్ అనే క్రిమి, ముక్కులో మ్యూకస్ మెంబ్రేనులో ప్రవేశించి తర్వాత మెదడుకు చేరుకుంటుంది. ఇల్లా అతి ఆరోగ్యవంతమైన ముక్కులో ఇవి ప్రవేశించవచ్చును. (ఆహారంలో కొన్ని విటమిన్ల లోపం, (విటమిన్లంటే శరీరానికి అత్యల్ప పరిమాణంలోనైనా అత్యవసరమైన సంక్లిష్ట రసాయానికి వస్తువులు. ఇవి చాలా ఉన్నవి. వాటి విషయమై సందర్భం వచ్చినప్పుడు వివరిస్తాను.) క్రిమి దోషానికి దోహదం కలిగిస్తుంది. ఉదాహరణంగా విటమిన్ ఎ, విటమిన్ డి, విటమిన్ సి, లోపం అనేక చర్మవ్యాధులకూ, మ్యూకస్ మెంబ్రేను వ్యాధులకు కారణం.

కొందరిలో రోగనిరోధకశక్తి సహజంగా అధికంగా ఉండడానికీ, కొందరిలో క్రిమి ప్రవేశం వ్యాధి కారణం కాగా, మరికొందరు క్రిములకు తమ దేహంలో ఆతిథ్యమిస్తూ

కాయిగా ఉండడానికి కారణం విజ్ఞాన శాస్త్రం ఇంకా కనుక్కోలేదు. కొందరిలో ఈ రోగనిరోధక శక్తి అధికం గావటానికీ కొందరిలో అసలే లేకపోవడానికీ సరిఅయిన కారణం విజ్ఞానం వివరించనంతవరకు, వైజ్ఞానికులుకూడా కర్మసిద్ధాంతాన్ని విశ్వసించక తప్పదేమో !

ఒకమాటు రోగక్రిమి శరీరంలో ప్రవేశించగానే, దాని టాక్సిన్లతో పరిసర జీవకణములు చెడి, వాటికి ఒక స్థావరం ఏర్పడుతుంది. అక్కడనుండి అవి రక్తగతి ద్వారానూ, లింఫాటిక్సు ద్వారానూ శరీరంలో ఇతర ప్రదేశములకూ, తమకు అనుకూలమైన ప్రదేశములకూ ప్రాకిపోతవి. ఒక్కొక్కప్పుడు ఏ చోటినుంచి క్రిములు ప్రవేశించినదో నిర్ణయించడమే సాధ్యంకాదు. రోగక్రిములవల్ల శరీరంలోకలిగే మార్పులు, ఇన్ఫ్లమేషన్లో కలిగే మార్పులే! రక్తనాళములలో రోగక్రిములు సంచరించడమును 'సెప్టిసీమియా' (Septiceamia) అంటారు ఆహారంద్వారానో నీటిద్వారానో దేహంలో ప్రవేశించిన టైఫాయిడ్ క్రిములు వృద్ధిచెంది రక్తంలో మొదటివారం అంతా సంచరించి, తర్వాతగాని పేగుల్లో చేరుకోవు. శరీరభాగములలో చీము ఏర్పడడమును 'పయీమియా' (Pyaemia) అంటారు. ఒక్కొక్కప్పుడు చిన్నపిల్లలలో ఒంటినిండా చీముబుగ్గలు అనేకచోట్ల ఏర్పడడం మీరు చూచేఉంటారు. రక్తంలో ఈ క్రిములు సంచరించడమును అవకాశంగా తీసుకుని, ఈ రోగి రక్తాన్ని తీసి పరీక్షించి, రోగనిరూపకులు ఇది ఈ రకమైనవ్యాధి అని నిరూపించగలుగుతున్నారు. ఒక్కొక్కప్పుడు ఒక అవయవంలో వ్యాధి యేర్పరచిన క్రిమియితర అవయవములను వ్యాధిగ్రస్తం చేయవచ్చును. ఊపిరితిత్తిలో (లంగ్) నెమోనియాకు కారణమైన న్యూమోకోకస్ మెదడులోకిపోయి, మెనింజైటస్ కలిగించవచ్చు. గవదబిళ్ళలకు కారణమైనవైరస్ మగపిల్లలో బీజములలోనూ, ఆడపిల్లలలో వోవరీలలోనూ వ్యాధికలిగించి, భవిష్యత్తులో వారిని నిస్సంతులుగా చేయవచ్చును. ఇల్లా జరగడమును కాంప్లికేషన్సు అంటారు. చేయి తెగినప్పుడు ఇతరగాయములు అయినప్పుడు అక్కడ రోగకారకక్రిములు చేరి చీము ఏర్పడుతుంది. అప్పుడు ఆ గాయం సెప్టిక్ అయిందీ అంటాము. అంటే శరీరంలో ప్రవేశించిన రోగక్రిములకు నాలుగు గత్యంతరములు. (1) ప్రవేశించిన చోటనే ఉండిపోవచ్చు. (2) రక్తంద్వారానో, లింఫునాళముల ద్వారానో ఇతర అవయవములలో వ్యాధిని కలిగించవచ్చును. రక్తగతిలో అసంఖ్యాకములుగా వృద్ధిచెంది సెప్టిసీమియా ఏర్పడవచ్చును. (3) లూకోసైట్లద్వారా నశించిపోవచ్చును.

ఇన్ఫెక్షన్‌వల్ల శరీరంలో కలిగే అతిసాధారణమైన మార్పుజ్వరం రావడం. జ్వరం నుండి రోగి పూర్తి ఆరోగ్యం పొందవచ్చు. లేదా శాశ్వతంగా ఒకలోపంఏర్పడి దానితో ఆజన్మాంతమూ బాధపడవచ్చును.

కాని క్రిమిదోషం యేర్పడ్డప్పుడు శరీరంలో ఏంటిబాడీస్ ఏర్పడి శాశ్వతమైన రోగనిరోధకశక్తి, ఆ వ్యాధి విషయంలో ఏర్పడవచ్చును. ఈ రోగ నిరోధకశక్తిని 'ఇమ్యూనిటీ' (Immunity) అంటారు. ఆ విషయం వచ్చే వ్యాసంలో చర్చిస్తాను.






YOU WILL ENJOY EVERY PAGE

**UNIQUE GIFTS TO ANNUAL SUBSCRIBERS**

**A beautiful multicoloured pictorial calendar of 1961 for every annual subscriber for each magazine, sent directly from Moscow with the first issue.**

**Reduced subscription rates for every two-year subscriber and pictorial calendars of 1961 and 1962 sent with first issues of each year.**




**pictorial monthlies**

**Soviet Union (in English, Hindi & Urdu)**

*Annual Rs. 6.75  2 years Rs. 10 00*

**Soviet Woman (in English & Hindi)**

*Annual Rs. 4.25  2 years Rs. 6.00*

*send your subscriptions to*

1. Visalaandhra Publishing House, Vijayawada-2.
2. People's Book House, Hyderabad.
3. NCBH Private Ltd , Nallathambi Chetty St , Madras-2.

ADCRAFTS

టాటావారి
ఒడి కోలోన్ మరియు
ఒడి కోలోన్ సబ్బు

ముట్టుకుంటే
మంచుముద్ద




టాటా ఉత్పత్తి



పెన్షన్ కోడ్
(ఆంధ్ర & మద్రాస్) పూర్తి వివరముల గైడు. రచయిత. వి. వి. సుబ్బారావు. పుస్తకవిక్రేతలందరివద్దలభించగలదు. పోస్టేజీతో సహా రు 3-2-0 పంపవలెను. వి.పి.లు లేవు. త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం.





పళ్ల పోటా?



అమృతాంజనము

కొంచెం రాయండి



వెంటనే గుణం కనిపిస్తుంది

మీకు అమృతాంజనము ఎప్పుడు కావలసివస్తుందో మీకే తెలియదు ఇంట్లో ఎప్పుడూ ఒక బుడ్డిని ఉంచండి. ఎంతైనా నమ్మకమైనది.




అమృతాంజన్ లిమిటెడ్
14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ

JWT-AM 1090



జపాన్ యువరాజు, యువరాణి నవంబరు 29వ తేదీన న్యూఢిల్లీకి రాగానే, నగరపాలక సంఘాధ్యక్షుడు ప్రధాని శ్రీ నెహ్రూ, రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్, ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ వారికి స్వాగతం చెప్పారు

న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

# అంతర్జాతీయ సమస్యలపై ప్రధాని మోజు : సరిహద్దులో కమ్యూనిస్టుల దుష్ప్రచారం

భారతదేశం ఎందుకు ఈనాడు విచ్ఛిన్నం కావడానికి సిద్ధంగా ఉన్నదో ఇటీవల లోక్‌సభలో విదేశీ వ్యవహారాలపై రెండు రోజులపాటు జరిగిన చర్చను పరిశీలిస్తే కొంతవరకు తెలుస్తుంది. ఒక వంక ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో-ముఖ్యంగా మూడు రాష్ట్రాలనే తీసుకున్నా-కాంగ్రెసుపార్టీ ముక్కలు చెక్కలు అవుతుంటే ప్రధానమంత్రి కాంగో వ్యవహారంపై వల్లమాలిన ఆందోళన ప్రకటించారు. చైనీయులు మళ్ళీ మన భూభాగం మీద దురాక్రమణ జరిపారని నిరూపిస్తూ గత నెల ప్రారంభంలో ప్రభుత్వం శ్వేతపత్రం ప్రకటించింది. రక్షణమంత్రి శ్రీ కృష్ణమీనన్ నిరాయుధీకరణసమస్యపట్ల ఆదుర్దా వెల్లడిస్తూ లోక్‌సభలో ఒక ఉపన్యాసం ఇచ్చేశారు.

దేశంలో నిరుద్యోగ సమస్య తీవ్రతరం అవుతోంది. తిండిగింజల ధరలు ఇటీవల కొంతవరకు తగ్గినా, జీవనవ్యయం పెరుగుతునే ఉన్నది. గృహనిర్మాణం, పారిశుధ్యం, మురుగుపారుదల, రహదారుల నిర్మాణం, విద్య మొదలైనవాటికి సంబంధించిన సమస్యలు ఇంకా అపరిష్కృతంగానే ఉన్నవి. మరోవంక హిందీ ఉద్యమం భాషాప్రయుక్త రాష్ట్రాల సమస్యను సృష్టించింది. హిందీని ప్రజలపై బలవంతంగా రుద్దినట్లయితే, వారి మాతృభాషను రక్షించటం అవసరం భావమూలంగా అస్సాంలో ఒక కొత్త సమస్య ఉత్పన్నమైంది. పంజాబ్‌లో కూడా ఇలాంటి సమస్యే తలఎత్తింది. దేశ పరిస్థితులు ఇలా ఉన్నప్పుడు, కాంగో వ్యవహారాలనుగూర్చిగాని, లేక నిరాయుధీకరణ సమస్యనుగూర్చిగాని ఉపన్యాసాలు దంచుతూ, కాలహరణం చేయటం వివేకవంతమైన పనేనా? అన్నదే ప్రశ్న. ప్రతి సమావేశంలోను, భారత విదేశాంగనీతిని గూర్చి చర్చించడానికి రెండు రోజులు—బడ్జెట్ సమావేశాలలో అంతకంటే ఎక్కువ రోజులే-వృథాచేసి తీరవలసిందేనా? రాజకీయశాస్త్రం చదువుకునే ప్రతి విద్యార్థికి మన విదేశాంగ విధానం కంఠతా వచ్చు. పైగా ఈ విధానాన్ని అనుసరించినందువల్ల శత్రువులను మిత్రులుగా మార్చుకోలేకపోగా, మిత్రులను కూడా కోల్పోవలసివచ్చింది. రిపబ్లిక్ దినోత్సవాలలో రక్షణశాఖ కొన్ని ప్రదర్శనలను నిర్వహిస్తుంది. వీటిలో "వెనుకంజ" అనే ప్రదర్శనం ఒకటి. గత 2000 ఏళ్ళలో మన దేశం చేసిన పని కూడా ఇదే.

ఈనాటి దుస్థితికి మూలకారణం వేరే ఉంది. దేశక్షేమానికంటే కొందరు వ్యక్తుల మైత్రికి ప్రధానమంత్రి అధిక ప్రాముఖ్యం ఇవ్వటంవల్ల కలిగిన ఫలితం ఇది. చైనీయుల దురాక్రమణ ప్రారంభమైనతరువాత, ఎదుర్కోవలసివస్తున్న క్లిష్టపరిస్థితులలో, దేశం విడిచి వెళ్ళడానికి బాధ్యతగల రక్షణమంత్రి ఎవరైనా నిరాకరించేవారే. ప్రత్యామ్నాయంగా మరొకరిని సమితిలో భారత ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించేందుకు ప్రధానమంత్రి నియమించవలసింది.

* * *

బ్రిటిష్‌వారి యాజమాన్యంలో వెలువడుతున్న "ది స్టేట్స్‌మన్" వార్తాపత్రిక భారత సరిహద్దులలో కమ్యూనిస్టులు నిర్వహిస్తున్న భారత వ్యతిరేక కార్యక్రమాలను ప్రజల

(62-వ పేజీ చూడండి)



# తెలుగు వెలుగులు 63

మలయానిలంలో చల్లదనం, పున్నాగ తావిలో తీయదనం, చందనచర్చలో హాయి, ప్రత్యూషంలో ఉల్లాసం, ప్రియాప్రియుల గాత్ర పరిష్వంగంలో మధురానుభూతి కలిపి కొలబోసే సన్నాయి నొక్కులతో చక్కిలిగింతలు పెడుతున్న నాదస్వరసుధాలహరి శ్రీ దాలిపర్తి పిచ్చహరి.

కర్ణాటక సంగీతం దాక్షిణాత్యుల సొమ్ము అంటారు నిజమే కావచ్చు.

కాని ఆంధ్రదేశం కూడా మహామహులైన అనేక సంగీతవిద్వాంసులను ప్రసాదించింది.

వీణావాద్యంలో ప్రయాగ సంగమేశ్వర శాస్త్రి, వాయులీనంలో ద్వారం వెంకటస్వామి నాయుడుగార్లను చెప్పుకోవచ్చు. జంత్రగాత్రాలలో హరినాగభూషణం గారిని, హరికథను చెప్పటంలో ఆదిభట్ల నారాయణదాసుగారిని చూపించవచ్చు, మృదంగవాద్యంలో అశ్వధాటి రామమూర్తి గారిని చెప్పి పొంగిపోవచ్చు.

అయితే నాదస్వరం వాయించేవారిని గురించి చెప్పుకోవాలంటే తడబడవలసి వచ్చేది. ఇప్పుడా లోటు నాదస్వరసుధాలహరి శ్రీ దాలిపర్తి పిచ్చహరి తీర్చారు.

విద్వాంసులను ఒకరితో ఒకరిని పోల్చడం సరసమైనపని కాదు. పిచ్చహరి పొన్నుస్వామిపిళ్లెతో సమానుడా అనీ, రాజరత్నం పిళ్లెతో సాటిరాగలడా అనీ, వీరాస్వామి కంటె గొప్పవాడా అనీ ఆరా తీయడానికి కొందరు ప్రయత్నిస్తారు. ఇలాంటి చర్చలు లేవదీయడం, ప్రశ్నలు వేయడం, కూడదని చెప్పాలి. దాక్షిణాత్య విద్వాంసులు "భళీ" మని పిచ్చిహరి పాండితికి తలలూపిన ఘట్టాలు అనేకం.

శ్రీ పిచ్చహరి వాద్యప్రధాన లక్షణం లాలిత్యం. మధురమైన సున్నితమైన పలుకుతో స్థాయితోపాటు హాయి పెంచుతూ ఆ నాదస్వరం వీనుల విందు చేస్తుంది.

విషరదనలైన త్రాచుపాములను సమ్మోహింపజేసేదాన్ని "నాగస్వర"మని అంటారు. ఇది పాములవారి చేతిని అలంకరిస్తుంది. "నాగస్వరము" అన్న మాటకు నిఘంటువు అర్థం కూడా "సనాయి" అని ఇచ్చారు. ఈ "సనాయి" "సహనాయి" అని అఖిలభారత ప్రశస్తి పొందింది. ఇది బహుకాలము ఆంధ్రదేశంలో ఆదరణపొంది, విద్వాంసుల చేతి మేలుబంతియై విలసిల్లింది. మరీ దక్షిణాదికి చేరి పెద్దదై, ప్రాంశువై కర్ణాటకసంగీతానికి కాణాచియై 'నాదస్వరం' అనే నామంతో విద్వాంసులచేతి వన్నెలచిలకై విరాజిల్లుతున్నది.

సంగీతానికి చెందిన ఆయుధాలలో ఏ ఆయుధానికి చెందిన గుట్టుమట్లు దానివే. నాదస్వరం కొరకరానికొయ్య.

శ్రుతి బాగా తగ్గించి రెండు, ఒకటిన్నరలో వేణుగానసుఖాన్ని కలిగిస్తూ సన్నాయి నొక్కులు నొక్కి సొక్కజేసి సొగసుగా స్వరం అనగల ప్రజ్ఞ శ్రీ పిచ్చహరి సొమ్ము. 'ఇంకా తక్కువ శ్రుతిలో వాయించడం మా పిచ్చహరి అపూర్వప్రజ్ఞ. పూర్వం అల్లంత దూరంలో ఉంటేగాని వినలేని నాదస్వరం ఇప్పుడు కచేరీలో కూర్చునే వినవచ్చు' అని శిష్యుడిని గురించి చెబుతూ మురిసిపోయే వారు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు.

పలుకు పలుకుతున్నట్లే, గొంతు ఒదిగినట్లే పిచ్చహరి నాదస్వరం కూడా ఒదుగుతుంది. సారమతి, ధేనుక, నీలాంబరి, శహానా వంటి తత్వస్ఫోరకమైన రాగాలు పిచ్చహరి ఆలాపిస్తుంటే భావావేశపరవశులౌతారు శ్రోతలు.

కృష్ణాజిల్లా లక్ష్మీపురంలో పుట్టి, తండ్రి వద్ద, తర్వాత శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య గారివద్ద శుశ్రూష చేశాడు శ్రీ పిచ్చహరి. ఏ ఆస్థానం ఆదరించకపోయినా అభిమానుల ప్రోత్సాహంతో స్వయంకృషితో పైకి వచ్చాడు.

పలుమారులు దక్షిణాది సంగీతరసికుల మధ్య తన కొత్త దస్తూరిలో కస్తూరి ఘుమాయింపులు చవిచూపించాడు. జేజేలనందుకున్నాడు. ప్రస్తుతం తిరుపతి నాదస్వర కళాశాల ప్రిన్సిపాల్ గా ఉంటున్నారు.

పెళ్ళిళ్ళకు పుట్టిల్లైన గ్రీష్మ ఋతువులో అర్ధరాత్రి వేళల ఊరూ నాలుగు వీధులూ తిరుగుతూ ప్రజలు నిగురబగువుల మునిగినప్పుడు ఏ పెండ్లివారి ఊరేగింపు. ముందో తాను నాదస్వరం వాయిస్తూ మేల్కొన్న ప్రజాహృదయాలను రాగరంజితమొనర్చి ధీర స్వప్న శోభాసమీరాలు ప్రసాదించగల పుంభావ సరస్వతి శ్రీ పిచ్చహరి. ఒకవిధంగా 'నాదతనువు' అన్న పేరు ఆయన కెంతైనా తగును.





## వాచస్పతి

మనోహరాతి మధురమైన సుందరస్వప్నం నుండి లేచి స్వర్గలోకంలో తేలిపోతున్నట్లు తూలుతూ వెళ్ళి గూట్లోవున్న అద్దం ముక్క తీసుకుని చూసుకుంది రాధ— ఆత్రంగా ఆశగా. సుఖస్వప్నంతాలూకు మహదానందం క్షణంలో పటాపంచలైంది. కసిగా అద్దాన్ని గూట్లోకి విసిరి— మళ్ళీ ముక్కి మంచంలో వ్రాలి కళ్ళు తుడుచుకుంది.

ఎన్నాళ్ళగానో తపస్సు చేస్తుంటే— అందాల ఆ స్వర్లోకవాసిని ప్రత్యక్షమై మధుర మందహాసాన్ని చిలికించింది.

ఆ భువనమోహనరూపాన్ని చూశ్ళేక తన హృదయం వలవల ఏడ్చింది.

"ఎందుకలా ఏడుస్తావ్ ! ఏం కావాలి రాధా !" అంది ఆ త్రిలోకసుందరి–తియ్యని కంఠంతో.

"నాకొక్క వల్సింది ఎవ్వరూ ఇవ్వలేరు!" నిరాశగా అంది రాధ.

"నా మహిమ నీకు తెలీదు" నవ్వింది ఆ జగన్మోహిని.

"నీ అందాన్ని నాకివ్వు!"

"నీ హృదయం నాకన్నా అందమైంది !"

"కానీ ఏం ప్రయోజనం ! అది ఎవ్వరికీ కనబడదు."

"దానివల్ల నష్టమేం లేదే?"

"నా బాధ నీకర్థం కాదు."

"సరే ! నా అందాన్ని నీకిస్తున్నాను."

ఆ సౌందర్యరాశి మాయమయింది.

అంతా మోసం! ఆ అందం తనకురాలేదు. చివరకు దేవతలుగూడా మోసం చేస్తున్నారు.

రాధ బరువుగా మూల్గింది.

పిల్లికంటపడ్డ ఎలుక ప్రాణరక్షణకోసం కలుగులోకి పరుగెత్తింది.

ఎందుకో ప్రాణంమీద అంతమోజు ! అనిపించింది రాధకు.

హృదయం బాధతో మెలికలు తిరిగిపోతుంది.

కిటికీలోనుండి వచ్చిన సూర్యకిరణాలు రాధ బాధను అర్థంచేసుకున్నట్లు వెచ్చగా మెల్లగా తాకాయి.

ఎంతదూరంగా వెళ్ళైని నా తన అందవిహీనం మాటిమాటికీ గుర్తొచ్చి గుండెను బ్రద్దలు చేస్తుంది.

తనేం అపకారం చేసిందనీ-లోకంలోని అందవిహీనతనంతా ఏర్చి-కరుణామయుడైన భగవంతుడు తనలో కూర్చాడు ? తనకన్నా పాపం చేసినవాళ్ళు ప్రపంచంలో యికలేరా ? తనుచేసిన పాపాలకు యింతకన్నా కఠినమైన శిక్ష మరొకటి లేదా ?

పోని తన బాధనంతా హృదయంలో దాచుకుని తన ఏడుపేదో తను ఏడుస్తుంటే చుట్టూవున్న వీళ్ళ కొకిగోలేంటి? చూసిన వాళ్ళంతా తన్ను గూర్చి ఎగతాళిగా మాట్లాడ్డమే!

ఓ రోజున స్కూలునుండి వస్తుంటే కాలేజీపిల్లలు ఎదురయ్యారు.

గుండె దడదడ కొట్టుకోగా నాలుగంగల్లో వాళ్ళను దాటింది తను.

"ఎవర్రా! ఆ హెలెన్ ఆఫ్ ట్రాయ్!" విద్యావంతుడొకడు ఆశ్చర్యం నటించి అన్నాడు.

తక్కిన ప్రబుద్ధులంతా పక్కున నవ్వారు. తన ఒంటిమీదంతా తేళ్ళు, జెర్రులూ పాకినట్లయింది.

తన అనాకారితనాన్ని భరించేపాటి సంస్కారంగూడా యీ విద్యావంతుల్లో లేదా? ఆ ఒక్కవాక్యం వాళ్ళకెంత ఆనందాన్నిచ్చిందో- దానికి వెయ్యిరెట్లబాధ తనలో కలుగుతుందని ఆలోచించేపాటి హృదయ వైశాల్యం లేకపోయిన పిదప ఎందుకొచదువు? తగులబెట్టనా?

సృష్టిలోని సౌందర్యాన్ని చూచి ఆనందించిన మానవుడు-ఆ సృష్టికర్త చేతుల్లోనుండి వచ్చిన మరో అనాకారి వస్తువుపై సానుభూతి చూపి ఆ సర్వేశ్వరుని చిద్విలాసాన్ని అర్థంచేసుకునేపాటి సహృదయం లేకపోయిందేం?

అయినా తన అనాకారితనం తన స్వయంకృతాపరాధం కాదే?

"రాధా! ఎప్పుడో తెల్లారింది! యింకా పడుకొనే వున్నావా?" ముందు గదిలోనుండి రంగారావు కేకేసాడు.

రాధ బరువుగాలేచి ముందు గదిలోకొచ్చింది.

రంగారావు ఆత్రంగా పేపర్లో దేనికోసమో వెతుకుతున్నాడు.

"నువ్వు పాసయ్యావు రాధా!"

పేపర్లోనుండి తలెత్తి పట్టరాని సంతోషంతో అన్నాడు రంగారావు.

"నాకు తెలుసు" నిర్లిప్తంగా అంది రాధ.

"ఏం తెలుసు!" ఆశ్చర్యంతో అన్నాడు రంగారావు.

"నే పాసవుతానని తెలుసు నాన్నా!" బాధగా నవ్వి అంది రాధ.

కూతురి ఆత్మవిశ్వాసానికి గుడ్లు పెద్దవిచేసి నోరు తెరిచి చూసాడు ఎలిమెంటరీ స్కూలు టీచర్.

"నే వెళ్ళి పేపరిచ్చి వస్తాను. కాఫీ పెట్టు రాధా!"

రాధ మౌనంగా లోపలి కెళ్ళింది.

ఎందుకనో హృదయమంతా కోపంతో అసహ్యంతో నిండుకొన్నాయి.

ఏ భావమైన బైటపెట్టే నేతప్ప లేకుంటే చక్రవడ్డీలా నిముష నిముషానికీ పెరిగి

## రాధ

పోతుంది. తన కోపాన్ని ఎవరిమీద చూపుదామన్నా మనుషులే కనబడరే! అనుకుంది రాధ!

పెరట్లోకెళ్ళి ముఖం కడుక్కుని వంటింట్లో కొచ్చింది. బొగ్గులడబ్బాలోవున్న నాలుగే నాలుగు బొగ్గులు కుంపట్లో వేసి ముట్టించి కాఫీకి నీళ్ళు పెట్టింది. నాలుగు బొగ్గులైనా రాధ హృదయంలా ఘణ ఘణ మండుతున్నాయి.

"కాఫీ అయిందా రాధా!" చెయ్యిలేని కుర్చీలో కూలబడుతూ అడిగాడు రంగారావు.

రాధ కామాటలు వినిపించినా వినే స్థితిలో లేదు.

కాఫీ కలుపుతున్నా—ఆలోచనలు శరవేగంతో పరుగెత్తిపోతున్నాయి.

'రాధా' అని ఎవరు పిల్చినా, గాయాన్ని గెలికినట్లు తన హృదయం జివ్వుమంటుంది. తనకంత అందమైన పేరు తగనిమాట నిజమే! కానీ అదీ తన తప్పుకాదు. తనతో సంప్రదించకుండానే తనకాపేరు పెట్టడం జరిగిపోయింది.

ఓ రోజున క్లాసులో అటెండెన్సు పిలుస్తుంటే తను ప్రెజెంటు చెప్పి కూర్చున్నాక—

"పేరు అందమే చెడిందిరా!" అన్నాడో కొంటెకోణంగి వెధవ తనకు వినిపించేలా! వాడి పక్కనున్న కోతులిద్దరూ పండ్లికిలించారు!

ఆరోజు తన హృదయంలో కలిగిన తుపాను వర్ణనకు అతీతం!

ఇతర్ల మనసులను బాధించి ఆనందించే ఆ రాక్షసాత్మకులను మనుషులలో లెక్క వేయడం పొరబాటని తను వాళ్ళ మాటల్ని

> వైద్యుడు:- (పెద్దమనిషితో) ఈ కట్టుడుపళ్లను మామూలు పళ్లకన్నకూడ శుభ్రంగా వుంచుకోవాలి.
>
> పెద్దమనిషి:-నాకు తెలీదా, డాక్టరుగారు? అసలుపళ్లు ఊరికేవచ్చినవాయె, ఇవిబోలెడంత డబ్బుపోసి కొనుక్కున్నవాయే!
>
> కె. వెంటారెడ్డి (సర్వేపల్లి)

లెక్కచేయడం మానుకుంది. అయినా ఒక్కోసారి హృదయం బాధపడుతుంది, ఏడుస్తుంది—తనకు తిరగబడుతుంది! తను అందంగా లేనంతమాత్రాన అందమైన పేరు పెట్టుకోనుగూడా తనకు హక్కు లేదా? అందాన్ని ఆస్వాదించే అతిమెత్తని సౌందర్యభరితమైన హృదయాన్ని భగవంతుడెందుకిచ్చాడు మరి?

"ఏం చేస్తున్నావమ్మాయ్!"

"వస్తున్నా నాన్నా!"

కాఫీగ్లాసు తెచ్చి రంగారావు చేతికిచ్చింది.

"చక్కెర లేదన్నావుగదూ?" కాఫీ చప్పరిస్తూ అడిగాడు.

"ఊ.....పిన్నిగారిదగ్గిర బదులు తీసుకున్నాను."

"ఆమాట మర్చిపోయ్యాను" ఖాళీగ్లాసు రాధచేతిలో పెట్టూ అన్నాడు.

రాధ సన్నగా నవ్వి లోపలికెళ్ళిపోయింది.

రంగారావుకు మతిమరుపంటూ వుండదుగానీ—డబ్బు లేకపోవడమే మతిమరుపుకు ముఖ్యకారణం! పొద్దుట బదులుతీసుకున్న రెండు రూపాయల్లో ఓ అర్ధ వీసెడు చక్కెర తెద్దామని సంచి పట్టుకుని బజారు కెళ్ళాడు. ఆ బొగ్గులమీదే బియ్యం కడిగిపెట్టి పిల్లలు తెచ్చిచ్చిన దోసకాయ తరగసాగింది రాధ.

"ఏమేవ్! రాధా! ఏంచేస్తున్నావ్?"

చంకలో మూటతో తొంగిచూసింది పార్వతమ్మ.

కళావిహీనంగావున్న రాధ ముఖంలో చిరునవ్వు తొణికిసలాడుతుంది.

'రా! బామ్మా! యిప్పుడేనా రావడం? అత్తయ్యవాళ్ళు కులాసాగా వున్నారా?" కత్తిపీటమీదనుండి లేచి అంది రాధ.

"అంతా బాగున్నారే! దార్లో కిష్టడు కనబడి చెప్పాడు నువ్వు పాసయ్యావటగదూ?"

సంతోషంగా అంది పార్వతమ్మ! రాధ ఏం సమాధానం చెప్పకుండా ముసలావిడ ముఖంలోకి చూడసాగింది.

"ఏమిటే తప్పావా?" గాభరాగా అంది ముసలావిడ.

"ఉహు! అలా ఎప్పటికీ కాదు."

"నిజమేనేతల్లీ, నీ తెలివితేటలు నాకు తెలీదూ! మీ అమ్మేవుంటే ఎంత సంతోషించేదో! ఇదో! మీ అత్త పంపింది-మల్లెపూలు" పూలపొట్లం రాధ చేతిలో పెట్టూ అంది. రాధ పూలపొట్లం తీసుకుని స్టూలుమీద పెట్టింది.

"అలాగున్నావేం? తర్వాతేంచేస్తాట మీ నాన్న? పై చదువుకు పంపుతాడా?"

"ఉహు! లేదు బామ్మా! ఉండు నీకు కాఫీ పట్టుకొస్తాను."

"ఇప్పుడేం అక్కర్లేదే రాధా! యింతకూ వీడెక్కడ?"

"బజారు కెళ్ళాను. అత్తగో !"

"అమ్మో? ఎప్పుడు రావడం అక్కయ్య వాళ్ళంతా కులాసేనా ?"

"అంతా బాగున్నారు. ఏంటో అక్కడున్నానన్నమాటే కానీ-తల్లిలేని! - యిది ఎలాగుందోనని మనసంతా యిక్కడే !"

"మరి నేనేం చెయ్యను ? మేం తాగే కలో గంజో నువ్వూ తాగుతావంటే- అక్కయ్య నామాట వింటేనా ? పెద్దతనంలో యిక్కడ నీకు అమరికగా వుండదని అక్కయ్య నిన్నక్కడకు తీసికెళ్ళె ! నువ్వూ అక్కయ్య మాటకు తాళం వేస్తివి !"

"అవున్రా! వాళ్ళేదో అంటున్నా వాళ్ళు! ఎక్కడైతే ఏం ? యిద్దరూ బిడ్డలేగా !"

మూట విప్పి ఒక్కొక్క వస్తువే బైటపెట్టూ అంది ముసలావిడ.

"అవునేవే ! ఎలా చెప్పుకున్నా సరిపోతుంది !"

"యిదో ! రాధా ! మీ అత్తయ్య నీకీ చీర పంపింది."

"యీ చీర నే కట్టుకుంటే దీని అందం కూడా పోతుందేమో !"

రంగారావు బాధగా చూసాడు రాధ ముఖంలోకి.

"అదేంటే ! చిత్రంగా మాట్లాడ్తావు !"

ముసలావిడ దండించింది.

"నీకు తెలీదు బామ్మా !"

"చాల్లే ! నోర్మూసుకో !"

రాధ చీర తీసుకుని లోపలికెళ్ళింది.

పార్వతమ్మ తను తెచ్చిన పప్పులూ కూరగాయలూ వంటింట్లోకి తీసికెళ్ళింది.

రంగారావు డాక్టరుగారమ్మాయికి ట్యూషను చెప్పేందుకు వెళ్ళాడు.

ముసలావిడ బావిదగ్గరకెళ్ళి రెండు చెంబులు నీళ్ళు పోసుకుని మడికట్టుకుని కుంపటిముందు కూర్చుంది. కుంపటిమీద పెట్టిన బియ్యం నీళ్ళూ సత్యాగ్రహం చేసినట్లు అలాగే వుండిపోయాయి. బొగ్గులుంటేగా వుడికేందుకు! గిన్నె దించి బియ్యం మరి రెండుసార్లు కడిగి - బొగ్గలకోసం చూసింది పార్వతమ్మ.

"బొగ్గులేవూ !"

"అయిపోయాయ్ !"

"అన్నం కూరెలా అవుతుంది ?"

"ఆ బొగ్గుంమీదఅన్నమన్నా అయ్యుంటే దోసకాయ పచ్చడిచేస్తే సరిపోయేది"

ముసలామె బరువుగా మూల్గి

"పోనీ ! రాత్రి వంటకో" అంది.

ప్రక్కింటికెళ్ళి చిన్నబుట్టనిండా బొగ్గులు తెచ్చింది రాధ.

కొడుకు ఆర్థికపరిస్థితికి పార్వతమ్మ చాలా కలవరపడింది.

"మీ అత్తయ్యకే కొడుకుంటే ఎలాగో నీమెళ్లో మూడు ముళ్ళూ వేయించేదాన్ని." రాధ ముఖంలోకి చూసి విచారంగా అంది ముసలావిడ.

"లేకుండడమే మేలయింది" రెండుగదులకు మధ్యనున్న గడపల్లో కూలబడ్తూ అంది రాధ.

పొట్లకాయ తరుగుతున్న ముసలావిడ తలెత్తి చిత్రంగా చూసింది రాధముఖంలోకి. తొమ్మిదిన్నరకు రంగారావు భోంచేసి స్కూలు కెళ్ళేటప్పుడు పార్వతమ్మ కొంగున్న రెండు రూపాయలు తీసి రంగారావు చేతిలో పెట్టి బొగ్గులు పట్టించుకురమ్మంది.

రాధ కంచంలో అన్నంపెట్టి తనింత తిని గీతాపారాయణం మొదలు పెట్టింది ముసలావిడ.

ఆ సాయంత్రం యింటికొచ్చేటప్పుడు ఓ అణా కూలీ యిచ్చి బొగ్గులు పట్టించుకొచ్చాడు రంగారావు.

ముసలామె ఓగంటలో వంట ముగించింది. రాధ బెడ్‌లైటు వెలిగించి రెండు గదుల మధ్య గడపలో పెట్టి - లైటుముందు కూర్చుని పాత న్యూస్‌పేపరు తిరగెయ్య సాగింది. ముసలామె ముందుగదిలో రంగారావు కూర్చొనున్న కుర్చీకి ప్రక్కగా చేరగిలబడి కొడుకుతో మాటల్లోకి దిగింది.

"రాధవిషయం ఏమనుకున్నావు? పెళ్ళి మాటేమన్నా ఆలోచించావా?"

"లేదమ్మా! డబ్బు కావొద్దూ? వచ్చే అరవై భోజనానికే సరిపోకపోయె!"

"నర్సింగ్ కన్నా - టీచర్ ట్రెయినింగ్ కన్నా వెళ్తా బామ్మా!" పేపర్లోనుండి తలెత్తి అంది రాధ.

"ఏంటీ? నర్సుగానా? అవ్వ!" నోరు నొక్కుకుంది ముసలావిడ.

"ఏంబామ్మా! తప్పా?"

"తప్పా! తప్పన్నరా! నర్సుపని చెయ్యడం మన యింటా వంటా వుందా? నర్సుపని చేసి కిరస్తానీవాళ్ళల్లో కలిసిపోతావటే! ఏవిట్రా యిది రంగా!"

"ఏవిటమ్మా!"

"నర్సుట్రెయినింగ్‌కు పంపిస్తావా?"

"యింకా ఆమాటేం అనుకోలేదు."

"ఇంక చదువూ వొద్దూ—పాడూవొద్దూ చదువులు పూర్తయ్యాక పెళ్ళిళ్ళు చెయ్యాలంటే ఎంత కష్టమో ఓసారి కళ్ళు తెరిచి నాలుగువైపులా చూస్తే తెలుస్తుంది. మీ చిన్నాన్న కూతుళ్లు లేర్రా! కామేశ్వరీ - వారిజా - ముప్ఫయ్యేళ్ళు పైబడ్డా అలాగే వుండి పోయ్యారా? మొన్న కనబడి పాపం కష్టాలన్నీ వెళ్ళబోసుకున్నాడు. ఎందుకు చదివించానా అని యిప్పుడు బాధపడుతున్నాట్ట! రెండో సంబంధానికైనా మూడో సంబంధానికైనా యివ్వడానికి సిద్ధంగా వున్నాట్ట! విన్నావా?"

"అలాగా!"

"అసలా వారిజమీదైతే ఏంటేంటో




బట్టలను
ఎంతో
శుభ్రముగా
ఉతుకుకొనుటకు

నిరాల

బార్
సబ్బు
వాడండి




ASP/N 2

కథలు పూరంతా చెప్పుతుంటారు! నిజా నిజాలు ఆ భగవంతుడికే తెలియాలి మరి! నువ్వన్నన్నా చెప్పరా రంగా! పెళ్ళి కాకుండా ఆడపిల్ల యింట్లో వుందంటే నలుగురు నాలుగు రకాలుగా చెప్పుకుంటారు—"

"నీదంతా చాదస్తమమ్మా!" నవ్వి అన్నాడు రంగారావు.

"మీరెన్నన్నా అనండి! నిప్పులేందే పొగ రాజుతుందంటారా?"

"లోకులు కాకులు బామ్మా! ఆ కాకి కూతలకు విలువలేదు" బెడ్ లైటు వత్తి కొద్దిగా కొద్దిగా ఎక్కిస్తూ అంది రాధ.

"మీ చిన్నాన్న ఆరోజు చెప్తే నామాట చెవినేసుకున్నాడా! ఈరోజు అనుభవిస్తున్నాడు!"

"లోకంలో ఎంతమంది చదువుకోటంలేదు

# రాధ

బామ్మా" విసుక్కుంది రాధ.

"అందరి సంగతి మనకెందుకే తల్లీ! అసలు చదివించే శక్తి మీ నాన్నకు లేదు. ఏఅయ్య చేతిలోనో నిన్ను పెడితే వాడి బరువు తీరిపోతుంది. ఎప్పటికైనా ఒకడి చేతిలో పెట్టాల్సిందేగా!"

"నేను పెళ్ళి చేసుకోను బామ్మా!"

"అదేం!" పార్వతమ్మ రంగారావు ఆశ్చర్యంగా అన్నారు.

"నాకు పెళ్ళేంటి!"

"దీనికి తెలివెక్కువైందిరా!" అంది ముసలావిడ.

పార్వతమ్మ మాటకు జవాబు చెప్పకుండా రంగారావు ఆలోచించసాగాడు.

మూడు సంవత్సరాలుగా తను చూస్తున్నాడు రాధ వైఖరి ఒక విధంగా వుంది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటుంది. పద్దెనిమిదేళ్ళ పిల్లలో వుండాల్సిన వుత్సాహంగానీ సంతోషంగానీ రాధలో లేవు. ఇన్నాళ్లిగా రాధ అనాకారితనాన్ని గురించి తను ఎక్కువగా ఆలోచించలేదు. అసలు రాధ అనాకారిగా తనకళ్ళకు కనిపించనేలేదు. ఈరోజు ఆ అనాకారితనమే తన జీవనసమస్యగా తయారైందని తెలుసుకోడానికి అట్టే కాలం పట్టలేదు రంగారావుకు. తనెంత అనాకారో రాధకు తెలుసు - అందుకే పెళ్లి చేసుకోనంటుంది - తను వొప్పుకోవడం కాదుగానీ - తన్ను చేసుకోను ఎవ్వరూ యిష్టపడరని రాధకు తెలుసు. రాధ ఎంత అనాకారో అంత తెలివిగలది! నివురుగప్పిన ఆ తెలివి తేటల్ని ప్రకాశింప చెయ్యాలంటే - దానికి సాధనం ఒకటే ఒకటి డబ్బు! డబ్బు కావాలి! తనదగ్గర డబ్బు లేదు. రాధ తెలివి తేటలలా అణగారి పోవాల్సిందే!

"ఒరే! ఎదిగిన పిల్లను అలా యింట్లో వుంచుకోగూడదురా! మనకు తగినట్లే గంతకు తగ్గ బొంతలా ఏదో ఓ సంబంధం చూసి ముడేస్తే సరిపోతుంది."

రంగారావు దీర్ఘాలోచనకు అడ్డుపడింది ముసలావిడ.

"నాకు తెలుసమ్మా! కానీ ఏంచెయ్యను? ఈ కాలంలో డబ్బుంటే కోతికైనా పెళ్ళి చెయ్యొచ్చు!"

"లేని డబ్బు రమ్మంటే ఎక్కణ్నుంచి వస్తుంది? మన అందుబాటులో వుండే సంబంధమే చూసుకోవాలి! మీ అక్కయ్యే పెళ్లి ఖర్చు పెడ్తానంది."

"అదికాదమ్మా! దారినపొయ్యే దానయ్యకిచ్చినా వాడు రాధను చేసుకోను యిష్టపడొద్దూ?" కూతురి అనాకారితనాన్ని అంతకన్నా విడమర్చి చెప్పడం రంగారావుకు చేతకాలేదు.

"దానికేంరా? బంగారంలాంటి బుద్ధీ, తెలివి తేటలూను - అయినా కొస్త ఎఱ్ఱతోలుంటే సరిపొయ్యేది - ఈ నల్లరంగు మన యింటా వంటా లేదురా ఎక్కణ్ణుంచి వచ్చిందోమరి!" ఆశ్చర్యపడింది ముసలావిడ.

"తాతయ్య నల్లగా వుండేవాడు కాదూ?"

"ఏంకర్మో! మీ అక్కయ్య వాళ్ళూళ్లోనే ఒక సంబంధముంది - మూడో పెళ్లే అనుకో! మాంఛి స్థితిపరుడు! రమ్మని రాస్తే వచ్చి అమ్మాయిని చూసిపోతాడు."

"మూడో పెళ్ళా!" గొణిగాడు రంగారావు.

"రాధ ఒప్పుకోదనా? దాన్ని ఒప్పించే భారం నాది"


## మీ సొమ్మునకు మేలైన విలువ




మీరు కొనుటకు వెచ్చించిన సొమ్ములోని ప్రతి రూపాయికి ప్రతిఫలముగా మీకు సెలలకుతరబడి శ్రమనీయక, అధిక కాలం పనిచేసే బ్యాటరీయే సరసమైన ధరగల బ్యాటరీ. ఈ పనినే నమ్మకంగా చేసేది సిల్వర్ ఎక్సైడ్ బ్యాటరీ. తయారీలో నిశితమైనపరీక్షలకు గురిచేయబడినది గాన, ఎక్కువ శక్తి నిల్వచేసి, శక్తివంతంగా పనిచేయునట్లు నిర్మింపబడినది.

- అధిక కాలం మనగల సి వి 95 అలాయి ప్లేట్లు
- సామాన్యంగా చెడిపోని ఫోర్విక్ సెపరేటర్లు
- తాకిడికి తట్టుకొనగల గట్టి రబ్బరు కంటెయినర్లు

సిల్వర్ IS.395 ISI

ఎక్సైడ్

ఇతర బ్యాటరీలు నిల్చినా ఇదిమాత్రం ఇంకా పనిచేస్తూంది



క్లోరైడ్ & ఎక్సైడ్ బ్యాటరీస్ (ఈస్టర్న్) ప్రైవేట్ లిమిటెడ్. EBSC 21
మద్రాసు, ఆంధ్ర, కేరళ, మైసూరు రాష్ట్రములకు ప్రధాన ఏజెంట్లు.
జనరల్ ఎలెక్ట్రికల్ కంపెనీ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ, మద్రాసు-2
బ్రాంచీలు. కోయంబత్తూరు, బెంగుళూరు, సికింద్రాబాద్.

"ఆ పెళ్ళి సౌఖ్యమంటేనేం? యింట్లోనే వుంటుంది."

"ఎన్ని రోజులుంటుంది? మనిద్దరం శాశ్వతమా? తర్వాత దానిగతేం కావాలి!"

"ఏ ట్రైయినింగుకో పంపితేసరి"

"నేనింతవరకూ వాగింది నీకర్థంకాలేదన్న మాట! మళ్ళీ మొదటికొచ్చావేం రా!" పార్వతమ్మ విసుక్కుంది.

"మరి నువ్వు చెప్పేదేంటి?"

"నే చెప్పిందాన్లో ఎంత నిజముందో కాస్త తీరిగ్గా ఆలోచించుకో! డబ్బా! లేకపోయె! పోనీ పిల్ల అందంగా వుందా అంటే అసాకారం ఆయె! యిక ఎలాంటి సంబంధం వొస్తుందనుకున్నావు?" రాధ బాధపడ్తుందనన్నా లేకుండా పెద్దగా అరిచింది ముసలావిడ.

"అలాగని?"

"ఆ మూడు ముళ్ళూ పడితే దానికీ మనకూ అంగుళంలో గౌరవం! పెళ్ళయిందనే దానికి పెళ్ళికాలేదనేదానికీ ఎంతో భేదముంది. పూర్కో ఆవేశపడక కాస్త ఆలోచించుకో!" పార్వతమ్మ పోరుపడలేక వాళ్ళక్కయ్యకో జాబు వ్రాసి పడేసాడు రంగారావు. ఫలాని రోజు వస్తున్నట్లు ముందుగా తెలియజేసి వచ్చాడు పెండ్లికొడుకు. పెండ్లికొడుకుతో పాటు అతని బంధువొకాయన కూడా వచ్చాడు.

అతను రాధను చూసాడు - ముందుకాస్త జంకిన మాట నిజమే! కానీ తర్వాత ఆలోచించాడు.

తనక్కావల్సిందల్లా ముందు భార్యల బిడ్డలను పోషించడానికి ఆయా మాత్రమే! నాలుగు పైపులుండి రావందాడీగా పని వాళ్ళు బైటకు చేరవేసే వస్తువుల్ని కాస్త అవి ఒక కన్ను వాళ్ళపై వేసి యింటిని కనిపెట్టుకోనుండడం! అమ్మాయి తెలివైందని చెప్తున్నారు గనక అలాంటి పనులన్నీ శ్రద్ధగా చేయగలదు. రాధ కూడా చూసింది. చూడాలనే ఆశతో చూడకున్నా, యధాలాపంగా చూడ్డం తటస్థపడింది.

రాధ ఏనాడూ తన వైవాహికజీవితాన్ని గురించి సుఖస్వప్న సౌధాలను కట్టుకోలేదు. అందుకనే తన తండ్రి వయసులో వున్న పెండ్లికొడుకును చూసినప్పటి కూడా ఏమాత్రం కలవరపడలేదు. తనక్కావల్సిందల్లా ఆ మూడు ముళ్ళు పడ్డమే! బామ్మ అన్నట్లు తన కప్పుడు సంఘంలో ప్రత్యేకమైన ఓ స్థానం లభిస్తుంది.

అడబ్డై పుట్టాక ఆ మూడు ముళ్ళూ అవసరమంటుంది బామ్మ!

తను యిన్నాళ్ళుగా ఆలోచించి చూసినా తనకు తోచిందికూడా అంతే!

రాధ పెళ్ళికి ఒప్పుకుంది.

రంగారావుకు యిదేమంత ఆశ్చర్యంగా తోచలేదు. ఇప్పుడిప్పుడే రాధను కాస్త అర్థమవుతున్నట్లనిపించింది రంగారావుకు. ముసలావిడ మనుమరాలి తెలివితేటలను మరోమారు మురిసిపోయింది.

ఓవారంరోజులతర్వాత పెండ్లికొడుక్కు గుండెజబ్బు కావడంచేత చనిపోయాడనీ ఎవరో వార్త పట్టుకొచ్చారు.

ఆ విషయం విన్న రంగారావు సంతోషించకుండా వుండలేకపోయాడు.

రాధ నిర్వికారంగా వుండిపోయింది. మరో పది రోజులపాటు తిరిగి అతికష్టంమీద మరో సంబంధం తేగలిగాడు రంగారావు.

రాధ అనాకారని అతను యిష్టపడలేదు. ప్రెస్సులో కాంపోజిటర్ ఒకతను రాధను చూసి ఐదు వేలు కట్నమిస్తే చేసుకుంటానన్నాడు.

రాధకు నవ్వొచ్చింది. అప్పుడు తను అందంగా కనిపిస్తుందేమో!

మరో యిద్దరు పెండ్లికొడుకుల్ని చూసి రాధ గ్రహించిన విషయం - డబ్బంటే కొండమీద కోతికన్నా పెండ్లవుతుందనీ - తన అనాకారితనం ఏమాత్రం పెండ్లికి అడ్డు పడదనీ, - కానీ ఆ "డబ్బు" తమకు సుదూరంలో వుండడంచేత యిక తనకు పెళ్ళి కాదనీ తెలుసుకొంది.

ఓ రోజున నిద్రలేచేసరికి వంటింటినుండి కంపటి విసరిన చప్పుడు ముసలావిడకూ, రంగారావుకు వినిపించలేదు. ముసలావిడ పెరడంతా గాలించింది. రంగారావు కంగారు అంతా యింతా కాదు.

రాధ యింటి ఎదురుడాబాలో వున్న సుందరాంగి యొకర్తె రాధ లేచిపోయిందనే వార్తను రాకెట్‌లా వదిలేసింది.

అర్ధగంట కల్లా - వూరు చుట్టిచుట్టి వచ్చి రంగారావు గుండెల్ని బ్రద్దలు చేసిందా వార్త.

ముసలామె ముఖంలో కత్తివేసినా నెత్తురు చుక్క లేదు.

"రాధ అలాంటిది కాదమ్మా! నీకు తెలీదు"? ఏడ్వలేక సన్నగా నవ్వి అన్నాడు రంగారావు.

ఆ మూడో రోజు పాతకుర్చీలో కూలబడి రాధను గురించి తీవ్రంగా ఆలోచిస్తున్న సమయంలో పోస్టుమన్ ఓ ఉత్తరం యిచ్చి పొయ్యాడు - రంగారావు చేతికి. ఆత్రంగా విప్పి చదివాడు.

నాన్నగారికి—

నమస్కారములు. మాటమాత్రమైనా చెప్పకుండా నేనిలా వచ్చినందుకు మీరు చాలా కలవరపడుతుంటారు. నిజమే! ఆడపిల్ల యింట్లో చెప్పకుండా రావడం క్షమించరాని తప్పు. కానీ ఏం జేయను?

'ఆయా' పనికి నే వెళ్తానంటే మీ రెవ్వరూ ఒప్పుకోరని చెప్పకుండా రావలసి వచ్చింది. వచ్చే సంవత్సరం వీళ్ళే నర్సింగ్‌కు పంపుతా నన్నారు. నేనీ పని చెయ్యడం బామ్మకిష్టం వుండదు. కానీ గత్యంతరం లేదు.

నా జీవనగమ్యానికి మార్గం అందరిలాంటిది కాదని తెలుసుకొన్నాను. నాన్నా! భగవంతుని సృష్టిలో గడిపోచకు కూడా స్థానముంది. నేను అనాకారినే కావచ్చు. అంత మాత్రంచేత లోకానికి ఉపయోగపడకుండా పోతానా? బామ్మను ఏం బాధపడొద్దని చెప్పు. ప్రక్కన నా అడ్రసు యిస్తున్నాను వీలైతే ఓసారి రావలసింది.

ఇట్లు,
రాధ.

రంగారావు బరువుగా నిట్టూర్చి జాబు మడిచి జేబులో పెట్టుకున్నాడు.

"కానీ అందరూ అనుకోవడం రాధ లేచిపోయిందనేగా?"

జాబు విన్న ముసలావిడ కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది: "చూడమ్మా! వినడం తప్ప, చూడ్డం రాని ఈ పాడులోకానికి ఎందుకు భయపడావు? రాధ కాస్త అభివృద్ధిలోకి వచ్చాక ఈ లోకమే ఈ నోటితోనే ఆకాశానికి ఎత్తుతుంది! అన్నీ తెలిసి బాధపడడం అవివేకం! రాధ చేసిన పని ఏనాటికీ చెడ్డది కాదు" సగర్వంగా వీధిలోకి కడుగేస్తూ అన్నాడు రంగారావు. ★

---

వంట్లో ఏదో జబ్బువున్నదనే అనుమానంతో ఒకానొక పెద్దమనిషి, ఒక డాక్టరు దగ్గరకు పరీక్షచేయించుకుంటానికి వచ్చాడు. పరీక్షచేయడం పూర్తియినపిదప, డాక్టరు...

"ఒక్క మతిమరుపు రోగం తప్ప, మీకు, ఇంకేజబ్బూ లేదండీ!"

పెద్దమనిషి:-మీరు చెప్పినంత మతిమరుపు నాకేం లేదండి.

డాక్టరు:-అలాగైతే పోయినసారి తమరు జబ్బుపడినప్పుడు, అయిన బిల్లు చెల్లించి వెళ్ళారుగా!...

లంకా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి (గుంటూరు)

# హరివంశము

## మధురాపర్వము — 12

భూమావాస్ఫోటితస్తేన చాణూరశ్శతధాభవత్
రక్తస్రావ మహాపంకాం చకారచ తదాభువం ॥
బలదేవోపి తత్కాలం ముష్టికేన మహాబలః
యుయుధేదైత్యమల్లేన చాణూరేణ యథాహరిః ॥

— విష్ణుపురాణం

భగవంతుడు ఈ మాటలు అనగా తిరిగి ఆకాశంలో దేవదుందుభులు మ్రోసినాయి. యాదవగణ క్షత్రియలోకం సంతోషతరంగితం అయిపోయింది. దేవకి తెప్పరిల్లింది. యశోద తెప్పరిల్లింది. రోహిణి వారిని చూచి మందహాసం చేసింది. కంసమాత దుఃఖమో, సుఖమో తెలియని విచిత్రహాసం చేసింది. నాగర స్త్రీలుకిలకిలధ్వనులు చేశారు. కంసుని అవరోధవ్రాతంలో హాహాకారాలు బయలుదేరినాయి. భగవంతుడైన శ్రీకృష్ణుడు తిరిగి ఇట్లా అన్నాడు: “శస్త్రాలతో అయితే యోధులు యుద్ధాలలో ఆ శస్త్రాలతో పోరాటం సాగిస్తారు. అందులో ఒకరు ఒకరు నిహతులయినా తప్పులేదు. మల్లయుద్ధంలో అట్లాకాదు. ఇందులో ప్రతిమల్లుని నిపాతంతో సిద్ధి కల్గుతున్నది. ఇక్కడ పతనమాత్రసిద్ధియేగాని ప్రతి మల్లుణ్ణి వధించడం తగనిపని. అట్లా వధించడం పాపం. అట్టి బహు పాపాలను ఈ ఇద్దరు మల్లులు చేశారు. వీరికి మరణమే శిక్ష.’

అనగా తిరిగి దేవదుందుభులు మెరసినవి. ‘జయస్వ కృష్ణ చాణూరం దానవం మల్లరూపిణం’ అన్న నినాదాలు తిరిగి విన్పించినవి. అంతలో రామకృష్ణులు పొంగిపోయినారు. చాణూర ముష్టికులు చక్కని కడకతో విజృంభణం చూపించారు. తిరిగి వారిమధ్య పోరు ఘోరమై సాగింది. అడవులలో ఏనుగులు పోరాటం సాగించినట్లు వారు పోరాటం సాగించారు. ఒకసారి పర్వతాలను పోలి ఢీకొంటున్నారు. అంతలో వక్ష సంశ్లేషణావరోధంగా సన్నిపాతగతులవుతున్నారు. అంతలో ప్రసవ్యమైన వేగంతో ఒకర్ని ఒకరు నెట్టుకొని దూరగతులవుతున్నారు. ఒకసారి భూమిమీద పడినవారు అంతలో పైకి లేస్తున్నారు. సన్నిపాతావధూతంగా, ప్రమాథోన్మాథంగా ఆ పోరు సాగుతున్నది. గండశిలలు కరుచుకుపోయినట్లు ఒక్కొక్కసారి సంశ్లిష్ట వికటంగా అంటుకుపోతున్నారు. అంతలో విడిపడి బాహువులను ఆస్ఫాలించుకుంటూ సింహనాదాలు చేస్తున్నారు. ముద్రికాంగుళి హస్తాగ్రాలతో ఒకర్ని ఒకరు మోదుకుంటున్నారు. వరహోద్ధూత నిస్వనంగా ఒకరి పాదములసందున ఒకరు దూరుతూ, ఎత్తి పడవేసుకుంటున్నారు. విహీనస్వనులై మాట్లాడలేకపోతున్నారు. గోళ్ళతో గ్రుచ్చుకుంటున్నారు. కూర్పరములచేత, జానువులచేత ఒకర్ని ఒకరు బాధించుకుంటున్నారు. తలలతో ఢీకొంటున్నారు.

యుద్ధం ఇట్లా ఘోరంగా సాగుతోంది. బాహుతేజసము, అశస్త్రము అయిన ఆ యుద్ధం దారుణంగా సాగుతున్నది. శ్రీకృష్ణదేవుని వజ్రనిష్పేషనిష్ఠురాలయిన ముష్టినిపాతములవలన చాణూరుడు బలరాముని విక్రమంచేత ముష్టికుడు శిథిగాత్రులు, బలహీనులు అయిపోతున్నారు. సమాజవాటంలో సాధుసాధ్వీతినినాదాలు మిన్నుముట్టుతున్నాయి. చాణూరుడు అంతలో క్రుద్ధుడైపోయినాడు. ఒక్కసారి విజృంభించినాడు. డేగనుపోలి ఎగిరి, శ్రీకృష్ణదేవుని వక్షస్థలాన్ని తీవ్ర చంచువులనుపోలి తనముష్టిద్వయంచేత గారియపెట్టాడు. భగవంతుడు ‘అద్ధా’ అన్నాడు. అన్నంతలో ఆయన శరీరం పొంగిపోయింది. వజ్రముచేత కొట్టబడిన ఏనుగును పోలి లోకభీకరంగా ఘీంకృతి చేస్తూ, ఆయన చాణూరుణ్ణి ఒడిసిపట్టి, కుదిపి పారవేశాడు. భూమిమీదవేసి కొట్టాడు. ఇంద్రోత్సవ సందర్భంలో నెలకొల్పబడిన ధ్వజస్తంభాన్ని పతాకాద్యలంకరణాలతో పురుషాకృతిగా నిర్మిస్తారు. పెనుగాలి ఒక్కటువచ్చి ఊపి దానిని కూల్చినట్లు శ్రీకృష్ణదేవ బాహువీర్య వేగంముందు చాణూరుడు త్రుళ్లిపోయినాడు. కంసునకు భయంవేసింది అతడు ఎడమచేతితో మల్లతూర్యాలను వారించాడు. అవి ఒక్కపెట్టున ఆగిపోయినాయి. అవి ఆగినంతలో ఆకాశంలో అంతర్ధానగతులయిన దేవతలు దేవతూర్యలను మ్రోగించారు. దేవదుందుభులను మ్రోయించారు. ఆ దేవతూర్యాలు అనేక విధాలుగా మ్రోసాయి పుండరీకనిభేక్షణుడు, హృషీకేశుడు యుద్ధాన్ని కొనసాగిస్తూవుంటే, ఆ యుద్ధవేగానికి అనుకూలతగా ఆ తూర్యనాదాలు భోరన ఆకాశం అంతా నిండిపోయినాయి. కంసుని సమాజవాటం ఆశ్చర్యపోయింది. దిగ్భ్రాంతి చెందింది. వారికి గూడా ఇప్పుడు దేవతల హెచ్చరికలు స్పష్టంగా వినవస్తున్నాయి.“జయస్వ కృష్ణ చాణూరం దానవం మల్లరూపిణం” అని దేవతలు శ్రీకృష్ణదేవుణ్ణి హెచ్చరిస్తున్నారు. కామరూపులైన దేవతలు, అంతర్ధానగతులై, ఆకాశంలో నిలిచి శ్రీకృష్ణదేవుణ్ణి ప్రార్థిస్తున్నారు. శ్రీకృష్ణుని విజయాన్ని ఆకాంక్షిస్తూ ఆ దేవతలు ఆకాశంలో నిలిచి “భగవన్! వీడు రాక్షసుడు; వీణ్ణిచంపు” అంటున్నారు. సప్తఋషులుగూడా ఆకాశంలో నిలిచి “జయస్వకృష్ణ చాణూరం, దానవం మల్లరూపిణం” అంటున్నారు. అంటూ ప్రార్థిస్తున్నారు.

భగవంతుడు వారి ప్రార్థనలు విని గూడా కొంతసేపు విననట్లు నటించాడు. ఆ కొంతసేపు చూపరకు వినోదం కల్గేటుగా చాణూరమల్లునితో భుజాసమరాన్ని అచ్చెరువారగ నిర్వహించాడు. దేవకీసుతుడైన భగవంతుడు అచిరకాలం చాణూర నాగాన్ని అహితుండికునిపోల్కి ఆడించాడు. తాను ఆడుకున్నాడు. కంసునకు అది ఆటగాలేదు. తన మనఃప్రాణాలను గారియపెడుతున్నట్లు వుంది. అతడు చుట్టూ కట్టుకున్న అజ్ఞానపు కోటలను పగులుస్తున్నట్లు

హారీత శివశర్మ

వుంది. యాదవగణానికి పరాత్పరుడు ప్రత్యక్షమై తమ్ము రక్షిస్తున్నట్లువుంది. దేవకికి తన కన్నకడుపు ఫలిస్తున్నట్లువుంది. రోహిణికి తన విద్యాగురుత్వం చరితార్థం అవుతున్నట్లువుంది. యశోదకు తన నోములు ఫలిస్తున్నట్లువుంది. కంసమాతకు తాను ఒకప్పుడు తన బిడ్డకు, కంసునకు, అతడు పుట్టకముందు, తన గర్భంలో బీజరూపంలో మసలుతున్న సమయమందు, తాను ఇచ్చిన శాపం రూపుదాల్చి విక్రమిస్తున్నట్లు వుంది.

జయ గోవింద చాణూరం
జహి కేశవ దానవం
జయస్వ కృష్ణ చాణూరం
దానవం మల్లరూపిణం.

శ్రీకృష్ణదేవుని పరాక్రమం త్రివిక్రమావతారాన్ని పోలి విశంకటం అవుతున్నది. చాణూరుని అవష్టంభం తగ్గుతున్నది. శ్రీకృష్ణదేవుడు ఒకింత కోపాన్ని కైకొన్న పద్ధతిని రౌద్రప్రకారవిడంబనం చూపించాడు. వైరియొక్క సత్త్వవిద్యాపటురూఢి ఎంతయును తక్కువగా ఒనర్చాడు. కంసుని బలాన్ని ఆహరిస్తున్నట్లు చాణూరుని శక్తిసామర్థ్యాలు సన్నగిల్ల చేశాడు. అప్పుడు శ్రీకృష్ణదేవుడు ప్రదర్శించిన విక్రమవ్యాపారానికి రంగధాత్రి అంతా గ్రక్కదలిపోయింది. మంచప్రపంచం అల్లలాడిపోయింది. జనం చూపులకు విన్నదనం ఒదవింది. దిక్కులు మండాయి. కంసుని ఉత్తంసమునందలి ప్రధాన రత్నం విభ్రష్టమై పడింది. శ్రీకృష్ణదేవుడు రెండు బాహువులతో, ఘోర కుళీరం ఒక్కడు ఒకానొక అల్పజంతువును తన డెక్కలతో పట్టుకొని విగతాసువుగా నొక్కివేసినట్లు, చాణూర దానవుణ్ణి ఒడిసిపట్టి శీర్ణజీవితుణ్ణిగా నొక్కివేశాడు. వజ్రపాతాన్ని పోని ముష్టిప్రహారములతో చాణూరుని శిరస్సును, మోకాలి పోటులతో వానివక్షాన్ని పీడించాడు. వాని తల చితికిపోయింది. వానివక్షం బద్దలైంది. రంగం అంతా నెత్తురుధారలతో నిండిపోయింది. సౌవర్ణమయమైన ఘంట ఒక్కడు, వ్రేలాడగట్టబడినది, త్రాడు తెగి జారి పడినట్లు, చాణూరదానవుని నేత్రపిండములు నేత్రగోళ వివర్జితములై వూడి పడ్డాయి. నిఃసృతలోచనుడై, విగతప్రాణుడై, చాణూరుడు, జీవితాంతంలో, రంగమధ్యంలో ఒరిగిపోయినాడు. చాణూరుని వధను తిలకించి ముష్టికుడు ముష్టియుద్ధంలో భ్రష్టుడైపోయినాడు. బలరాముడు వాని తలను క్రుంగ పొడిచినాడు. కృష్ణసదృశభుజచేష్టితుడై ముష్టికుణ్ణి సంహరించాడు. వాడును కులిశపాతభగ్నమైన శైలశృంగంలాగా వికృతంగా దొర్లిపడి విగతజీవుడైనాడు.

ఈ మల్లయుద్ధం అనే గండాన్ని గడిచి బయట పడతారా అని దేవకి అనుకున్న బిడ్డలు లోకాద్భుతవిక్రమంతో ఆ మల్లుల పరిమార్చారు. అప్పుడు దేవకి తన బిడ్డనుగూర్చి ఇట్లా అనుకుంది. "మునుపు కన్ననాడే బిడ్డను దూరంగా పాయవైచుకున్నాను. క్రమ్మర ఇప్పుడు చూచుకున్నాను. చూచుకొని ఈ మల్లురకు చిక్కదక్కుతాడా అనుకున్నాను. చాణూరుడేమో అంతక ప్రతిరూపుడు. నా తండ్రి వాని ప్రాణహంత అయినాడటే! నా కృష్ణుణ్ణి, లోకాభిరామమూర్తిని, మా రెండును లేక ఉదీర్ణతేజంతో వెలుగుతున్న నా అనుంగు పాపణ్ణి తిరిగి కన్నానటే!" ఆమెకు అప్పుడు చన్నులు చేపునకు వచ్చాయి. హర్షశీతలాశ్రువులు కన్నుకొనలలో నిండు ఆరినాయి. ముదాశ్రులోచన కాంతులతో ఆమె యశోదను తిలకించింది. రోహిణిని తిలకించింది. ఆ చూపులో కృతజ్ఞత వుంది. ప్రేమ వుంది. గౌరవం వుంది. ఆమె కంసునిమాతను చూచిన చూపు విచిత్రమైంది. "దేవకి! దేవకి! నీ బిడ్డ లోకాభిరాముడే! మా తల్లి! నీ బిడ్డ కారణజన్ముడే!" అన్నది కంసుని మాత. రోహిణి ఆనందము, యశోద ఆనందము పట్టరానివిధంగా వున్నాయి. వారు దేవకిని గాటంపుకౌగిలిలో పట్టుకున్నారు. కంసుని కొల్వువారయిన కామినులెల్లరు వెరగుపడ్డారు. శ్రీకృష్ణునిమూర్తిని



Kumar

"చదరంగం"

చిత్రకారుడు : డి. వి. నందకుమార్ (విశాఖపట్నం)

ఆశంస తలిర్పగా రెప్ప లిడజాలక చూచినదే చూపుగా చూచారు. వారిని వారు ఎరుగలేని స్థితిలో పడ్డారు. కంసుని ఉనికి, మల్లులతో పోరు, తద్రిపువధం, అన్నీ వారిని ఉక్కిరి బక్కిరి చేసి వైచినాయి. వసుదేవుడు ఆ తన పుత్రకులను చూచుకున్నాడు. అతనిలో నిర్లిప్త భావం ఇప్పుడు క్రొత్త అందాన్ని హత్తుకుంది. హఠాత్తుగా ఆయనకు అప్పుడు యౌవనం అబ్బినట్లు వుంది. తన పుత్రులు ఊర్జితులు. భుజావష్టంభసంభావనారసికులు. పాలితశాత్రవులు. వారిని చూచుకోగా ఆయనకు ఆనందరసానుభూతి పుక్కిలింతలైనది. తాను సిద్ధుడనైతినన్న భావం ఒక్కడు ఆయనలో కల్గినది. జరావ్యసనం జారిపోయినది. మనస్సుచేత కుమారాకారుడైనంత ఉత్సాహం ఆయనలో నే దీప్తిపవహించినది. ఆయనకువలెనే, సర్వ యాదవగణ క్షత్రియలోకము ఆనందరసాబ్ధిలో అప్పుడు ఓలలాడినది.

అప్పటిదాకా సభ అంతయునుపోలె శిలతోసలాది కంసపక్షీయులయిన మల్లురు దిగ్భ్రాంతిని చెంది ఏమియు చేయలేనివారై నిలిచిపోయినారు. ఆ దిగ్భ్రాంతి తొలగగా వారు రామకృష్ణులమీదకు ఉద్దవిడిని వచ్చినారు. క్రోధసమూర్ఛితులు, కాలవశవర్తులు అయి రామకృష్ణులమీదకు వచ్చినారు. అంతవరకు పరమనిర్వేదియై వున్న కంసుడు ఒక్కసారి 'అద్దా!' అన్నాడు. తిరిగి యాదవపక్షీయులు సంకట పడినారు. తిరిగి మల్లురకు రామకృష్ణులకు పోరు ఘోరమై ప్రారంభమైనది. తోసలుడు సామాన్యుడు కాడు. వాడు గిరిశృంగోపమమైన ఆకారం కలవాడు. మహాబలవంతుడు. శ్రీకృష్ణుడు వానిని ఎదుర్కొన్నాడు. వారి మధ్య రణం దారుణంగా సాగింది. భగవంతుడు వానిని ఒడిసిపట్టి, గిరగిరగా త్రిప్పి, నేలనువేసి కొట్టి పిప్పిగా చేసివేసినాడు. మిగిలిన ఆంధ్రమల్లురతో బలరామదేవుడు పోరు సాగించినాడు. ఆయన వారిని తన ముష్టిపాతానికి గురిచేస్తూవుంటే, నాగలితో ప్రాణాలను దున్నుతున్నట్లు వారు బాధపడ్డారు. వారిని బీరుపోకుండా సంకర్షణుడు ఆకర్షించి పిలుకుమార్చివైచినాడు. శిలతోసలాది కంసుని మల్లురవధ ఇట్లా ఘోరంగా జరిగిపోయింది. ఆ అన్నదమ్ములు అప్పుడు క్రోధసంరక్తలోచనులై రంగం అంతటా విలయతాండవం చేశారు. కృశానుమూర్తులై చెల్లరేగారు. మిగిలిన మల్లులు అక్కడ నిల్వలేదు. బలంకొద్దీ కాళ్ళకు బుద్ధిచెప్పినారు.

కంసునకు ఒడలు స్వేదాంబుకణికాచితమైపోయినది. భ్రూభేదాంతరంలో రెండు చెమటబొట్లు ఇందుపగింజలంతలుగా గోచరించాయి. అతనిలో అప్పుడు రోషం హెచ్చింది. భయం చిచ్చుకువలె మచ్చరించింది. నందగోపాది వల్లవులంతా భయపడిపోయినారు. భయక్షోభిత సర్వాంగులయిపోయినారు. సభ అంతా ఏదో భయం ఆవరించినట్లు నిశ్శబ్దజడమై జడను వహించింది. ★



# మధుర ఘడియలు

— చిలకమర్తి సత్యనారాయణ

"నాటకాలవాళ్ళను నిజంగా నమ్మకూడదా' అన్న ఆలోచన సీతకు అకస్మాత్తుగా కలిగింది. 'మన [illegible] అన్నీ ఒకలా వుండవు. ప్రత్యేకంగా ఏదో ఒకరంగానికి సంబంధించిన వ్యక్తులనే ఎందుకు ఆడిపోసుకోవాలి? అవిశ్వాసం ఏరంగంలో లేదు? అవినీతి ఏ శాఖలో లేదు?-' యిలా ప్రశ్నలు, సంగీతంలా శరవేగంతో సీతను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

రాత్రి ఒంటిగంటయింది. ఆరోజున సినీమాకు వెళ్దామని, సరదాగా కాలక్షేపం చేద్దామని అనుకొన్న సీత, తన భర్త కోసం సాయంత్రం ఐదు గంటల నుండి రాత్రి ఒంటిగంటవరకూ నిరీక్షిస్తూ అలానే కూర్చునివుంది. శ్రీధర్‌తో మరీమరీ చెప్పింది- "ఏమండీ! సరిగ్గా ఏనిమిదేళ్ళక్రితం యీరోజున మన వివాహం జరిగింది. జ్ఞాపకముందా?" అని. "ఈ వేళ రిహార్సల్ నుంచి సాయంత్రం ఐదు గంటలకు తప్పక వచ్చేస్తాను సీతా. మనం సినీమాకి వెళ్దాం. ఏం" అని జవాబిచ్చాడు శ్రీధర్. ఆ మాట యింకా సీత చెవుల్లో మారుమ్రోగుతూనే వున్నాయి. గడియారం గంటలు కొట్టికొట్టి రాత్రి ఒంటిగంట కూడా వినిపించింది. కాని శ్రీధర్ రాక కోసం ఆమె నిరీక్షిస్తూ అలానే కూర్చుంది, అతని కంటో నచ్చిన చీర సింగారించుకొని—

తనను చూడటానికి వచ్చిన స్నేహితురాలు-లత మాటలు జ్ఞాపకానికి వచ్చాయి సీతకు-"సీతా! నువ్వేమైనా చెప్పు. ఈ నాటి కాలం యిన్ని కట్టుబాటని నువ్వేం సుఖం అనుభవించావ్? చిదిమితే పాలుచిందే నీ ముఖం యెలా పాలిపోయిందో చూడు. నీవాగందర్నీ కాదని, నిన్ను దేవతగా ప్రేమించిన రామాన్ని త్రోసిపుచ్చి-" అని లత ఆఖరి వాక్యాల్ని పూర్తిచెయ్యకుండానే సీతలో పట్టరాని రోషం మొలకెత్తింది.

"లతా!" అని సీత బిగ్గరగా అరిచింది, తనమీద తనకు నిగ్రహం తప్పి, "లతా! నా యింట్లో నా భర్తను నిందించి, పరాయి వాళ్ళను పొగిడే అధికారం నీకెవరిచ్చారు? నువ్వు నా ప్రాణస్నేహితురాలవే. కాని నా భర్తను తూలనాడే హక్కు నీకు లేదు" అని ఒక్క బిగిలో అనేసింది సీత, పుక్రోషం పట్టలేక.

"క్షమించు సీతా! నువ్వు బి. ఏ., ప్యాసైనదానవు. నీఅంతట నువ్వు ఆలోచించుకునే శక్తిసామర్థ్యాలు నీకూ వున్నాయ్. ఒక్కటే ఆలోచించు—నీపుట్టింటికి వెళ్తే కనీసం నీ ముసలితండ్రికైనా తృప్తిని చేకూర్చినదానవవుతావు...సరే, నీకు కోపం వస్తోంది. ఇంక మాట్లాడనులే" అని ముక్తసరిగా అందించి వూరుకుంది లత. ఈ సంభాషణలన్నీ నెమరు వేసుకుంటూ శ్రీధర్ రాకకై యెగురుతెన్నులు చూస్తూ సీత అలానే సోఫాలో కునుకుతియ్యబోయింది. గడియారం రెండుగంటలు కొట్టింది. తేరపారి గడియారంవైపు చూస్తూవుండగా 'కాలింగ్ బెల్' మ్రోగింది.

"సీతా! ఆలస్యమైంది" అన్నాడు శ్రీధర్ కోటు విప్పుకుంటూ.

"మామూలేగా?" అంది నిట్టూర్పుతో.

"అది కాదు సీతా!—" అని యేదో చెప్పబోయాడు.

"సరేలెండి. కాళ్లుచేతులూ కడుక్కొని రండి. అన్నం వడ్డిస్తాను" అంటూ సీత వంటింట్లోకి వెళ్ళిపోయింది.

భోజనందగ్గర "సీతా! అలాపరధ్యానంగా వడ్డిస్తున్నావేమిటి? పులుసు పొయ్యకుండానే పెరుగు వడ్డిస్తున్నావ్!" అన్నాడు శ్రీధర్ చిరునవ్వుతో. భోజనమయింతర్వాత తీరిగ్గా మాట్లాడొచ్చుననే సంకల్పంతో సీత ఓపికపట్టింది.

"ఈ రోజున యేంజరిగిందో తెలుసా? మరి" అని శ్రీధర్ యెంతో వుత్సాహంతో చెప్పబోయాడు. కాని "అన్నం వడ్డించనా?" అని సీత అడగ్గానే ఆపేసాడు. పెరుగు కలుపుకుంటూ, "సీతా! నాతో యేదో మాట్లాడానికి ఆత్రుతపడుతున్నట్టున్నావ్?" అన్నాడు. అవునని ముక్తసరిగా జవాబిచ్చింది.

భోజనం ముగించి చెయ్యి కడుక్కొంటూ వుండగా కాలింగ్ బెల్ మ్రోగింది. "ఎవరు చూడు సీతా" అన్నాడు శ్రీధర్.

"మీ స్నేహితుడు మోహన్. మీ థియేటర్లో పనిచేసే పద్మకు సీరియస్‌గా వుందట" అని చెప్పింది సీత.

"ఆ!" అంటూ చేతులు గబగబా తుడుచుకొని శ్రీధర్ బయల్దేరుతున్నాడు.

"మీతో నేను మాట్లాడాలి" అంది సీత, ధైర్యం చిక్కపట్టుకొని.

"అలాగే. పద్మను చూసివస్తా"నంటూ మోహన్‌తో కలిసి శ్రీధర్ వెళ్ళిపోయాడు.

'నాకన్నా పద్మ యెక్కువయిందా' అనే పట్టుదల వెర్రితలలు వేస్తోంది. నిజానికి సీతకు భర్త గుణగణాలమీద అపనమ్మకం యేకోశానలేదు. కాని ఆరోజు పెళ్లిరోజు కావటం, సాయంత్రం ఐదుగంటలకు వస్తానన్నవాడు రాత్రి రెండుగంటలకు గడపలో అడుగుపెట్టడం, మళ్లీ భోజనం కాగానే పద్మను చూడడానికని వెళ్లడం, స్నేహితురాలు తనతో జరిపిన సంభాషణలు—యివన్నీ యేకమై సీతమీద మత్తుమందులా పనిచేస్తున్నాయి. తన వ్యక్తిత్వాన్ని గుర్తించని భర్తతో కాపురంచేసేదానికన్నా లత చెప్పినట్టు పుట్టింటికి వెళ్ళి తండ్రికి ఆనందం చేకూర్చడమే శ్రేయస్కరమనితోచింది సీతకు, ఆ సమయంలో. తన ఆశలు ఆశయాలు తనను వెక్కిరిస్తున్నట్టుగా బాధపడుతోంది. మగతగా నిద్రవస్తున్నా, అటో—యిటో తేల్చుకోవాలనే పట్టుదలతో అలాగే సోఫాలో దిగాలుపడికూర్చుంది.

"సీతా! యింకా నిద్రపోలేదా?" అని ప్రశ్నించాడు శ్రీధర్, తెల్లవారుఝామున నాలుగున్నర గంటలకు తిరిగివచ్చి.

"మీతో మాట్లాడాలని—"

"అంత అర్జంటా?"

"అవును."

"ఏమిటది?"

"నేను మా పుట్టింటికి వెళ్దామనుకుంటున్నాను"

"తప్పకుండా వెళ్ళు సీతా. పెళ్ళయిన తర్వాత నువ్వు వెళ్ళనేలేదు, నేను యెంత బతిమాలినా. ఎంతైనా పుట్టిల్లు పుట్టిల్లే. ఏమంటావ్??"

"అంతేగాదు. నేను శాశ్వతనివాసానికే అక్కడకెళ్తున్నాను."

"సీతా!"

"అవును. నేనే మాట్లాడుతున్నాను. ఇక్కడ మీకు నా అవసరం యేమీలేదు. వంటకి మంగమ్మ వుంది. పైపనులకు రత్తయ్య వున్నాడు. నేను దేనికి?" అని ఆవేశంలో అనేసింది సీత. తమాయించుకోకుండా.

"కాని, సీతా!-" అని యేదో చెప్పబోయాడు శ్రీధర్.

"దయచేసి అడ్డు చెప్పకండి. నన్ను యీ వేళే వెళ్లనివ్వండి. ఎప్పుడైనా యీ దురదృష్టవంతురాలు జ్ఞప్తికివస్తే ఒక్క వుత్తరం ముక్క వ్రాయండి. సంతోషిస్తాను. అంతకన్నా మీ దగ్గరనుంచి నేనేం కోరటం లేదు."

"నువ్వు చెప్పినదాంట్లో తప్పేంలేదు. కాని నా తప్పు కూడా యేమీ లేదన్న విషయం నీ అంతరాత్మకు తెలుసు. బుద్ధిపూర్వకంగా నీకెన్నడూ కష్టం కలిగించలేదు. దానికి నా మనస్సే సాక్షి. ఏమైతేనేం, ఏరి కోరి నిన్ను ప్రేమించి పెళ్లి చేసుకున్నా నీకేమీ సౌఖ్యం చేకూర్చలేకపోయాను. కాని—".

"ఇప్పుడు ప్రాత విషయాల్ని త్రవ్వుకోవడంవల్ల-"

"ప్రయోజనం శూన్యం. నాకు తెలుసు సీతా. కాని ఒక్క విషయం-నీతో యిందాకానే చెబుదామనుకున్నాను. మన భారతదేశం మొత్తంమీద ఉత్తమనటుడి బహుమానం నాకు లభించిన సందర్భంలో సాయంత్రం నాకు సన్మానంవుంది. ఆ సభకి అధ్యక్షతపదవి నలంకరించబోతున్న శేఖర్ అనే ఒక గొప్పకవి రాత్రికి మనింటికి భోజనానికి వస్తానన్నారు. ఆయనంత ఆయనే వస్తానన్నారు గనక నేను కాదనలేకపోయాను...సీతా! యెనిమిది సంవత్సరాలు నాతో నానా అవస్థలూ పడ్డావ్. ఈ ఒక్క రోజుకూడా ఓపికపట్టు. రాత్రికి భోజనాలయాక వుదయాన్నే మీ వూరు వెళ్దువుగాని. ఏం? కాదనకు సీతా, కాదనకు," అని శ్రీధర్ ఆవేశపూరితంగా అర్థించాడు. అంగీకార పూర్వకంగా సీత తల పంకించింది.

వాస్తవానికి ఆ భార్యాభర్తల హృదయాలలో ఒకరిమీద ఒకరికి ద్వేషభావంగాని, భేదాభిప్రాయాలుగాని లేవు. శ్రీధర్ నాటకకళకు జీవిత సర్వస్వాన్నీ అకితం చేసిన పవిత్ర రంగస్థల బాటసారి. దుర్వ్యసనాలకు తలఒగ్గని గుణశీలుడు. అనూయా

మోహన్ క్లాసులో నిద్రపోతూ ఉండగా మాస్టారుచూచి, "ఏమిరా మోహన్ నిద్రపోతున్నావు" అని అడిగాడు.

మోహన్—అబ్బే లేదండి మాస్టారూ. మీరు ఇందాకటినుంచి నించుని పాఠం చెబుతూ ఉంటే చూడలేక కళ్ళు మూసుకున్నానండి.

కరాసి జగన్నాధరావు (విజయనగరం)




## నారసింహ లేహ్యం

బంగారుతో చేరినది. మేహము, నీర్కాశ, నిస్సత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధికల్గించును. 20లు డబ్బి రు.3-8-0. పోస్టేజి రు. 1-1-0

పి. సి. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం. పెరిదేవి (PO) నెల్లూరుజిల్లా.

## RATNAM'S N-OIL

అంగవరములు బలహీనతి చెంది, చిన్న దినచో తిరిగి యధాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటుగుణమునకు రూ. 25-0-0 లు.

డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904) మలక్ పేటబిల్డింగ్స్, ఆజంపూరామార్కెట్ కద్ది, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

## మీరు చదవతగ్గవి

**జీవితరహస్యాలు :-** ఈపుస్తకంలో మీ దాంపత్యజీవితాన్ని పరిపూర్ణ ఆనంద మయం చేసుకోడానికి మీరు వెంటనే తెలుసుకోవలసిన అనేక కొత్తరహస్యాలున్నాయి. వెల రు. 3-50.

**యువతి :-** యువతులను గురించి మీ రెప్పుడూ కని విని ఎరుగని అనేక పతూహాల విషయాలమయం. వెల రు. 3-50.

**సంతానం :-** దాంపత్యజీవితాన్ని గడుపుతూ కూడా సంతానశోభానికి 22 నవీన మార్గాలు. వెల రు. 3-50.

**అమృత రహస్యాలు :-** మీ ఆదాయాన్ని ఎక్కువ చేసుకోవటానికి అనేక కొత్తదార్లు. వెల రు. 6.

**ఆత్మజ్ఞానము :-** శరీరానంతరం ఆత్మను గురించి, ఇదివరకెవ్వరికీ తెలియనివి, పరిశోధకులు కొత్తగా కనుగొన్న అద్భుత విషయాలు. వెల రు. 2-50.

**ఉద్యోగదర్శిని :-** మనదేశంలో గల అన్నిరకాల ఉద్యోగాలు, కావలసిన అర్హతలు, పొందేమార్గాలు. వెల రు. 5

పైవాటి రచన ఎ. ఎస్. మూర్తి, ఎం. ఏ. సొమ్ము ముందుగా పంపనవసరం లేదు పోస్టు ఖర్చులు ఉచితం. దేశసేవ ప్రచురణలు, ఏలూరు (ఆంధ్రను) ఉత్తరం వ్రాస్తే వి.పి. పోస్టుద్వారా మీయింటికిపంపబడును.

SWASTIK

# విష ఘడియలు

పిశాచాలు అనేకం తలలెత్తి నాట్యం చేసినా లెక్కచేయక ఓర్పుతో పురోగమించిన నేర్పరి. దయార్ద్రహృదయుడు. ఇంత సుగుణసంపన్నుడైనా తన భార్యకు తను సౌఖ్యం చేకూర్చటంలేదేమోననే ఆలోచనే తట్టలేదతనికి "ఇక్కడ నేను దేనికి?" అని సీత అన్నప్పుడు తల గిర్రున తిరిగినట్టనిపించింది. సీత ఆవేశాన్ని, ఆవేదనను అర్థంచేసుకొని కృంగిపోయాడు. గతాన్ని జ్ఞాపకం చేసుకోవడం మొదలెట్టాడు.

కాలేజీలో చదువుకుంటున్నరోజుల్లో చిత్రలేఖనంపోటీలో పొందిన బహుమతితో, సీత, నటనలో లభించిన బహుమతితో శ్రీధర్ గృహోన్ముఖులై వెళుతూండగా యిద్దరికీ పరిచయంగల్గింది. ఆ పరిచయం స్నేహంగా పెంపొందింద. ఆ స్నేహం మెల్లగా చిలవలు-పలవలు వేసి ప్రేమగా పరిణమించింది. ఆ ప్రేమ పరిణయంగా రూపొందడానికి పూర్వం సీత తనతండ్రి కల్పించిన పరీక్షలో ఉత్తీర్ణురాలైంది గూడా.

"నాటకాలలో వేషాలు వేసే వాళ్ళని నమ్మకూడదు, అమ్మాయ్! నీతో చిన్నప్పటి నుంచీ కలిసిమెలిసి తిరిగిన రామాన్ని వివాహమాడి సంతోషించు. లేదా, నేను అట్టే చెప్పదల్చుకోలేదు. నేనూ నీ పుట్టిల్లూ వాంఛనీయమో, లేక ఆ నాటకాలరాయుడు కాంతనీయమో నిర్ణయించుకో. రెండూ పొందడం అసంభవం" అని వివాహానికిపూర్వం సీతను ఆమెతండ్రి హెచ్చరించాడు.

"నిజమే సీతా, ఒకవిధంగా మీ నాన్నగారు చెప్పినదానిలో తప్పేంలేదు. కన్నవారికి కష్టం కల్గించడం భావ్యంకాదుకూడా. ఇక నావిషయమంటావా-నా జీవితంలో పెళ్ళిచేసుకోవడమే జరుగుతే నిన్నే. కాని నా జీవితాంతం రంగస్థలానికే సేవ చెయ్యదల్చుకున్నాను. సీత! నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నమాట వాస్తవమే. కాని, 'రంగస్థలమా-భార్యా' అనే పరిస్థితి కల్గితే రంగస్థలాన్నే స్వీకరించడానికి నేనువెనుదియ్యను. నిన్ను సుఖపెట్టలేనేమోననే భయం నన్నెప్పుడూ వెంటాడుతూనేవుంది," అని శ్రీధర్ కూడా సీతను హెచ్చరించాడు. కాని, సీత "మీ సౌఖ్యమే నా సౌఖ్యం, మీరే నా సర్వస్వం" అని జవాబిచ్చి శ్రీధర్ ని గెల్చుకుంది.

కాలేజీ పరీక్షలవగానే శ్రీధర్ సీతలకు వివాహం జరిగింది. వివాహం జరిగిన తొలిరోజుల్లోనే అవూరువదలి మెద్రాసులో కాపురంపెట్టారు. మెద్రాసులో మకాం పెట్టిన మొదటిరోజున శ్రీధర్ సీతకు వాగ్దానము చేసాడు—"నీ కేలోటూ రాకుండా నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. నాకోసం నువ్వు చాలా త్యాగం చేసావ్," అని ఆ వాగ్దానం శ్రీధర్ కి యీరోజాన జ్ఞాపకమొచ్చి మరింత కుమిలిపోయాడు.

ఆర్థికంగా యేలోటూ చెయ్యకపోయినా గత సంవత్సరాలలో సీతకు తను విషాదం చేకూర్చిన ఘట్టాల్ని జ్ఞాపకం చేసుకోవడం మొదలెట్టాడు. దాంతో అతనిగుండె బరువెక్కి, తనంత కఠినాత్ముడు ఎవడైనా వుంటాడా అని తనను తాను నిందించుకున్నాడు. ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్య ముద్దులమాటగట్టు తనయుడు తనకు కాకుండా దూరంగా తరలిపోతున్నారనే ఆలోచనతోబాటు విచారం, కన్నీళ్ళూకూడా వచ్చాయి. 'సీతా! నీ ఆశల్నీ, వ్యక్తిత్వాన్నీ పరిగణించని కృతఘ్నుణ్ణి. కాని యింత ఘోరమైన శిక్ష విధించటం తగునా?' అని శ్రీధర్ ఆత్మ నిశ్శబ్దంగా ఘోష పెట్టసాగింది.

ఇప్పుడింక తనచేతులలో యేమీ లేదనీ, తల బాసి ప్రయోజనం లేదనీ గుర్తెరిగి నిరాశతో స్నానం ముగించాడు.

సాయంత్రం సన్మానసభలో యేం జరిగిందో, తనేం మాట్లాడాడో శ్రీధర్ కేమీ స్ఫురణలేదు. ఇష్టంలేని వాళ్లు కూడా అతన్ని పొగిడారు, పూలమాలాలంకృతుణ్ణి చేసారు. మొత్తంమీద సభ జయప్రదంగానే ముగిసింది. శేఖర్ ని వెంటబెట్టుకొని కొంతమంది ముఖ్య స్నేహితులతో యింటికొచ్చాడు శ్రీధర్.

కొంతి తరిగిన వుత్సాహానికి మెరుగుపెట్టి, తన భర్త తాహతుకు తగ్గట్టుగా ముస్తాబై భర్తకు, అతని ముఖ్యులకు స్వాగతమిచ్చింది సీత. శ్రీధర్ తన భార్యను శేఖర్ కు పరిచయం చేశాడు. గోడలకువున్న చిత్రపటాలు ఆమె గీచినవేననికూడా తెలియజేసాడు. శేఖర్ కవిత్వంలోనేగాక వయస్సులో గూడా బాగా పండిన మనిషి. కళ్ళద్దాలు సవరించుకుంటూ సీతవైపు తీక్షణంగాచూసి, విశిష్టమైన కళానైపుణ్యాన్ని వెల్లడిచేస్తున్న ఆ పెయింటింగ్స్ వైపు మరొక్కసారి తేరపారి చూసాడు. సీత యెంత వుత్సాహంగా కనుపించినా విశాలమైన ఆమె నేత్రాలనుండి తొంగిచూసిన విషాదాన్ని శేఖర్ దర్శించాడు.

విందు భోజనం సీత స్వయంగానే వడ్డించింది. భోజనాలారగించి యిష్టాగోష్ఠిలోకి దిగారంతా. తనకు నాటకాలలో లభించిన బహుమతులన్నీ శేఖర్ కు చూపించాడు శ్రీధర్. వాటన్నింటినీ చూసి శేఖర్ ఒక్కసారి సీతవైపు ఆప్యాయంగా చూశాడు.

"శ్రీధర్! ఈనాడు సన్మానం జరుగవలసినది నీకు కాదు," అన్నాడు శేఖర్, చిరునవ్వుతో. ఆశ్చర్యంతో శేఖర్ వైపు చూసాడు శ్రీధర్.

"నేనేం మాట్లాడుతున్నానో నాకు తెలుసు శ్రీధర్" శేఖర్ మాట్లాడ్డం ప్రారంభించాడు. "నువ్వు సాధించిన విజయాలకు ఘనత కేవలం నీది కాదు. నీ వెనుక ఒక మహత్తరమైనశక్తి నీకు తెలియకుండానే దాగివుంది. ఆ శక్తి యేమిటో తెలుసా?" సూటిగా ప్రశ్నించాడు శేఖర్. అర్థం కాలేదన్నట్టుగా శ్రీధర్ తల అడ్డంగా త్రిప్పాడు.

"నీ వెనుక దాగి, విజయలక్ష్మిని కరగ్రహణమొనర్చుకొనుటకు, విశేష శక్తి సామర్థ్యాలను ప్రదర్శించుటకు, అశేష కీర్తి ప్రతిష్ఠలనార్జించుటకు అమితంగా సహాయపడిన నీ భార్య ఓర్పునే నీవు గుర్తించలేకపోయావా, శ్రీధర్? ఆమె సహనం, సహకారం నీకు ఓటమిలేని కోటను కట్టాయి. ఆమె ముఖం వైపు ఒక్కసారి చూసిన నేనే యింత గ్రహించగల్గానే, ఆమె నిత్యం నీతో పడిన కష్టనష్టాలను నువ్వు ఒక్కసారైనా అంచనా వేసుకోగలవా?" అని శేఖర్ మాట్లాడుతూవుంటే శ్రీధర్‌కు నిభాయించుకోలేనంత దుఃఖం వచ్చిన మాట సత్యదూరం కాదు. కాని తమాయించుకుంటున్నాడు. శేఖర్ తిరిగి మాట్లాడ్డం మొదలెట్టాడు.

"ఆమాత్రం జ్ఞానంలేని నీ నేర్పు, కళానైపుణ్యం దేనికి? నువ్వు పతిఘ్నుడవని--" అని శేఖర్ అంటూవుండగా సీత, సహించలేక, అక్కడనుంచి బయల్దేరింది. "అమ్మాయ్!" అని శేఖర్ సీతను ఆపుజేసాడు. "అమ్మాయ్! ఒక్క నిముషం ఆగమ్మా. భర్త యెంత క్రూరుడైనా అతన్ని యెవరైనా తనయెదుట దూషిస్తూంటే భరించడం భార్యకు కష్టమే. కాని ఒక్కొక్కప్పుడు గట్టిగా చెప్పించుకుంటేనే గాని మా కళాకారులకు యెంత తెలివితేటలువున్నా కొన్ని విషయాలు తలకెక్కవు. అందుకనే శ్రీధర్‌కి నాకూ కొద్దిపాటి పరిచయమే అయినా చెప్పడానికి సాహసించాను" అని శేఖర్ సీతకు నచ్చజెప్పి శ్రీధర్ వైపు, అతని మిత్రులవైపు తిరిగి ప్రారంభించాడు.

"శ్రీధర్ సాటిలేని మేటినటుడని దేశానికంతకీ తెలుసు. అతని నటనానైపుణ్యాన్ని మెచ్చుకోనివారు అరుదు. అసూయాపరులెవరైనా దూషించాలిగాని కళాప్రియులెవరూ అతని నటనలో తప్పుపట్టలేరు. కాని అతని కృషికి అడ్డురాకుండా, అవిరామంగా అతనికి తోడ్పడిన అతని భార్యను యెవ్వరూ తెలుసుకోలేరు. భర్తకు యేయిబ్బందీ కలుగకుండా, అతనికోసం పగలనక రాత్రనక నిరీక్షించి, అతని సౌఖ్యానికి యేఅంతరాయం కలుగకుండా జాగ్రత్తపడి, కష్టాలను శ్రమను తానే చిరునవ్వుతో స్వీకరించిన యీశాంతమూర్తిని యెంతమంది స్మరిస్తారు? నిజానికి యీనాడు సన్మానం జరగవలసినది ఈమెకు. ఈమె చేయూతయే లేకపోతే శ్రీధర్ యీనాడు ఒక మరుగుపడిన కళాకారునిలా జీవితం బరువుగా లాగుతూ వుండేవాడు. ఈమె ఓర్పు, త్యాగము చిరస్మరణీయము" అని శేఖర్ ఆవేశంగా మాట్లాడాడు. శ్రీధర్ నోట మాటలేదు. అతని పరిస్థితి చాలా జాలికరంగా పరిణమించింది. తెల్లవారేసరికి తన సీత తనకు దూరం కాబోతోందనే ఆలోచన శ్రీధర్‌ని మరింత కలవరపెట్టింది. మిత్రులకు వీడ్కోలు నిచ్చి, శేఖర్‌ని కూడా బసచేస్తున్న హోటలులో దిగవిడిచి గృహోన్ముఖుడయ్యాడు శ్రీధర్.

సీతతో వివరంగా మాట్లాడాలి అనే ఆలోచనతో వస్తున్నాడు, "సీతా! జరిగినదేదో జరిగిపోయింది, జరిగిపోయిన దానికి విచారిస్తున్నాను. ఇక నీపట్ల అన్యాయంగా ప్రవర్తించను. ఈసారికి-" అని యేమేమో అనాలని దారిపొడుగుతా రిహార్సల్స్ వేస్తూ తనభార్య తనకు దూరమవుతే సప్తవ్యసనాలకు తాను స్థావరమవాల్సివస్తుందేమోననే తహతహతో ఇల్లుజేరాడు శ్రీధర్. కాలింగ్ బెల్ నొక్కాడు. మళ్ళీ ఆలోచించడం ప్రారంభించాడు. తలుపు తీసిన అలికిడి కాలేదు, మళ్ళా కాలింగ్ బెల్ నొక్క యోచించసాగాడు. ఇంకా తలుపు తెరవబడలేదు. ఏమేమో ఆలోచిస్తూ నిలబడి, భయమేసి "సీతా!" అని ఒక్కసారి అరచి తలుపు త్రోసాడు, ఒకతలుపురెక్క తెరిచేవుందని గ్రహించి, సీతతో మాట్లాడాలనే ఆత్రుతతో ఒక్క ఉరకను లోపల కెళ్ళాడు, మంచంమీద పడుకొని నిద్రిస్తోంది సీత. అతని దుఃఖం పొంగిపొరలింది. మెల్లగా ఎక్కడ ఆమెకు నిద్రాభంగం కలుగుతుందో అన్నట్టుగా ఆప్యాయంగా ఆమెతల నిమిరి, "సీతా!" అనిమాత్రం అనగల్గాడు, గద్గదిక స్వరంతో.

శ్రీధర్ ఒక్కడూ సోఫాలో కూలబడి సిగరట్టు కాలుస్తూ, సీతా ఫోటో వైపు చూస్తూ, "సీతా! నా రాకకోసం అవిరామంగా యెనిమిదేళ్ళు, ప్రతీరోజూ నిరీక్షించావ్. తెల్లవారితే ప్రయాణమే! యీ ఒక్కరాత్రి నిరీక్షించలేక పోయావా?" అని అప్రయత్నంగా వచ్చిన కన్నీరు తుడుచుకుంటూ బయటకనేసాడు. మళ్ళీ, "ఛీ ఛీ! యెంత స్వార్థపరుణ్ణి నేను. సంవత్సరాల తరబడి సౌఖ్యాన్ని నా పాలు, శ్రమను తన పాలు చేసుకున్న గృహలక్ష్మి ఒక్కరోజు ప్రశాంతంగా నిద్రపోతుందని అసూయపడే స్వార్థపరుణ్ణి నేను. భగవంతుడుకూడా నన్ను క్షమించడు," అని తనను తాను నిందించుకుంటూ, సమాధానపరచుకొంటూ యేమేమో వూహించుకొంటూ, తనకు తెలియకుండానే అలా సోఫాలోనే అప్రయత్నంగా కళ్ళుమూసాడు.

అలసి సొలసి ఆవేదనతో కన్ను మూసిన శ్రీధర్ స్థితికి జాలిపడ్డాడా అన్నట్టుగా చల్లని గాలి ప్రసాదిస్తున్నాడు సమీరుడు. కాని ప్రశాంతతను భేదిస్తూ గడియారం ఠంగ్ ఠంగ్'మని ఐదు గంటలు కొట్టింది. మగతగా కన్నుమూసిన శ్రీధర్ అదిరిపడి లేచాడు. హడావిడిగా అన్ని గదుల్లోకి పరుగెత్తాడు. సీత కనుపించలేదు. టేబుల్ మీద యేదో ఉత్తరం వుంది. ఆ ఉత్తరం ఆత్రుతతో చేత్తో పుచ్చుకున్నాడే గాని చదువుకో బుద్ధి కావటం లేదు. నిలబడ్డ నేల పగుళ్ళిచ్చి తను అధఃపాతాళంలోకి నెట్టివేయబడ్డట్టుగా బాధపడుతున్నాడు. "వెళ్ళేటప్పుడు తను ముఖమైనా చూడటానికి పెట్టి పుట్టలేదా" అనే ఊహతో వుక్కిరిబిక్కిరైనంత పని జరిగింది. కళ్ళుమూసుకొని కుర్చీలో నిఠారుగా కూలబడ్డాడు. "వెంటనే స్టేషన్‌కు వెళ్తే" అనే ఆలోచన అతన్ని నిఠారుగా లేవదీసింది. ఆ ఉత్తరాన్ని జేబులో క్రుక్కి కోటు చేత్తో పుచ్చుకొని ఒక అంగలో వీధి గుమ్మం జేరాడు.

"ఏమండీ!" అని మధురాతి మధురంగా వెనుకనుంచి అకస్మాత్తుగా వచ్చిన పిలుపు అతని కాళ్ళకు అడ్డం పడింది.

"సీతా!" అని శ్రీధర్ ఆవేశంగా తన ముఖాన్ని ఆమె మృదుహస్తాలలో దాచుకున్నాడు.

"ఎంత కోపంవున్నా, కాఫీ త్రాగకుండానే వుదయాన్నే యెక్కడకెళ్తున్నారు?" అని చిలిపిగా సీత ప్రశ్నించింది. తన చేతులు భర్త కన్నీటితో తడిసి వుండటం గ్రహించి, ఛా ఛా! ఏమిటండీ మరీ పసిపిల్లాడిలా... మీరింత అధైర్యసులని యెన్నడూ అనుకోలేదు సుమా," అంది సీత, నాజూకుగా భర్త కళ్ళు తుడుస్తూ.

"నాకు దూరమైపోయావేమోనని గాభరా పడ్డాను సీతా," అన్నాడు శ్రీధర్ గద్గదిక స్వరంతో.

"మీ ఆత్రుతవల్ల అవతల గదిలో కప్పుకొని నిద్రపోతున్న మన అబ్బాయినే చూడలేక పోయారా? లేక వాణ్ణికూడా దిగవిడిచి వెళ్ళాననుకున్నారా?... కాని యెక్కడి

తల్లి గోపీ! నోరు మూసుకొని భోజనంచెయ్.

గోపి:-నువ్వు చేతులుకట్టుకొని వడ్డిస్తే...

ఢిల్లీ కృష్ణారావు (శ్రీకాకుళం)

కొల్ల గలగా? మిమ్మల్ని అనవసరంగా కలవర పెట్టాను. క్షమించండి." అని తనదే తప్పయినట్లుగా సీత ప్రాధేయపడుతుంటే శ్రీధర్ సిగ్గుపడ్డాడు.

"కాదు సీతా కాదు. నువ్వే నన్ను క్షమించాలి. నిన్నే నేను కష్టపెట్టాను.

## విషఘడియలు

నీకేమీ—" అని శ్రీధర్ చెప్పకుంటూ పోతున్నారు. ఇంతలో పిల్లాడు, "అమ్మా! ముఖం కడగవే" అంటూ వచ్చాడు, కళ్లు నులుపుకుంటూ. తల్లిదండ్రులు చెరొక చెయ్యీ పుచ్చుకొని పిల్లాణ్ణి పైకెత్తి ముద్దాడారు. ఆనందంగా నవ్వుకుంటూ కాఫీ సేవించారు.

తన జీవితం విషాదాంత మవుతుందేమో ననే కలవరపాటు కల్గించిన విషఘడియల్ని జీవితాంతం మరవలేదు. ★





కళ్లారా చూస్తే నమ్మకం: శంకరం సీత ఉతికిన మెరిసే తెల్ల షర్టును చూచి చాలా సంతోషించినట్లున్నాడు. తెల్లగాను, కాంతిగాను, ఉతుకబడిన ఈ బట్టల దొంతర, దుప్పట్లు, తువ్వాళ్లు, చూడండి—ఇవన్నీ అంత కొద్ది సన్‌లైట్‌తో ఉతుకబడినవి!

సన్‌లైట్ యొక్క గుణవంతమగు సమృద్ధయిన నురగ బట్టలను చాలా శుభ్రముగా ఉతుకును మరియు బాదక్కర్లేకుండానే బట్టలోగల ప్రతీ మురికి అణువునూ తొలగించివేయును! దీనిని మీరే స్వయంగా ఋజువు చూసుకోండి!

**సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును**

S.267-X52 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్‌వారి ఉత్పత్తి




-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

14-12-60 బుధవారం మొదలు

20-12-60 మంగళవారంవరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మృదువుగా కార్యం సాధించుకోవలసిన సమయం. సాటివారిలో ఘనత లభిస్తుంది. బంధుమిత్రుల రాకపోకలు విశేషంగా ఉండవచ్చు. స్వల్పకారణాలు కూడా మిమ్ములను ఆందోళనపెడుతవి. పండితులతో సమావేశం లభిస్తుంది. మీరు అనుకున్న విధంగా జరుగకపోయినా, మరొకమార్గంలో ఆదాయం సంతృప్తికరంగాఉంటుంది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. దైవకార్యాలలోపాల్గొంటారు. రకరకాల వ్యక్తులతో పరిచయం లభిస్తుంది. అయితే మీమాటధోరణి ఎదటివారికి చికాకును కలిగిస్తుంది. ధనసంబంధమైన లావాదేవీలలో పొరపాట్లురాకుండాజాగ్రత్త పడండి. లలితకళలయందు అవకాశాలు లభించగలవు. ప్రయాణాలు నిలుపుకొనటంవల్ల శాంతి లభిస్తుంది 14, 15 లలో శుభవార్తలు వస్తునష్టం, శ్రమ, కార్యసిద్ధి.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీరు చేసేపనియందు మనస్సును నిలుపలేకపోతారు. ఉపయోగంలేని ఆలోచనలు తీవ్రంగా చేస్తూఉంటారు. ఖర్చులు పెరుగుతవి. దేహశ్రమ పెరుగుతుంది. దైవబలంవల్ల మీ కార్యక్రమాలు సకాలంలో జరిపి మాట రాకుండా చూచుకోగలుగుతారు. మిమ్ములను మొహమాటపెట్టి పని చేయించుకునే పెద్దమనుష్యులు తటసపడతారు. విలాసవినోదకార్యక్రమాలకు మొదటఅభ్యంతరాలు వచ్చినా చివరకు సంతృప్తికరంగా జరుగుతవి. వ్యవహారకార్యక్రమాలు చురుకుగా జరుగుతవి. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. వృత్తికి సంబంధించినపనులలో పట్టుదల, శ్రద్ధ అవసరం. అపవాదులు రావచ్చు. 17, 18 లలో పనులలో విసుగుదల, కష్టవార్తలు, స్వల్ప ఫలం.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ పరిస్థితి గతుకులరోడ్డులో బండిమాదిరి తోస్తుంది. సకాలంలో నిద్ర, ఆహారము లభించకపోవచ్చు. ఓర్పుతో కార్యం సాధించుకోగలుగుతారు. అయితే, ఆలస్యము, వృధావ్యయము కనుపిస్తవి. ఇతరులకు మధ్యవర్తిత్వం చేయవలసివస్తుంది. లోగడ మిమ్ములను ద్వేషించినవారే మిమ్ములను అనుసరిస్తారు. వృత్తి వ్యాపారాలలో డబ్బు పెట్టుబడి పెట్టవలసిన అవసరం కలుగవచ్చు. ప్రయాణసూచన లున్నవి. ఎదురుచూస్తున్న వార్తలు ఆలస్యంగా అందుతవి. ఏదోవిధంగా సమయం మించకుండా వాగ్దానాలను చెల్లించుకోగలుగుతారు. కుటుంబంలోనివారి అనారోగ్యాలవల్ల అశాంతి కనిపిస్తుంది. ప్రతివిషయంలోను ఎక్కడ పొరపాటు జరుగుతుందోనని ఆందోళనపడతారు. 19, 20 లలో పుణ్యకార్యాలు, దుబారా ఖర్చులు.

**గ్రహస్థితి**

మిథునంలో అంగారకుడు, సింహంలో రాహువు, వృశ్చికంలో బుధుడు, వృశ్చిక ధనుస్సులలో సూర్యుడు, ధనుస్సులో గురు శనులు, మకరంలో శుక్రుడు, కుంభంలో కేతువు, తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఇతరుల సహాయం నిమిత్తం ఎదురుచూడవలసిన అవసరం క్రమంగా తగ్గుతుంది. చురుకుగా ఆలోచించుకుని కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. మిమ్ములను ఎదిరించే ప్రయత్నాలు కొంతమంది తలపెట్టినా వెంటనే అణిగిపోతవి. స్వశక్తితో వ్యవహారాలలో విజయం సాధిస్తారు. ఖర్చులుమాత్రం విపరీతంగా ఉంటవి. మీ పనుల తొందరలో ఆత్మీయుల మనస్సు నొప్పించటం జరుగుతుంది. శుభపుణ్యకార్యప్రయత్నాలు ఫలిస్తవి. స్వల్పవిషయాలలో కలహప్రసంగాలు వచ్చి సులభంగా సమసిపోతవి. కుటుంబ విషయాలలో ఖర్చులు, దేహశ్రమ తగ్గించుకుని అవతలివారికి బాధకలుగకుండా చూచుకొనటం మంచిది. వారం రెండవభాగంలో అనారోగ్యం చేయగల అవకాశా లున్నవి. కష్టవార్తలు తెలియగలవు, 14,15 లలో ఇష్టవస్తుప్రాప్తి ఆదాయ వృద్ధి.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఒకప్రక్క నిరుత్సాహము, చిక్కులు కనిపిస్తున్నా ధైర్యంతో సాధించుకోగలుగుతారు. అనవసరమైన మాటపట్టింపులు ఆందోళనకు కారణమవుతవి. సంఘంలో మాట చలామణి బాగుంటుంది. మీ కార్యభారంవల్ల స్నేహితుల మనస్సుకు కష్టం కలుగకుండా చూచుకొనండి. అధికారులవల్ల కార్యసిద్ధి ఉంటుంది. ధనం విశేషంగా పెట్టుబడి పెట్టి చేయు పనులలో సంపూర్ణంగా ఫలితం పొందగలుగుతారు. ఇతరులతో ప్రసంగించే సమయాలలో ఎదటివారిని అర్థంచేసుకొనటం కొంతవరకు శ్రమగానే తోస్తుంది. మీ అంచనాకు లోపంలేకుండా ఆదాయం బాగుంటుంది. వృత్తి ఉద్యోగాలలో తోటివారు మిమ్ములను పరీక్షిస్తున్నారేమోనని అనుకొనవలసిన సంఘటనలు జరుగుతవి. దైవబలంవల్ల గౌరవం నిలుపుకొంటారు. 19, 20 లలో వృధాయోచనలు, సంచారము, మిత్రలాభం.

* * *

**కన్య :**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

అనేకవిషయాలలో మిమ్ములను అర్థంచేసుకుని అండగా నిలబడే వ్యక్తులు లభిస్తారు. ఖర్చులు, ఆదాయము కూడా పెరుగు

# మా ఇంటి వాడుకకు
# బ్రూక్ బాండ్




## స్పెషల్ హోటల్ బ్లెండ్
### డస్ట్ టీ

తోట పదును తాజాగా వుండే అమోఘమైన యీ బ్రూక్ బాండ్ స్పెషల్ హోటల్ బ్లెండ్ టీని మీరు త్రాగి ఆనందించండి. ప్రతి ప్యాకెట్టూ మీ కెన్నో కప్పుల కమ్మని టీని ఇచ్చును.

**3 సైజులలో లభించును–**

**1 పౌను** (453.6 గ్రాములు)
**4 ఔన్సులు** (113.4 గ్రాములు)
**2 ఔన్సులు** (56.7 గ్రాములు)

**నేడే ఓ ప్యాకెట్టు కొని ఇంటికి పట్టుకెళ్లండి**

TBB 351(A)

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

తవి. సమర్థతతో ఇతరులకు సహాయం చేయగలుగుతారు. ఇంతకుముందు విరోధులవల్ల ఏర్పడిన చిక్కులను క్రమంగా తొలగించుకుంటారు. బంధువర్గంలో కొంతవరకు మంచిపేరు లభిస్తుంది. త్రిప్పటతో కూడిన కార్యక్రమాలు అధికంగా ఉంటవి. రాజకీయాలలో పేరు ప్రతిష్ఠలు బాగుంటవి. అయితే అభిప్రాయ భేదాలు వస్తూఉంటవి. విలువగల వస్తువులు కొంటారు. కుటుంబంలో పరస్పర సహకారంతో సుఖము, మనశ్శాంతిని పొందగలుగుతారు. అత్యవసర సమయంలో నీచస్నేహం చేయవలసి వస్తుంది. 17, 18 లలో అశాంతి, ధననష్టము.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

మీ మంచితనాన్ని అవతలివారు అశక్తతగా భావించటంవల్ల కఠినంగా ప్రవర్తించవలసివస్తుంది. ఆదాయాన్ని మించి ఖర్చులు పెరుగుతవి. విశ్రాంతిలేనిపనులు, వృత్తిలో అభివృద్ధికరమైన మార్పులు రాగలసమయం. బంధుమిత్రులకు సంబంధించిన బాధ్యతలు తగ్గించుకొంటున్న సమయంలో క్రొత్తవారికి సహాయం చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. మీ మాటను తిరస్కారభావంతో చూచినవారే మిమ్మల్ని ఆశ్రయిస్తారు. పుణ్యకార్యాలకు ఆటంకాలు రాగల అవకాశాలున్నవి. సభాగౌరవం లభిస్తుంది. సాహిత్యరంగంలో అభిరుచి కృషికి తగినంతగా ప్రోత్సాహము లభిస్తుంది. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. దుర్గాస్తోత్ర పారాయణంవల్ల మనోస్థైర్యము కార్యసిద్ధి పొందగలుగుతారు. 18, 19 లలో భాగ్యవృద్ధి, వ్యవహారజయం.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఎవ్వరిమాటను కాదనలేకను, అందరినీ అనుసరించలేకను మొదట్లో కొంత చికాకుపడతారు. క్రమంగా చిక్కులు తొలగిపోయి కార్యసిద్ధి పొందగలుగుతారు. అధికారుల ప్రాపకం లభిస్తుంది. చాలకాలంగా మీరు చేస్తున్న కృషి ఫలిస్తుంది. మీ ఆరోగ్యంలో లోపం కనుపించవచ్చు. మీ నిత్య వ్యవహారాలుమాత్రం యథాప్రకారం జరుపుకొగలుగుతారు. వృత్తిలో మానసికమైన శ్రమ పెరుగుతుంది. స్నేహితులలో కొందరు మీమీద సందేహాలు పెట్టుకుని బాధపడతారు. నూతనప్రయత్నాలలో ప్రతికూలం కనుపించదు. కాని పనులు జరిగినవనే తృప్తికి అవకాశం లేకుండాపోతుంది. సాహస స్వభావం కలుగుతుంది. 14, 15 లలో దుర్వార్తలు. బంధువిరోధం, కుటుంబ కలహాలు.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రథమ పాదం)

మనస్సుకు ప్రశాంతత లోపిస్తుంది. ఆదాయం విశేషంగాఉన్నా తలవని తలంపుగా తప్పనిసరి ఖర్చులు వస్తుంటవి. చివరకు నిరుపయోగంగా తోస్తుంటవి. హోదాగల వ్యక్తులతో స్నేహం లభిస్తుంది. పుణ్యకార్యాలు జరుగుతవి. బంధువులు కొంతవరకు సహాయం చేస్తారు. కొన్ని విషయాలలో మీరు ముందు చెప్పినమాటను మీరటం జరుగుతుంది. క్రొత్తవారితో భాగం కలిసి చేయు వ్యాపారవ్యవహార కార్యక్రమాలలో కలతలు రాగల అవకాశాలున్నవి. ప్రయాణాలు శ్రమకరంగా జరుగవచ్చు. ఇతరులసహాయం నమ్ముకుని ఆరంభించినపని మధ్యలో ఆగిపోతుంది. కుటుంబంలోని వారితో కలహాలురాకుండా చూచుకొనటం అవసరం. వారాంతంలో చోరభయం కనిపిస్తుంది. 19, 20 లలో పనులలో శ్రమ దుర్వార్త.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

వృత్తి వ్యాపారాలలో గతవారంకన్నా మేలుగా ఉంటుంది. సకాలంలో ఎదురుచూస్తున్న వార్తలు అంది మనశ్శాంతి లభిస్తుంది. వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు. అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. మీమాటలలోనుంచి విపరీతార్థాలను లాగేవారు, రహస్యాలను లాగేవారు ఉంటారు. పిల్లల ఆరోగ్యం ఆందోళనకరంగా తయారు కాగల అవకాశాలున్నవి. విశ్రాంతిలేని పనులు, త్రిప్పట కనుపిస్తవి. ఒకటిరెండు సందర్భాలలో కుటుంబంలోనివారు మీ మాటను అతిక్రమించవలసిన అవసరం ఏర్పడుతుంది. మీమనోదార్ఢ్యత, దేహబలము కూడా తగ్గే అవకాశాలున్నవి. ధనాదాయం విషయంలో కొంత అభివృద్ధి కనుపిస్తుంది. అజాగ్రత్తవల్ల వస్తువులు పోగొట్టుకుంటారు. 17,18 లలో వృత్తిలోచిక్కులు, వ్యవహార విజయం.

* * *

## ఈ వారము ధరలు

బంగారుధర 17, 18 లలో తేజీవచ్చి తగ్గుతుంది. వెండిధరలో సాధారణమైన హెచ్చుతగ్గులు వస్తూనేఉంటవి.

పసుపుధర పెరుగుతుంది. వేరుశెనగ పప్పు ధర వారం మొదటిభాగంలో మందీవచ్చినా రెండవభాగంలో తేజీ వస్తుంది. నూనెధర కొద్దితేజీ. నూవుల పప్పుధరలో తేజీవస్తుంది. నూనెధరలో కూడా తేజీనిలుస్తుంది.

నూలు, వస్త్రాలు ధరలలో నిదానంగా మందీకొద్దిగా రావచ్చు. మినుములకు గిరాకీ వస్తుంది. కందులు గిరాకీలో నిలకడ.

ప్రత్తిధర వారం మొదటిభాగంలో తేజీ, రెండవభాగంలో మందీ.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీ మాటకు విలువ పెరుగుతుంది. పాతస్నేహితులకన్నా క్రొత్తవారివల్ల మీ పనులు అనుకూలిస్తవి. నౌకరులు మొదలయినవారివల్ల కార్యసిద్ధి, ధనలాభము ఉంటవి. అయితే కలహ ప్రసంగాలు వస్తూ ఉంటవి. మీతొందరపాటువల్ల చేతికి అందిన అవకాశం తప్పిపోతుంది. మిమ్మలను హాస్యం చేసినవారే మీ సహాయం నిమిత్తం ఎదురు చూస్తారు. పనుల వత్తిడివల్ల ఆరోగ్యం లోపిస్తుంది. ధనం విశేషంగా పెట్టుబడి పెట్టవలసిరావచ్చు. వారం రెండవభాగంలో ఇతరుల కలహ ప్రసంగాలలో తలదూర్చి అవస్థ పడవలసి వస్తుంది. దుబారా ఖర్చులను కట్టుబాటుచేయలేకపోతారు. 18, 19 లలో ఆదాయభంగం, ప్రయాణాలు, నీచస్నేహం.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ముఖ్యంగా విలాస వినోదాలతో కాలక్షేపం జరుగుతుంది. ప్రతివిషయంలో మీ మాట ప్రకారం జరుపుకొగలుగుతారు. యంత్రాలు కొనటం, స్థాపించటం, భూములు కొనటం మొదలయిన పనులు బాగా ఫలిస్తవి. దైవకార్యాలు జరుగుతవి. అకస్మాత్తుగా ఉద్రేకం రాగల అవకాశాలున్నవి. మీరు చేసిన పనులను గురించి విమర్శలు వస్తున్నట్లు తెలుస్తుంది. సుఖ, విలాసాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. ఇతరులవద్దనుంచి ఎదురుచూస్తున్న రహస్యవార్తలు సకాలంలో అంది మీ కృషి ఫలిస్తుంది. కుటుంబంలో కలహప్రసంగాలు వస్తవి. లాభకరమైన ప్రయాణాలు చేస్తారు. 14, 18 లలో శుభవ్యయం, బంధువుల రాకపోకలు. ★

# అనంతలక్ష్మి

ఆమెను చూట్టంతోనే-నా హృదయం అనురాగంతో నిండిపోవచ్చు...ఆమె నవ్వినప్పుడు-కెంపులకి మల్లె మెరిసిపోతూ వొంపులు తిరిగిన ఆమె పెదాల్ని, చిత్రంగా సొటలుపడ్డ ఆమె బుగ్గల్ని, చూడాలని-నా కళ్లు తహతహ లాడిపోవచ్చు...

ఆమెకు-చేరువగా వుండాలని-నామనసు తపించిపోవచ్చు...కానీ-నేనొకవిషయాన్ని స్పష్టంగా మనవి చేయదలిచాను-అనుపమ వల్ల-నాకుగల ప్రేమ-కేవలం-ఒక ఆత్మ మిత్రుడిపట్ల ఉండగల ప్రేమలాంటిదే కానీ-మరొకవిధమయినదేమీ కాదు.

జీవితంలో-మానవుడు ఒక్కరికే మనసిచ్చి-ప్రేమించగలుగుతాడంటే-మీరు ఒప్పుకొంటారనుకొంటాను.

నా వృత్తి-వైద్యవృత్తి. వృత్తిరీత్యానే-నే నామెని కలుసుకోవటం తటస్థించింది. నేను నిత్యం పల్లెపట్టులమ్మట ప్రయాణం చేస్తూంటాను...భారతదేశంలో పల్లెపట్టుల

ప్రమోద్ శర్మ

కేమీ కొరతలేదు. అసలవి లేకపోతే భారతదేశమే లేదు. పాతిక ముప్పైదాకా అభాగ్యుల గుడిసెలూ...భాగ్యవంతులు ఉండటానికి అనువుగా రెండు మూడు మిద్దె ఇళ్ళూ...ఇవీ ఈ పల్లెపట్టుల స్థూల స్వరూపం...

ఒకమారు వొచ్చిన పని ముగించుకొని-వెళ్ళిపోబోతుంటే-ఒకతను రొప్పుకొంటూ వొచ్చి—

'బాబూ-మా అమ్మగారికి కొద్దిగా సుస్తీగా వుంది...తమ రొకసారి దయ చెయ్యాలి—'అన్నాడు. నేను మారుమాటాడకుండా అతణ్ని అనుసరించాను.

కొద్దిపాటి పరిచయంలో నే-మేమిద్దరం అత్యంత సన్నిహితుల మయిపోయాం...

అదేమోగానీ-నా కామెను అదివర కెక్కడో చూసినట్టనిపించింది...ఆమె నీలి చక్రాలాటి నయనాల్లోంచి ప్రసరించే కాంతులు నా వెనకటి విషాదగాథల్ని తవ్వి బయటకి తీస్తున్నట్టనిపించాయి...

తుమ్మెద రెక్కల్లాంటి ఆమె జుట్టునీ-సెలయేటిలాంటి ఆమె నాసికనీ, కెంపుల్లాంటి ఆమె పెదాల్ని చూస్తూంటే-నా కివన్నీ చిరపరిచితాలే నన్నట్టనిపించాయి...

ఆమె మాటాడే ప్రతిమాటా ఆమె కొక-మరొక రెవరో మాటాడుతూన్నట్టనిపించింది...

ఆమె చేతిని నా చేతిలోనికి తీసుకొని ఆమెకేసి పరీక్షగా చూస్తున్నాను...

జీవిత గ్రంథంలోని పుటలు ఒక్కసారి వెనక్కి తిరగటంతో-గడిచిపోయిన సంఘటనలు గుర్తుకు వస్తున్నాయి...గడిచిపోయిన విషాదసంఘటనలు గుర్తుకు రావటంతో నా హృదయం ఆవేదనతో నిండిపోయింది...విషాదంతో బరువెక్కిపోయింది...

బరువెక్కిన హృదయం—తేలిక పడాలంటే-నా విషాదగాథని వినేవాళ్ళుండాలి;



విని నాపట్ల సానుభూతిని చూపగలిగినవాళ్లై వుండాలి. ఈ రకమయిన సానుభూతిని-నేను ఆర్ద్రపూరిత మయిన స్త్రీ హృదయాన్నుంచే ఆశిస్తాను.

## 2

సంధ్యాసమయం... సూర్యుడు పశ్చిమాద్రిని కుంగుతున్నాడు... ప్రకృతి కాంతని కౌగలించుకోవటానికి ఆతురత పడుతున్నాయి చీకటులు.

వసారాలో పడక కుర్చీలో కూర్చుని—శూన్యంలోకి చూస్తున్నాను... కూర్చున్నానన్న మాటే నాబుద్ధి గిర్రున తిరిగిపోతోంది...

అనుపమ-నాకు కొద్దిదూరంలో నే నుంచుని-నాకేసి పరీక్షగా చూస్తోంది ...చెట్లగుబురుల్లోంచి అప్పుడప్పుడు వినవచ్చే పక్షికూతల్ని మినహాయిస్తే -నిశ్శబ్దం అంతటా ఆవరించిందని చెప్పాలి.



కదిపిన తుట్టెలోని తేనెటీగలకి మల్లే—నాగడిచిన జీవితంలోని సంఘటనలు నన్ను ముసురుకొని వేధిస్తున్నాయి...కళ్ళల్లో నీళ్ళు క మ్ముకున్నాయి...తుదకు-ఆమే నిశ్శబ్దాన్ని భంగంచేసింది "చూడండీ-మీరు మగోలా అనుకోకపోతే..."అంటూ ఏదో అనబోయి అర్ధాంతరంగానే ఆపుచేసింది.

ఆమెకేసి-నేను సావధానంగా చూశాను-

అప్పుడే-చీకట్లు అంతటా అలముకొన్నాయి...పనిమనిషివచ్చి-దీపంవెలిగించి వెళ్ళిపోయింది...దీపానికిఒకపక్కగా ఆమె నిలబడటంవలన—వెలుగు నీడలు ఆమెతో దోబూచులాడుతున్నాయి...

'అడగండి—సంశయిస్తారెందుకు?—' అన్నాను.

ఆమె కొద్దిసేపు తటపటాయించి అంది: "అదే...మీ కనుకొలకుల్లో కన్నీరు...ఆ కన్నీరుకు కారణమయిన జీవితం తెలుసుకోవాలనివుంది..."

ఆమె అలాఅనటంతో షేపిచ్చెత్తిన వానికిమల్లే-ఆమెకేసి గుడ్లు మిటకరించి చూశాను... "తెలుసుకోవాలనివుందా?—తెలుసుకొని నవ్వరుకదా-"అని ఉన్మాదునికి మల్లేగట్టిగా అరిచాను. కానీ అక్షణంలో—స్త్రీహృదయం ప్రేమపూరితమయినదనీ, ఇతరుల కష్టాలువిన్నప్పుడు—సానుభూతి చూపిస్తుందేతప్ప హేళనచెయ్యదన్న విషయాన్ని మరిచిపోయాను.

నేనిలా ఘర్జించేసరికి—ఆమె అదిరిపోయింది..నాకేసి-బిక్కబోయిచూసింది...

నాప్రవర్తనకు నేనేసిగ్గుపడి— "క్షమించండి—ఏదోఆవేశంలో అలా అనేశాను-" అన్నాను.

"క్షమించటానికేముంది లెండి—ఇతరుల విషయాల్లో జోక్యంకలిగించుకోవటం—నాదేపొరపాటు—" అని ఆమె అవమాన పూరితమయిన స్వరంలో అంది.

గులాబీరేకుని గాయపరచటానికి—గుండు సూదిచాలు. ఆమెకేవిధంగా నచ్చచెప్పాలో నాకు తెలియదు.

"చూడండీ—మనిద్దరం కలుసుకొన్న క్షణం ఎట్లాంటిదో తెలి[illegible]కానీ, మనిద్దరి మధ్యా ఏదో విచిత్రమయిన అనుబంధం అల్లుకుపోయింది...ఆ అనుబంధమే... మిమ్మల్ని నన్నిలా ప్రశ్నించటానికి ప్రేరేపించింది—అందుకని—ఇందులో వింతేమీ లేదు. నావిచారంలో పాలుపంచుకొని-నాకు సానుభూతిని చూపగల హృదయం కోసమే-నేనా ఇన్నాళ్ళూ వెతుకుతున్నాను. ఎందుకో తెలియదు కానీ, నాగడిచిన గాధని వినిపించటానికి నాహృదయం కుంచించుకుపోతోంది...అయినా చెబుతాను-వినండి—

**3**

నేను అప్పుడే ఎం. బి. పూర్తిచేశాను,

# అనంతలక్ష్మి

కోర్సు పూర్తిఅయినవెంటనే-నాకు అసిస్టెంట్ సర్జన్‌గా ఉద్యోగం లభించింది... నా కొవ్వూరు కొత్తకావటంవల్ల నా బాల్య స్నేహితుడయిన చక్రవర్తియింట్లో మకాం పెట్టాను-భోజనం గట్రాకూడా అక్కడే.

చక్రవర్తి ప్లీడరీ చేస్తున్నాడు...రెండు చేతులా బాగా గడిస్తున్నాడు. ఇప్పుడుంటున్న మేడ తన స్వార్జనతో కట్టినదే నని-అతను గర్వంగా చెప్పుకొన్నాడు. చక్రవర్తి అవివాహితుడు కావటంవల్ల-ఇంట్లో అతని చెల్లెలు తప్పిస్తే మరొక రెవరూ ఆడవాళ్ళు లేరు...వంటా అదీ చేయటానికి ఇంట్లో ఒక వంటవాడున్నాడు.

చక్రవర్తి బాల్యస్నేహితుడని-నేను యిదివరకే చెప్పాను...హైస్కూలు చదువంతా మే మిద్దరం కలిసే చదువుకొన్నాం ... మా ఇళ్ళుకూడా పక్కపక్కన్నే ఉండేవి ... ఇద్దరం ఒకళ్ళింట్లో ఒకళ్ళం మహా చనువుగా తిరిగేవాళ్ళం.

వచ్చిన రోజునే-'అనంతలక్ష్మిని చూశావుటా?'— అన్నాడు. కొద్దిసేపు తటపటాయించి-బహుశా-ఇది అతని చెల్లెలిపేరే అయుంటుందని ఊహించి 'మీ చెల్లెలా?'— అన్నాను.

'అవునవును — రా చూద్దువుగాని.' అన్నాడు.

అమెనంత ప్రత్యేకంగా చూడవలసిన అవసరం ఏమిటో నాకు తెలియలేదు ... కాకపోతే ఆమె నాతో చిన్నప్పుడు ఆడుకొనేది...సన్నగా పీలకజెడతో చాలా అసహ్యంగా ఉండేది...

'ఇప్పుడెందుకురా-తర్వాత చూదాంలే' అన్నాను.

చక్రవర్తి-నే చెప్పేదేమీ వినిపించుకో

> మొదటివాడు:-ఏయ్,నువ్వు ఎన్నిసార్లు గెడ్డంగీస్తావు.
>
> రెండవవాడు:- రోజుకి 40 సార్లు లేక 50 సార్లయినా గీస్తా.
>
> మొదటివాడు:- అయితే నీకేమైనా పిచ్చి ఉందా?
>
> రెండవవాడు:-పిచ్చి దేనికి? నేను మంగలి వాణ్ని.
>
> బి.హెచ్. హర్షవర్ధనరావు (కవులూరు)

కుండా-నా జబ్బపట్టుకు తీసుకుపోతూ 'అదేమిటోయ్-అలా సిగ్గుపడతావ్?-అదీకాక - నువ్వు డాక్టరువాయిని'-అన్నాడు.

వా డనేదేమిటో నాకు అర్ధంగాలేదు, వాడే విశదపరిచాడు...వాడి చెల్లెలికి అప్పుడప్పుడు ఫిట్సు వస్తుంటాయిట, ఫిట్ వచ్చినప్పుడు-కాళ్ళూ చేతులూ కొట్టుకోదుగానీ వంటిమీద స్పృహలేకుండా పడుకొని ఉంటుందిట. ఫిట్ ఎప్పుడొస్తుందో తెలియదుగానీ వచ్చినప్పుడుమాత్రం ఒకరోజల్లా ఉంటుందట, ఆ తర్వాత చక్రవర్తి ఇంకో విషయంకూడా చెప్పాడు...ఫిట్‌లో ఉన్నప్పుడు ఆమె మూసినకళ్లు తెరవకపోయినప్పటికీ-చుట్టూ జరుగుతూన్న సంగతులన్నీ తెలుస్తూనేవుంటాయిట-

'అయితే-చూద్దాం పద' అన్నాను.

ఇద్దరం మేడ మెట్లు ఎక్కి - ఆమె గదిలోకి దారితీశాం...ఆమెను చూట్టంతో నే నిశ్చేష్టుణ్ణయిపోయాను!!...తెల్లటి పాన్పుమీద పడుకొని-ఏదో పుస్తకం చదువుకొంటోంది...దివినుండి భువికి దిగివచ్చిన దేవకన్యే - ఈవిధంగా మంచం మీద పడుకొని చదువుకొంటోం దనిపించింది ... మమ్మల్ని చూస్తూనే-లేచి కూచుని-లోపలికి రమ్మని ఆహ్వానించింది...పిరుదులదాకా వ్యాపించిన సుదీర్ఘ వినీలకుంతలాలు...పద్మాల్లాంటి నేత్రాలు... సంపెంగపువ్వులాంటి నాసిక అరుణారుణకాంతులతో మెరిసిపోయే అధరాలు...గులాబీలని జ్ఞాపకంచేసే చెక్కిళ్లు... గాలికిసయితం సోలిపోయే కోమలమయిన శరీరం...అబ్బ!! ... ఈ ముగ్ధమోహన సౌందర్యరాశిని బ్రహ్మ ప్రత్యేకంగా సృష్టించాడా-అనిపిస్తోంది...

చిన్నప్పటి అనంతలక్ష్మికీ-ఇప్పటి ఈ అనంతలక్ష్మికీ ఎంతి తేడా!!;—

చక్రవర్తి చెల్లెలితో -నా గురించి ఏమిటేమిటో చెప్పుకుపోతున్నాడు...కానీ-నా కదేమీ చెవికెక్కటంలేదు...నేను అనంతలక్ష్మిని గురించే ఆలోచిస్తున్నాను... చివరికి ఆమే పలకరించింది: 'మిమ్మల్ని తిరిగి కలుసుకోగలిగినందుకు-చాలా సంతోషంగా ఉందండి...'—

'నాకేం మాట్లాడాలో తెలియలేదు; ఆమె ఇలా ఆకస్మికంగా పలకరిస్తుందని నేను ఊహించలేదు.

తడబడుతూ, 'మీ అన్నయ్య మీకు ఫిట్లని చెప్పాడూ?-' అన్నాను.

అంతవరకూ చిరునవ్వులు చిందిస్తూన్న ఆమె మొహం-ఒక్కసారిగా ముడుచుకొని పోయింది...కోపంగా వాళ్లన్నయ్య కేసి చూసింది...

వాళ్లన్నయ్యకి-ఏం చెప్పాలో తెలియక 'మీరు మాటాడుతూండండి - ఇప్పుడే

వస్తాను' అని చల్లగా జారుకొన్నాడు.

నేను సంభాషణ ప్రారంభించిన విధం చూస్తే-నాకే సిగ్గేసింది...

ఆమెకు క్షమాపణ చెప్పుకొంటున్నట్లుగా 'సారీ, సారీ' అన్నాను.

మరి కొంచెం సేపయాక 'క్షమించండి-' అన్నాను.

'క్షమించటానికేముంది లెండి-మా అన్నయ్యకిది అలవాటే-మా యింటికెవరొచ్చినా నా రోగం గురించి చెప్పకుండా ఉండలేడు-' ఆమె చాలా బాధతో అంది.

ఆ తర్వాత మా యిద్దరి సంభాషణా సాఫీగానే సాగిపోయింది... నేనుమాత్రం రాగ ప్రస్తావన ఏమాత్రం తీసుకురాకుండా జాగ్రత్తపడుతూనే ఉన్నాను-ఆమె మా చిన్నప్పటివిషయాలేవో జ్ఞాపకం చేసింది... మే మిద్దరం—మాఇంట్లో పెరటివైపున ఉన్న వసారాలో కూచుని బువ్వాలాటలు ఆడుకొనేవాళ్లంట... నేను అల్లరిచేసి అందరిచేతా తన్నులు తినేవాణ్ణిట...కోపం వచ్చినప్పుడు ఆమె పిలకజెడని లాగుతుండేవాణ్ణిట...ఇంకా-ఇలాగే ఏవేవో చెప్పుకొచ్చింది... నేను-ఆమె చెబుతున్న సంగతులు జ్ఞాపకం వున్నట్టు-'అవునవును' అనో 'మరే మరే' అనో అంటున్నాను.

# 4

అనంతలక్ష్మి నాతో చాలా చనువుగా సంచారం చేది-ఆమే నేనూ కలిసే భోంచేసే వాళ్లం...ఆమె నాతో అనేక విషయాల్ని గురించి చర్చించేది...ఒక్కొక్కప్పుడు ఏవో పుస్తకాలమీద చర్చలు మొదలుపెట్టేవాళ్లం...ఇంక ఆ చర్చలకి అంతూ దరీ ఉండేదికాదు.

ఆమెతో నాకుగల సన్నిహితత్వం క్రమంగా ప్రేమగా పరిణమించింది... నేనామెని గాఢంగా ప్రేమిస్తున్నానని తెలుసుకోవటానికి నాకెట్టేకాలం పట్టలేదు. ఆమెను నాదానిగా చేసుకోవాలనే తహతహ-నాలో క్షణక్షణానికీ పెరిగిపోయింది...ఆమె తోడిదే నా జీవితం అనిపించింది...ఆమెలేని బ్రతుకు వృధా అనిపించింది—అయితే నన్ను ప్రేమిస్తోందా లేదా అన్న ఊహ నాకప్పట్లో తట్టనేలేదు—

సరాసరి చక్రవర్తి దగ్గరకెళ్ళి-అనంతలక్ష్మిని నా కిమ్మనమని అడిగాను—అంత సిగ్గువిడిచి-ఎలా అడగగలిగానో నాకే తెలియదు!!!-కానీ నా నెత్తిమీద పిడుగుపడినట్టయింది. నా కాళ్ళకింద భూమి జరుగుతూన్నట్టనిపించింది.

చక్రవర్తి-అనంతలక్ష్మిని నాకిచ్చి వివాహం చెయ్యటానికి వీలులేదన్నాడు. ఆమెకు అదివరకే సంబంధం కుదిరిపోయిందన్నాడు. వరుడు గోపాలరావుట.

గోపాలరావు బి. ఇ. చదువుతున్నాడు— బాగా కలవారి బిడ్డ. అప్పుడప్పుడు—వీళ్ళింటికి వస్తూపోతూ ఉండేవాడు. అతను వీళ్ళింటికి వచ్చినప్పుడల్లా—కమ్మనికంఠంతో ఎంకి పాటలూ అవీ చక్కగా పాడుతూండేవాడు. మనిషికూడా మంచి హుషారుగా వుండేవాడు. అనంతలక్ష్మికూడా అతగాణ్ణి తెగమెచ్చుకొనేది.

ఏమయితేనేం-అనంతలక్ష్మి నాకు కాకుండా పోయింది...జీవితంలో తొలిసారిగా పరాజయాన్ని చవిచూడవలసిన అగత్యంపట్టింది. అనంతలక్ష్మిని నాదానిగా చేసుకోలేకపోయానన్న బాధతో-నా హృదయం తూట్లుపడిపోతోంది-నా జీవితంలో పెనుతుఫాను ప్రారంభమయింది...ఈ తుపానుకు తట్టుకోగలనో లేదో నాకు తెలియదు...

# 5

ఆ రోజల్లా-ఆమె నాకు కనిపించలేదు. అసలామె-గదిదాటి బయటకి వచ్చినట్టు లేదు.

చక్రవర్తి ఇంట్లో-కిందిభాగంలో ఒక్క వంటవాడు తప్పిస్తే-మరొకరెవరూ ఉండరు. మేడమీద మధ్యగా పెద్దహాలు. ఆ హాలు నానుకొని ఇవతల రెండుగదులూ, అవతల రెండుగదులూ ఉన్నాయి. హాలు అవతలఉన్న రెండు గదుల్లోనూ ఒక దాంట్లో అనంతలక్ష్మి వుంటోంది. ఇవతలవున్న రెండుగదుల్లోనూ చక్రవర్తి నేనూ చెరో గదిలోనూ ఉంటున్నాం-మధ్యహాలు ఎవరయినా స్నేహితులు వచ్చినప్పుడు ఉపయోగపడుతూంటుంది...

ఆ మరుచటినాడు గోపాలరావు వచ్చాడు ... అందరం భోజనాలకు కూచున్నాం ... అనంతలక్ష్మిమాత్రం రాలేదు-బహుశా భోజనం పైకే తెప్పించుకొని వుంటుందనుకొన్నాను.

భోజనాలయిన తర్వాత-చక్రవర్తి ఏదో పనుందని బయటకు వెళ్లిపోయాడు. నేను గోపాలరావుని పైకి రమ్మనమన్నాను. అతను పైకి రావటానికి వొప్పుకోలేదు. వెళ్ళిపోవాలన్నాడు—

సరేనని-నేను నా గదికి వెళ్ళిపోయాను...

కిటికీ పక్కగా కుర్చీ వేసుకొని - శూన్య జగత్తులోనికి చూస్తున్నాను...

ఇంతలో-కిందనుంచి-ఏదో విరహగీతం వినిపిస్తోంది...పాడుతూన్నది కూడా గోపాలరావే.

గోపాలరావు ఎందుకిలా విరహగీతాన్ని ఆలాపిస్తున్నాడో నాకు తెలియలేదు కానీ-నాకా విరహగీతాన్ని వింటూంటే-హృదయం కదిలిపోయింది...

గోపాలరావు స్వరంలో-విరహం, దైన్యం మూర్తీభవించాయి...అతని పాటలో బాధ గూడుకట్టుకొనివుంది...


కాశ్మీర్ శాల్వ రు. 6/-లకే
ఆకర్షణీయమైన పెద్దసైజు కాశ్మీరుశాల్వ మీరు కోరిన నమూనాలో రు.6 కే పొందండి.
పోస్టేజి, ప్యాకింగు రు.1-50 షరా: 2 శాల్వలు ఒకేదఫా కొన్నవారికి పోస్టేజి ఉచితం. 3 శాల్వలుకొన్నవారికి ఒక శాల్వ ఉచితం. HIND SHAWL HOUSE, Urdu Bazar (APM) Delhi-6.



మీ యిష్టంవచ్చినది తినండి,
హ్యూలెట్స్
మిక్శ్చర్
భోజనానంతరం కలిగే కడుపు నొప్పిని పూర్తిగా పోగొడుతుంది
సి.జె. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
86/A. నైనియప్ప నాయక్ స్ట్రీట్, మద్రాసు-3
JWT CIH 1128



శ్రీవత్సవారి
సుభ్
బారు సబ్బు
ఉతుకులకు నిత్యము ఉపయోగపడునది.
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్ (ప్రైవేట్) లిమిటెడ్
మద్రాసు-30

అతని పాట—నా హృదయాన్ని కలచి వేస్తోంది...అతని పాట-నా నరాల్ని బిగబట్టి లాగుతున్నట్టనిపించింది...అబ్బా...నే నీ బాధను తట్టుకోలేక పోతున్నాను...అతడు పాటని ఆపుచేస్తే బాగుండు ననిపించింది...కానీ అతను ఆపుచేసేట్టు లేడు...

## అనంతలక్ష్మి

అలా పాడుతూనే వున్నాడు...ఆపాటకి అంతూ దరీ కనిపించటం లేదు...

నా కళ్లు బైర్లు కమ్మాయి...నా బుర్ర గిర్రున తిరుగుతోంది...ఏం చేస్తున్నానో తెలియని స్థితి నన్నావహించింది...గబగబా లేచి అడుగులు వేస్తున్నాను...నా అడుగులు అనంతలక్ష్మి గది ముందు ఆగాయి...తెర తొలగించి లోపలికి చూశాను...అనంతలక్ష్మి


వనితామణికి పరవశంగాదా!

# తన సౌందర్యం మెప్పుగొనగా!

విద్యాభవనంలో, దేవాలయంలో, సభాభవనంలో, మీరున్న ఎల్లచోట్లా కొరవచూపుచున్న వింతచూపులు...మీరూప లావణ్య సూచనలుగా మీ మనోవీధిని మెదలుచుండుచు, మీరు అతిసుందరరూపం కలిగియున్న దృఢనమ్మకం హెచ్చుచున్నకొలదీ మీ సొగసు వృద్ధిపొందదా! అతి సౌందర్యమైన వనితగానుండవలెనంటే, ఆమె చర్మము సొగసుగా నుండవలెను అని సినీమాతార సావిత్రికి తెలియును. ఆమె ఇలా చెప్పుచున్నది, 'అనేకమంది సినీమాతారలవలె, పరిమళమైన లక్స్‌యందు నాకు నమ్మకం. దాని సౌమ్యమైన మీగడవంటి నురగ నా చర్మమును మెరయుచుండే మృదువుగా వుంచుచున్నది.' మీరుకూడా అమిత సౌందర్యంగా వుండండి-లక్స్ వాడుటవల్ల!



సావిత్రి, ఎ.వి.ఎమ్.వారి 'కలత్తూర్ కణ్ణమ్మ' చిత్రంలో తార.

సినీమాతారలకు
సౌందర్యమునిచ్చే
శుద్ధమైన,
సౌమ్యమగు సబ్బు




LTS. 49-X52 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ప్రశాంతంగా నిద్రపోతోంది-తనకే విరహాలతోగాని విషాదాలతోగాని నిమిత్తం లేనట్టు ..

'నా కథని ఇంతటితో ఆపు చెయ్యనియ్యండి—నన్నిక ముందుకు సాగనియ్యకండి...'

'అదే కుదరదు—సగం సగం కథ చెబితే-మొండి తేలై పడతారు...' అంది అనుపమ.

నాకు ముందుకు సాగక తప్పలేదు;

"నేనేం చేస్తున్నానో-నాకే తెలియనిస్థితి నన్నావహించిందని— నేను ఇంత క్రితమే చెప్పుకొన్నాను...

తెల్లటి చీర కట్టుకొని—జుట్టు విరయబోసుకొని పడుకొనివున్న ఆమెను చూస్తోంటే—పున్నమనాటి చంద్రుణ్ని చూస్తున్నట్టనిపించింది...

విషాదంతో నిండిపోయిన నా హృదయంలో ఒక కొత్త ఆలోచనకు స్థానం దొరికింది ...చూస్తోండగానే ఆ ఆలోచన 'ఇంతింతై వటుడింతై' అన్నట్టుగా నా హృదయాన్నంతటినీ ఆవరించుకొంది...అది చాలా వికృతమయిన ఆలోచన—అని నేను ఒప్పుకొంటాను...కానీ—పరిస్థితులే నాకావిధమైన ఆలోచన కలిగించాయంటాను...

ఆమెను సమీపిస్తుంటే నా శరీరం విద్యుద్ఘాతం తగిలినట్టుగా వణికిపోయింది. .ఆమె ఇంకా ప్రశాంతంగానే నిద్రపోతోంది.. బహుశా—ఏవో మధురస్వప్నాలు కంటోందేమో...

నాలో పశువు ప్రవేశించింది. .నేను చేస్తున్న పనివలన కలిగే అనంతర ఫలితాలేవిటో తెలుసుకోలేని ఉన్మాదస్థితి నన్నావహించుకొంది...

ఆమెను నా హృదయానికి బలంగా హత్తుకొని—గట్టిగా ముద్దు పెట్టుకొన్నాను...అంతతో పూరుకొన్నా బావుండును...కానీ - నన్నావహించిన ఉన్మాదం నన్ను అంతతో ఊరుకోనియ్యలేదు. పుష్పాన్ని చూసి ఆనందించటంతో ఊరుకోం.. దాన్ని నలిపి పారవేసే వరకూ మనకు సంతృప్తి కలుగదు.

'ఛీ...ఛి.. మీరింత నీచస్థితికి దిగజారుతారనుకోలేదు' అంది అనుపమ

'అవును-చాలా నీచమయిన స్థితికే దిగజారాను అందుకు నేనూ సిగ్గుపడుతాను-కానీ—అందుకు ప్రోదిచేసిన పరిస్థితుల విషయంకూడా ఆలోచించమంటాను ...

# 6

ఆ తర్వాత—నేను—అనంతలక్ష్మి మొహాన్నికూడా చూడటానికి సాహసించలేకపోయాను.. క్షణికోద్రేకానికి లోబడి-అట్టడుగుస్థితికి దిగజారిన నేను ఆమెను చూడటానికి భయపడటంలో ఆశ్చర్యం ఏముంది?-

చక్రవర్తికికూడా సాధ్యమయినంతవరకూ కనపడకుండా మొహం దాచేసుకుని-తిరుగుతున్నాను.

ఆవిధంగా రెండురోజులు గడిచాయి.. ఆ రెండురోజులూ రెండుయుగాలకిమల్లె గడిచాయని చెప్పాలి...ఈలోగా అనుకోని పరిణామాలు కొన్ని జరిగాయి...

నేను—వాళ్ల ఇల్లు విడిచి వెళ్లిపోదామని బెడ్డింగూ అదీ సర్దుకొంటున్నాను...

ఇంతలో చక్రవర్తి గాలిగుమారంలాగ గదిలోకి వచ్చిపడ్డాడు. 'ఏవిట్రా నువ్వు చేస్తున్న పని?—' అన్నాడు.

'బెడ్డింగు సర్దుకొంటున్నాను... నేను మీ ఇల్లువిడిచి వెళ్ళిపోదామనుకొంటున్నాను' అన్నాను.

చక్రవర్తి- నాసమాధానం విని—నిశ్చేష్టుడయిపోయాడు...కొద్దిసేపటాక తేరుకొని- 'ముందునువ్వు కట్టుతూన్న బెడ్డింగు పరుచు ...నీతోటి కొన్నివిషయాలు మాట్లాడాలి-అన్నాడు.

'ఏవిటి నువ్వనేది?—'

'అదేనోయ్—సావధానంగా కూచుని నీతోటి కొన్నివిషయాలు మాటాడదామని వచ్చాను—' అన్నాడు.

తిరిగీ అతనే మొదలు పెట్టాడు; "మాడు మూర్తి—నువ్వొకప్పుడునన్నొకవిషయాన్ని గురించి అర్థించావ్ — నేనప్పుడు ఒప్పుకోలేకపోయాననుకో...

'అదేనోయ్. .అలానివ్వెరపోయి చూస్తావేమిటి?—నువ్వు మా అనంతలక్ష్మిని చేసుకుంటానని ఒకప్పుడు అన్నావ్—ఇప్పటికీ—ఆమాటమీదే ఉన్నావా—అని అడుగుతున్నాను. .'

'ఈసారి నేను నిజంగా నిశ్చేష్టుణ్నయిపోయాను.. అందనిఫలం ఈవిధంగా సునాయాసంగా చేతికందుతుందని—నేనెప్పుడూ అనుకోలేదు .'

అదే—గోపాల్రావ్ లేడూ!—అతను అనంతలక్ష్మిని చేసుకోదలుచుకోలేదుట. వాళ్ల తల్లిదండ్రులు ఒప్పుకోలేదుట. అందుకని—నువ్వు ఊ అంటే నీకిచ్చి చేద్దామని అనుకుంటున్నాను—మరి నువ్వు ఏమంటావ్ చెప్పు—'

నాకు లక్షరూపాయల లాటరీ వచ్చినట్లనిపించిది.. నా గుండె ఆగిపోయినంత పనయింది—కరుణామయుడైన ఆభగవంతునికి మనస్సులోనే చేతులెత్తి నమస్కరించాను—

'మానం అర్ధాంగీకారం—అన్నారు—ఒప్పుకొన్నావన్నమాట —' అన్నాడు.

ఎందుకు ఒప్పుకోను ?—పిలిచి పిల్లనిస్తానంటే- ఒప్పుకోనివాడు ఎవడైనా ఉంటాడా ?—

'సరే- నీయిష్టం వచ్చినట్లు కానియ్యి'-అన్నాడు.

చక్రవర్తి ఎగిరిగంతేసి—నాకు 'థాంక్యూ' చెప్పి వెళ్లిపోయాడు...

నా హృదయం- ఆనందాన్ని పట్టలేక ఉక్కిరిబిక్కిరయిపోయింది...

అనంతలక్ష్మిలాంటి సౌందర్యరాశిని చేజిక్కించుకొన్న- నేను నిజంగా ఎంత అదృష్టవంతుణ్ణి !!!—

మరికొద్ది నెలల్లోనే- మా యిద్దరికీ వివాహం జరిగిపోయింది.

# 7

జీవితంలో- ఇంతటి విషాదంవుందని-నాకింతవరకూ తెలిసిరాలేగు...

అనంతలక్ష్మిని నాదానిగా చేసుకోవటం వలన కలిగిన ఆనందం- కొద్దికాలమే నిలచి ఉంటుందని నేనెన్నడూ ఊహించలేగు...

వివాహానికి పూర్వం- భావి జీవితాన్ని గురించి నేను కట్టుకొన్న మేడలన్నీ చూస్తోండగానే కుప్పగా కూలిపోయాయి...

జీవితంలో- సంతోషం-విచారం-రెండూ ఒకదానిపక్క మరొకటి- బొమ్మా బొరుసులమల్లె ఉంటాయికామోసు-

అనంతలక్ష్మిని వివాహం చేసుకొన్నానన్నమాటేకానీ- ఆమెవలన- ఏవిధమయిన ఆనందాన్నీ పొందలేకపోతున్నాను...

నాతోటి ఆమె సరిగా మాటాడదు-నన్ను చూసి ఆమె భయపడుతూన్నట్టుంటుంది...

విచారగ్రస్తమయిన వదనంతో- వొంటరిగా కూచుని — దేన్నిగురించో ఆలోచిస్తోంటుంది .

ఆమె మొహంలో పూర్వపు చిరునవ్వులు లేవు; ఆమె కళ్లల్లో పూర్వపు కాంతులు లేవు ..ఆమెకూ నాకూ మధ్య పెద్దగా ఏదో అడ్డుగోడ...

నా జీవితంలో తిరిగీ శిశిరం ప్రవేశించి-నా ప్రేమవృక్షాన్ని మోడుగా తయారుచేస్తోంది...

ఇంతలో- నాకా ఊరునుంచి బదిలీ అయింది...

స్థలంమారినా- అనంతలక్ష్మి పరిస్థితి మాత్రం అలానేవుంది...

నాకూ ఆమెకూ మధ్యగా ఏర్పడిన అగా

---

ఒకడు:-ఆ కుక్క చూడరా
ఎలా దున్నపోతులా వున్నదో!

రెండవ వాడు:- లక్షసార్లు
చెప్పివుంటాను, అతిశయోక్తి
మానరా అని.

ఎం. ఎ. అన్సారి (అనంతపురం)

---

# ఐటెక్స్ (కాటుక)

## అరవింద్ బిందీ
కుంకుమ చాందు

## తులిప్ పెర్‌ఫ్యూమ్









న-పాల్
నెయిల్ పాలిష్

అరవింద్ లాబరేటరీస్
P.B.1415 ........ మదరాసు-17.

GP



# కుటుంబ నియంత్రణం
## గర్భనిరోధానికి

స్త్రీలు సేవింపదగిన ఔషధము స్పెక్ టేబ్‌లేట్స్ (రిజష్టర్డ్) గర్భమురాకుండేందుకు తేలికగానోటిలో వేసుకొని మింగేమందు 12 రోజులు మందు వాడిన యడల గర్భధారణ కాకుండా చేయును..

పూర్తికోర్సు ప్యాకెట్టు
24 మాత్రలు
వెల రు 12/- వి.పి అదనము
ప్రతిచోట దొరుకును

ఇండియాలోను, విదేశాలలోను ఈమందువాడినవారు అయాచితంగా అనేక యోగ్యతాపత్రములను పంపియున్నారు...




SEENU & CO.,
28 K TANDAVARAYA GRAMANI ST - MADRAS 21
GRAMS ORCAS, (ESTD 1946), PHONE 55357.
(ADVT. PERMITTED UNDER G.O. MS. NO. 1121. HEALTH)



# ఆయుర్వేదౌషధములు.

శాస్త్రీయముగాను, నమ్మకముగాను తయారుచేయు సంస్థ.

## వేంకటేశ్వర ఆయుర్వేదనిలయం.
చింతలూరు.
ఆలమూరు పోస్టు ★ తూర్పుగోదావరిజిల్లా.

ఆంధ్రదేశమందంతటను బ్రాంచిలు, ఏజన్సీలు కలవు.

బ్రాంచి. 712, సెంట్రల్ బ్యాంక్ బిల్డింగ్స్,
సికింద్రాబాదు బ్రాంచి : 7-2-148 హిస్సామ్‌గంజి, పాత పోలీసుస్టేషన్ ఎదుట,
ఏజెన్సీ :-2, రతన్ బజారు, మద్రాసు-8


# అనంతలక్ష్మి

ధాన్ని తలుచుకుని-దుఃఖించని దినంలేదు...

ఇంక- నా జీవితం ఇలాగే గడిచిపోవాలి గాబోలు...

ఒకరోజు నదిఒడ్డుకు ఆమెను తీసుకు వెళ్లాను...

నదిఒడ్డుని పడవలు కట్టివేసి వున్నాయి... ఒక పడవమీదకు వెళ్ళి చివరగా కూచున్నాం అనంతలక్ష్మి నేనూను.

కిందుగా ఉధృతంగా ప్రవహిస్తున్న నదిని చూసి అనంతలక్ష్మి 'నాకు భయం వేస్తోందండీ...' అంది.

ఆమెను నేను దగ్గరగా తీసుకొని 'భయం లేదు అనంతా...నేనున్నానుగా...' అన్నాను...

అనంతలక్ష్మి నా బాహువుల్లో పావురానికి మల్లే పొదువుకుపోయింది...

ఆమె కనుకొలకుల్లో కన్నీరు కదలాడుతోంది.

హోరున గాలి వీస్తోంది... తెరచాపలు ఎగురవేసుకొంటూ-రివ్వున కదిలి పోతున్న పడవలు-ఎగిరెగిరిపడే కెరటాలు...చీర అంచులకిమల్లే కెరటాల తెల్లటినురుగులు...కూతలు కూసుకొంటూ స్వేచ్ఛగా విహరించే విహంగాలు ... ఎంతసుందరతరమయిన దృశ్యం...

అంతలో - గాలిలోంచి - ఏదో పాట - సన్నగా వినిపిస్తోంది- ఎవరో విషాదగీతాన్ని ఆలపిస్తున్నారు.

అనంతలక్ష్మి ఉన్నట్టుండి 'అదేపాట-అదేపాట-' అంది.

నేను ఆశ్చర్యంగా ఆమె మొహంకేసి చూస్తున్నాను...

పాట ఇంకా గాలిలోంచి తేలితేలి వినిపిస్తోంది...

ఆమే-తిరిగి అంది 'అదేపాట-గోపాలరావుకూడా ఆ రోజు అచ్చంగా ఇలానే పాడాడు...'

నా కెందుకో గానీ-ఆమె గోపాలరావుని కానీ ప్రేమిస్తోందేమో - అనిపించింది...

అనంతలక్ష్మి ఏదో చెప్పబోయి ఊరుకొంది.

'చెప్పు అనంతా-సంశయిస్తావేమి' అన్నాను.

'మరి మీరు మరోకలాగ భావించరుగదా' ...అంది.

'చెప్పు అనంతా- నేనెప్పుడూ నిన్ను మరోకలా భావించను' అన్నాను.

'నేను మిమ్మల్ని ప్రాణంకంటే అధికంగా ప్రేమిస్తున్నానంటే-మీరు నమ్మగలరా?' -

'ఎందుకు నమ్మలేను-తప్పకుండా నమ్మగలను' అన్నాను. కాని-నాకీ మాటలు హృదయంలోంచి వచ్చినట్లనిపించలేదు...

అనంతలక్ష్మి చెప్పటం మొదలుపెట్టింది. "మీరు అన్నయ్యని నన్ను మీకిమ్మని అడిగినప్పుడు-నన్ను మీ కివ్వటానికి వీలులేదనీ, గోపాలరావుతో నా వివాహం నిశ్చయం అయిపోయిందనీ-అన్నయ్యమీకు చెప్పాడు. ఇది మీకు గుర్తుందనుకొంటాను...అన్నయ్య ఆ విధంగా నిశ్చయించినట్టు అప్పటివరకూ నాకూ తెలియదు. కానీ-అప్పటికే నామనసు మీమీద లగ్నమయిపోయింది-వివాహం చేసుకొంటే మిమ్మల్నే చేసుకోవాలని నిర్ణయించుకొన్నాను... ఆ తర్వాత గోపాల్‌రావుని కలుసుకోవటం తటస్థించింది. అతడికి విషయాన్ని సవిస్తరంగా తెలియజెప్పి-మిమ్మల్ని వివాహం చేసుకోవటంలో-సహాయపడమని అతణ్ణి కోరాను. ఇదిదాదాపు అసాధ్యమయిన కోరిక-కానీ-గోపాలరావు చాలా ఉదాత్తమయిన స్వభావం కలవాడు-కనుక నే నేను అతణ్ణి ఒప్పించగలిగాను. నన్ను వివాహం చేసుకోనని మా అన్నయ్యకి తెలియబరుస్తానన్నాడు.

"నేను మనస్సులో నే అతడికి సహస్రాంజలులు ఘటించి-నా గదిలో వచ్చేశాను..."

"పడుకొన్నా నన్నమాటేగానీ-నాకు గాలిలో తేలుతూన్నట్టనిపించింది. నా అదృష్టాన్ని తలచుకొని నన్ను నేనే అభినందించుకొన్నాను. కానీ నాకు కలిగిన ఆనందంలో అతడికి కలిగిన విషాదాన్ని ఊహించలేకపోయాను. అందుక్కారణం-అతడుకూడా నన్ను గాఢంగా ప్రేమించటమే...

"ఆ వేళ.. అతడు పాడిన విషాద గీతం ఇప్పటికీ నాకు గుర్తుకు వస్తూనే ఉంటుంది...అతడి పాటను వింటూంటే-నా హృదయం కదిలిపోయింది...అతని మనస్సుకు ఎందుకు బాధ కలిగించానా - అనిపించింది...అతను పడే ఆవేదన-నేనే పడుతున్నట్టనిపించింది...అతడా పాటని ఆపుచేస్తే బాగుండు ననిపించింది...అయినా - అతడా పాటని ఆపుచెయ్యటం లేదు—చివరకు నాకు స్పృహతప్పి పోయింది...

ఆమె చెబుతున్నది వింటూ—'పాపం—గోపాలరావు...' అన్నాను.

'ఆ నీచుణ్ని జాలి దలచటం అనవసరం,' అంది అనంతలక్ష్మి.

ఆమె అంటున్నదేమిటో—నాకు అర్థంగాలేదు...ఆమె కేసి తెల్లబోయి చూస్తున్నాను...

అనంతలక్ష్మి తిరిగీ అందుకొంది: "గోపాలరావుని నీచుడన్నందుకు మీకు ఆశ్చర్యంగా వుందనుకొంటాను.. చేసిన వాగ్దానాలను మరచిపోయి—నీచమయిన స్థితికి దిగజారిన అతణ్ని—నీచుడని కాక - మరేమని అనమంటారు?—

నా వొంటిమీద స్పృహతప్పి పోయిందని నేను ఇదివరకే చెప్పాను—ఆ సమయంలో క్షణికోద్రేకానికి లోబడిన ఆ నీచుడు—నా గదిలోకి ప్రవేశించి—నిస్సహాయ స్థితిలోపడి వున్న నన్ను...నన్ను...అబ్బా... నే నిక చెప్పలేను . అప్పటినుంచీ—ఆ కళంకం—నన్ను పట్టుకు పీడిస్తూనేవుంది..." అంటూ ఆమె భోరున ఏడవటం మొదలుపెట్టింది...

'ఆ దుష్కృత్యాన్ని చేసిన నీచుణ్ని—నేను అనంతలక్ష్మి...అందుకు గోపాలరావు ఎంతమాత్రం బాధ్యుడు కాడ'ని నేను చెబుదామనుకున్నాను...కానీ—అంతలో నే ఆమెకు స్పృహతప్పి పోయింది...మరుక్షణం లోనే ఆమె నదీప్రవాహంలో పడిపోయింది. నా దురదృష్టాన్ని తిట్టుకొంటూ—'అనంతిలక్ష్మి' అంటూ ఆమెను పట్టుకొందామని నదిలోకి దూకాను...కానీ ప్రయోజనం లేకపోయింది...నా అనంతలక్ష్మి నన్ను ఏకాకిగా చేసి వెళ్ళిపోయింది...'

'ఇంతకీ—ఆ దుష్కార్యాన్ని చేసింది మీరేనని—మాట మాత్రంగానయినా అని వుంటే—మీ అనంతలక్ష్మి నదిలో పడకపోవును గదా...' అంది ఆమె.

'చెబుదామనుకున్నాను—కానీ—చెప్పటానికి అవకాశం లేకపోయింది'...అన్నాను నేను.

'జీవితంలో కష్టం, సుఖం—ఒకదానిని వెంబడించి మరొకటి తిరుగుతూనేవుంటాయి కదా...' అంది ఆమె.

నా కామె చెప్పే దేమిటో అర్థంగాలేదు.

'ఇంకా మీరు గుర్తించనేలేదా?—'

ఒక్కసారిగా- తెర తొలగినట్టయింది... అనుపమే నా అనంతలక్ష్మి అని తెలుసుకోవటానికి నాకాట్టేసేపు పట్టలేదు...నా హృదయంలోని విషాదం తొలగి—ఆనందానికి స్థానం ఇచ్చింది...

నదీప్రవాహంలో పడి కొట్టుకుపోతూన్న అనంతలక్ష్మిని ఎవరు రక్షించారు?—ఆమె ఇక్కడికి ఎలా వచ్చింది?—మొదలయిన చెత్త ప్రశ్నలతో కాలాన్ని వ్యర్థపరచదలచుకోలేదు...

'నువ్వు నాకు మళ్ళీ కనిపిస్తావని- అనుకోలేదు అనంతా—' అంటూ ఆమెను దగ్గరకు తీసుకొన్నాను. ★

ప్రశ్న:- మాస్టరుగారూ! క్రొత్తగా బడి ప్రారంభించినట్లుంది? మొత్తం మీ రోలు ఏమాత్రం ఉంటుంది?

సమా:-రాతిదా? కఱ్ఱదా!

డిల్లీ కృష్ణారావు (శ్రీ)కాకుళం


**సినిమా నటులు**

మీ రు సినీ కొరులుగా చేరి, నెలకు మంచి ఆదాయం పొందవలెనన్నచో నేడే మాకు వ్రాయండి. ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషు లేక హిందీలో వ్రాయవలెను.

BOMBAY FILM SERVICE
(A.M.W.)PHAGWARA(N.R)



**డాక్టరుగా వుండండి!**

ఇంటివద్ద నున్నప్పుడుపోస్టల్ ట్యూషన్ ద్వారా ప్రభుత్వ రిజిస్టర్డు కాలేజీనుండి డిప్లొమా పొందగలరు. ఉచిత ప్రాస్పెక్టస్‌నకు వ్రాయండి.

INDIAN HOMOEOPATHIC
COLLEGE.
(A.M.W) Jullundur City.









సోల్ ఏజంట్లు : దాదా & కంపెనీ, 8/3, సైనప్ప నాయకన్ వీధి, మద్రాసు-1



# వనితాలోకం

(ఇల్లాలిని ఆయింటి బానిసగా పరిగణించే అలవాటు చదువు, సారంలేని కొన్ని కుటుంబాల్లో నేటికీ సాగుతున్నది. ఇది నిజంగా శోచనీయం. మన నాగరికత స్త్రీని గౌరవించడంలోనే వుంది. అలా గౌరవించే సంప్రదాయం కుంటుపడినచోట వెంటనే సంస్కరణ అవసరం.

స్త్రీకి ఈ విషయంలో గల భయాలు రచయిత్రి కొంతగా వివరించారు.)

"నేను పెళ్ళి చేసుకోను. పెళ్ళి స్త్రీ జీవితాన్నే బానిసగా చేస్తుంది. పురుషుడు భార్యని కేవలం బానిసగా చేస్తాడు. ఆ బానిసత్వం నేను సహించను." అంటూ లెక్చరిచ్చింది ఒక శుభసమయాన మా స్నేహితురాలు.

ఇతర కారణాలవల్ల వివాహం చేసుకోకుండా వుండేవారినే నేను క్షమించగలను కాని కేవలం పైకారణంతోనే పెళ్ళిచేసుకోమనే అమ్మాయిల్ని చూస్తే మాత్రం నాకు ఒళ్ళు భగ్గుమంటుంది

స్త్రీ స్వాతంత్ర్యం, సమానహక్కులు అంటూ నోటికొచ్చినట్లు వాగి పెద్దలచేత నాలుగు చీవాట్లు తిని పెళ్ళిళ్ళు చేసుకుని ఆపైన కుక్కపిల్లల్లాగా అయిన ఆడపిల్లల్ని నేనెరుగుదును. ఆ పదాలకు అర్ధమే తెలియక పోయినా, సంసారంలో ఆ హక్కుల్ని చేతలద్వారా పొంది, సుఖశాంతుల్ని పొందిన అతివల్ని నేనెరుగుదును. అందుచేత స్త్రీ స్వాతంత్ర్యము, సమానహక్కులు అనే పదాలు కేవలం నోటితో వాడే పదాలు కావనీ, సంసారంలో భార్య ఆధిక్యతనుబట్టీ, భర్త స్వభావంబట్టీ ఆ హక్కులు స్త్రీకి సంక్రమిస్తవనీ నా వుద్దేశం. అంతేగాని, మనం (స్త్రీలు) ఆ హక్కుల కోసం ప్రాకు ... ంవల్ల ప్రయోజనమూ లేదు. పురుషులకు ... లపట్ల గౌరవం లేకపోతే, మనం ... ప్రయత్నించినా లాభమూ లేదు. ఒక ... చేసాధనకోసం ప్రయత్నించినా ఫలితమూ దారుణంగా పరిణమిస్తుంది.

ప్రకృతి సిద్ధంగా స్త్రీకీ పురుషుడికీ సమాన హక్కులే లభించాయి. ఏ నాగరికతను చూసి మనం విర్రవీగుతున్నామో, ఆ నాగరికత ప్రబలక మునుపు, స్త్రీలు - పురుషులు సమానంగా, స్వేచ్ఛగా అరణ్యాల్లో తిరిగేవారు. ఆనాటి స్త్రీలకు నేటి కట్టుబాట్లు యేమీ లేనేలేవు. ఆనాటి స్వేచ్ఛ ఈనాడు మనకు లేదు. అట్టి స్వేచ్ఛను (నేటి నాగరికతకు తగినస్వేచ్ఛ) పొందటానికి స్త్రీలు

## సి. కృష్ణకుమారి

ప్రయత్నించటంలో తప్పులేదు. కాని, పురుషుల్లో మార్పు రానంతవరకు అటువంటి స్వేచ్ఛ మనకు రానూరాదు. ఒకవేళ మనం పోరాడో, ప్రాకులాడో, ఆ హక్కుల్ని పొందినా అనేక కష్టనష్టాలకు గురికావలసి వస్తుంది. 'నాగరికత' అనే పదానికి సరైన లక్ష్యమేవుంటే, ఆ నాగరికత మనదేశంలో వ్యాప్తిచెందలేదన్నమాట. మన దేశంలో వ్యాపించిన నాగరికత మిడిమిడి జ్ఞానంతో కూడినదేగాని, సంపూర్ణ విజ్ఞానంతో యేర్పడినది మాత్రం కాదు. అందుచేతే మనదేశంలో స్త్రీలు ప్రతిక్షణం యెన్నో నష్ట కష్టాలను యెదుర్కోవలసివస్తుంది. అసలు, స్త్రీలు యెన్ని కష్టాలు యెక్కువగా అనుభవిస్తే అంత పతివ్రతలుగాపరిగణింపబడతారుమనదేశంలో. పైగా ఆ కష్టాలకు బాధ్యులైన వ్యక్తులపై స్త్రీలు యెదురుతిరిగితే వారు గడుగ్గాయలుగా లెక్కింపబడతారు లోకం దృష్టిలో.

అందుచేతే స్త్రీల విషయంలో యేక్రొత్త సంస్కరణ జరగాలన్నా, అది పురుషులవల్ల సాధ్యపడాలి. ఆ సంస్కరణకు స్త్రీలు బాధ్యులు యేమాత్రమూ కారు. ఈ విషయంలో నిజానిజాలు ప్రతిసంస్కరణనూ పరిశీలిస్తే ఇట్టే తేలిపోతుంది. ఉదా:— వరకట్నసమస్యనే తీసుకోండి! అబ్బాయి యస్. యస్. యల్. సి. నాలుగుసార్లుతప్పి, ఐదోసారి ఏ యేడుకొండలవాడి దయవల్లనో పాసై పి యు. సి. లో జేరితే, కట్నం పది వేలకు తక్కువ తీసుకోబోమని పొరంబల్లించే తండ్రులు యెందరు లేరు? ఆ అబ్బాయి ఒక అమ్మాయిని, కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటానని తల్లిని బ్రతిమాలితే యెంత కఠినాత్ములైనా కరిగిపోయి వొప్పుకుంటుంది. ఆ అబ్బాయి తన పంతమూ నెగ్గించుకుంటాడు. కాని! అదే తండ్రి చెవినపడితే, ఆ అబ్బాయి పంతం నెగ్గకపోగా, తెగతెంపుల దాకా వస్తుంది వ్యవహారం. కొన్ని విషయాల్లో పురుషులు పట్టినంత పట్టుదలగా స్త్రీలు వుండలేదు(?) అందుచేతే పురుషులు బయల్దేదీసే సమస్యల్ని, పురుషులే పరిష్కరించవలసివుంది. స్త్రీలకు యే పరిస్థితులలోనైనా ఇట్టే సర్దుకుపోయే స్వభావం సహజంగావుంది. అందుచేత స్త్రీలతో యెక్కువ పేచీ లేనేలేదు. మారవలసిన స్వభావం మొగవారిది(!)

ఒక 'స్త్రీ', స్వాతంత్ర్యాన్ని గురించీ, సమాన హక్కుల్ని గురించీ మాట్లాడే ముందు తన తండ్రీ, లేక భర్త స్వభావం ఆలోచించి మరీ మాట్లాడాలి. ఇకముందుసంగతి చెప్పలేనుగాని, ఈనాటికీ మన ఆంధ్రలో యే తండ్రీ తన కూతుర్ని అనవసరంగా బజారుకు పంపడు. ఏ భర్తా తన భార్య స్వేచ్ఛగా పరాయిమగవాడితో మాట్లాడటానికి ఇష్టపడడు. అటువంటప్పుడు కేవలం వివాహిత




జీవితమే బానిసత్వమనీ, భార్యలంటే బానిసలనీ యెందుకు అపోహపడాలి. అవివాహిత జీవితంలో లేని స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు వివాహితజీవితంలో క్రొత్తగా ఎక్కడినుండి వస్తవి? అట్లా ఆశించి, బంగారుకలలు కని, ఆ పైన వివాహం అయినతర్వాత తన కలలు నిజం కాదనీ, తనాశించిన, లేక తను నమ్మిన ఆదర్శాలు అమలుజరపటానికి భర్త ఆటంక పరుస్తున్నాడనీ, ఇక తన జీవితమే వ్యర్థమనీ అనుకోవటం యెంత అవివేకం!

అయినా పురుషులు మనం అనుకునేటంత అవివేకులు కారు. స్వభావాన్ని బట్టి కొందరు స్త్రీలయెడ మూర్ఖత్వంగా ప్రవర్తించినా, మరికొందరు మర్యాదగానే ప్రవర్తిస్తారు. ఇంటి యిల్లాలికి తగిన గౌరవమూ ఇస్తారు.

ఒక ఇంటియజమాని భార్యని క్షణక్షణాన హింసించి, నిమిషానికోసారి బయటకు గెంటెయ్యటానికి పూనుకుంటే, ఆ ఇల్లాలి యే అదృష్టరేఖో అడ్డుపడి ఆపుతుంది. మరొక భర్త భార్యని పువ్వుల్లో పెట్టి ఆరాధిస్తాడు. అటువంటి కొన్ని సందర్భాలలో భార్యే భర్తని అదుపులో పెట్టటానికి ప్రయత్నిస్తుంది. ఆ ఇంటికి ఆడపెత్తనం అనే పేరూ వస్తుంది. లోకంలో విభిన్న తత్వాలు గల వ్యక్తులు స్త్రీలల్లోను, పురుషుల్లోను వున్నారు. పురుషుల్లోను వున్నారు. స్త్రీలల్లో మొండి పట్టుదల, గయ్యాళితనం, అహంభావం గల మనుష్యులున్నట్లే, పురుషుల్లోను వున్నారు. స్త్రీలు తమ దుస్వభావాన్ని ఇతరుల అదుపు ఆజ్ఞలవల్లనైనా పోగొట్టుకుంటారు. కాని, ఆ స్వభావంగల పురుషులు తమకు తామే అధికారులు కాబట్టి, తమ దుస్వభావాన్ని మానుకోలేరు. అటువంటి స్వభావం గల భర్త తనభార్య తన ఆశయాలకు అనుగుణంగా ప్రవర్తించకపోతే సహించడు.

'స్త్రీలు' ఆదర్శాలను కలిగియుండటంలో తప్పులేదు. ఆదర్శాలను కలిగియుండటం మానవత్వానికి, వ్యక్తిత్వానికి నిదర్శనాలు. కాని, ఆదర్శాలు చెడుత్రోవపడితే ప్రతిఫలం ప్రమాదాలకు హేతువు.

ఒక 'స్త్రీ' తన 'సంసారాభివృద్ధే తన అభివృద్ధి' అనే ఆశయంతో బ్రతుకుతుంది. ఆమె ఆదర్శం ఆచరణీయమైనదీ, యోగ్యమైనదీను.

మరొక స్త్రీ తన ప్రవర్తన మంచిమార్గాన వుంటే చాలనే కోరికతోనే తన ప్రవర్తనను ప్రతిక్షణం సరిదిద్దుకోవటానికి ప్రయత్నిస్తుంది.

'నాకసలు ఆదర్శాలు లేనే లేవు', అంటుంది మరొక స్త్రీ.

ఇటువంటి ఆదర్శాలు గలవారితో ప్రమాదాలేమీ లేవు. కాని కొందరు స్త్రీల ఆదర్శాలు చాలా అనర్థదాయకంగాను, ఆశ్చర్యదాయకంగాను వుంటవి. 'భార్య అన్ని విషయాల్లోను భర్తతో సమానంగా వుండాలి. ఇంట్లో భర్తఅధికారం కన్నా, భార్యపెత్తనమే చెల్లాలి. అమ్మాయిగారి కోరిక ప్రకారం ఆయనగారు యెప్పుడుపడితే అప్పుడు షికార్లకు, షాపింగ్ కు బయల్దేరాలి. (ఆ భర్త ఇక వుద్యోగానికి తిలోదకాలివ్వవలసిందే) ఈ రకంగా వుంటాయి వారి ఆదర్శాలు. వారి ఈ రకమైన ఆదర్శాలు కొనసాగకపోతే, భార్యని భర్త బానిసగా చూస్తాడనీ, భార్య వ్యక్తిత్వాన్ని భర్త లక్ష్యంచెయ్యడనీ ఆ స్త్రీలు వాపోతారు.

కొందరి కోరికల అంతసులు ఇట్లావుంటే, మరికొందరి అమ్మాయిల కోరికలు, ఆదర్శాలు వింటానికి వింతగాను, కంటికి కంటకంగాను వుంటవి.

ఒక అమ్మాయి ఇంటరు చదువుతూనే యే బి. ఇడి. అమ్మాయినో చూసి వెక్కిరిస్తూ కోతలు కోస్తుంది ఈవిధంగా. 'ఛా! దరిద్రపు చెత్త బి. ఇడి. నేను చూడను! యే బి. యల్. లేక యం. బి. చదువుతాను.'

కాని! 'తానొకటి తలిస్తే దైవ మొకటి

తలచినట్లు' ఆ అమ్మాయి ఇంటరు ఫెయిల్ అవటమన్నా జరుగుతుంది లేక యిట్లాగో బి. ఏ. పాసై వెక్కిరించిన బి. ఇడి లోనే జేరాలిసివస్తుంది. ఆ అమ్మాయి బి. ఇడి చదవటంలో తప్పూలేదు. ఇంటరు తప్పటంలో అంతకన్నా తప్పూలేదు. కాని ఆ బి. ఇడి చదివేవారిని వెక్కిరించటంలోనే వుంది తప్పంతా! అటువంటివాళ్ళ ఆదర్శాల తీరు 'వుట్టి కెగరలేనమ్మ స్వర్గానికి యెగిరినట్లే' వుంటుంది.

మరొక అమ్మాయి, చదువుకున్నా పెళ్ళి చేసుకున్న అమ్మాయిని చూసి ఈ విధంగా యెగతాళి చేస్తుంది. "ఛీ! చవట లాగా డొక్కు పెళ్ళి చేసుకుంది. నేను చూడు! చదువయి పోగానే వుద్యోగం చేసి మా తల్లిదండ్రులకు సహాయం చేస్తాను" అంటుంది అవతలిఅమ్మాయిని ఛాలెంజిచేస్తూ. నిజంగా ఆ అమ్మాయి చదువయిపోగానే వుద్యోగంచేస్తే సంతోషించేదాన్నే! కాని! చదువు సగంలోనే పెద్దవాళ్ళు పెళ్ళి చెయ్యటం, ఆఅమ్మాయి పరీక్షలకు కూడా హాజరు కాలేకపోవటం జరిగింది.

'ఉద్యోగం సంగతి యేమిటని' అడిగితే, 'పెళ్ళయితే మాత్రం వుద్యోగం చెయ్యవాయేం! ఇంట్లో అంతా నా పెత్తనమేగా!' అంది.

ఆ తర్వాత రెండేళ్ళకు ఒక పాపాయితో పుట్టింటికొచ్చినప్పుడు చూశాను. నన్ను చూసి ఆ అమ్మాయి కొంచెం చిన్నబుచ్చుకుంది. (ఎందుకంటే వుద్యోగం సంగతి అడుతానేమోనని) అది నేను గ్రహించి మెదలకుండా ఊరుకున్నాను.

ఆదర్శాలు జీవితాలను బాగుచేసేవిగా వుండాలి. ముఖ్యంగా స్త్రీలు ఆదర్శాలను ఆచరణలో పెట్టటం చాలా కష్టం. అందుచేతే మనకు అందుబాటులో వుండే, ఆదర్శాలనే మనం నమ్ముకోవాలి. లేకపోతే మనం మనకుమించిన ఆదర్శాలను తలపులో పెట్టుకోవటం, చివరకు అవి 'అందని మ్రానిపండ్లయి' మనని బాధించటం, దాంతో జీవితమే నిస్సారంగా గోచరించటం జరుగుతోంది. ఒక ఇల్లాలు స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసం ప్రాకులాడటం జీవితంతో చెలగాటలాడటం లాంటిది.

'భార్య బానిస' అనే పదానికే అర్థం లేదు. ఒకరు తన భార్యని దాసీదానిలాగా, వంటకత్తెలాగా వాడుకుంటే, మరొకరు తన భార్యని 'దేవత'గా భావిస్తారు. స్వభావంలో తేడాలేగాని, 'భార్య బానిస' అనే పదంలోగల మహాత్వం కాదు.

ఒకసారి నేను మా బావగారింటికి వెళ్లాను. అందరు భోజనాలు చేశాక, వసారాలో కూర్చున్నాం. మా బావకి దగ్గరి చుట్టమే (వరస నాకు తెలీదు) ఒకాయన భార్యా సమేతంగా విచ్చేసి మా బావతో సొదేసుకున్నాడు. ఆవిడ మాతో మాట్లాడుతోంది.

## ఆలుమగలు పరస్పరం

ఆ కబుర్లు, ఈ కబుర్లూ అయ్యాక ఆయన 'ఒసేయ్! కాళ్లు నొప్పులుపుడుతున్నయ్. వచ్చి వత్తు' అన్నాడు. (ఇట్లా పరాయి ఇంట్లో నలుగురుముందు ఆయన ఆ మాటలు అన్నాడంటే ఆశ్చర్యంగావుంది కదూ? నాకూ అంతే. అయితే జరిగిందిమాత్రం ఇంతే) అయితే మా బావ మాత్రం ఆయన్ని నాలుగు చివాట్లు పెట్టాడు. "చాలు చాలేవయ్యా! అంత కాళ్లు నొప్పయితే ఇంటికెళ్లు. అంతేగాని ఇంతమందిలో ఆ మాటలు అంటానికయినా సిగ్గుండాలి."

ఇటువంటి మగవాళ్ళు చాలామంది వున్నారు. వీళ్ళు తమ భార్యల్ని బానిసలుగా చూసేమాటా నిజమే. భార్యంటే ఏమాత్రం గౌరవం ఉండివున్నా ఆ పెద్దమనిషి నలుగురిలోనూ ఆ విధంగా అంటాడా? ఇటువంటి స్వభావంగల పురుషులు 'స్త్రీలను' 'ఇంట' హీనంగా చూడటమేగాకుండ, 'బయట' స్త్రీలను కూడా హీనంగా చూసి మాట్లాడతారు. 'చీడ పురుగులు' అంటే ఇటువంటివారు కాదా? ఇటువంటి కుత్సితపు స్వభావం గలవారు భార్యని అన్నివిధాల హీనంగా చూస్తారు. ఇంట్లో భార్య అభిప్రాయాలుగాని, సలహాలుగాని యే మాత్రము లెక్కచెయ్యరు. 'భార్య' అంటే ఒకవిధమైన బానిసగానే భావించి ప్రవర్తిస్తారు. ఇటువంటివారిని చూడబట్టే మొదట నేను వుదహరించిన నా స్నేహితురాలు వివాహిత జీవితమంటే అంత భయపడ్డదేమో!

అయితే సాగరగర్భంలో రాళ్ళూ-రప్పలు, నత్తగుల్లలు, మంచిముత్యాలు కూడా దాగివుంటాయి. అనంతమయిన ప్రకృతిలో సాధువుగా, క్రూరంగా వుండే జంతువులుకూడ జీవిస్తవి. ముళ్ళపొదలూ-మహావృక్షాలు కూడా పెరుగుతవి. అదేవిధంగా మానవుల్లో కూడ రకరకాలయిన ప్రకృతిగల వ్యక్తులూ వున్నారు.

'దుస్వభావం'గల పురుషుల్ని వదిలేద్దాం. మంచివారినే ఆదర్శంగా తీసుకుని నా స్నేహితురాలు యెందుకు మనస్సు మార్చుకో కూడదు?

పురుషుల్లోమాత్రం అన్నివిధాల సద్గుణాలువున్నవారు యెంతమందిలేరు! స్త్రీలను గౌరవించేవారు చాలామంది. స్త్రీలను బాధించేవారు కొద్దిమంది.

'స్త్రీ'లకు తగిన విద్య వుండాలి. స్త్రీలకు కూడ తగిన స్వేచ్ఛ ఇవ్వటంవల్ల నష్టమేమీ లేదు. భార్యాభర్తలిద్దరూ సమభాగస్వాములు'అనుకునేపురుషులు యెంతమందో!

వివాహిత జీవితం బానిసత్వం కాదు, బాధ్యతాయుతమైనది. ఇంటికి యజమాని భర్త. యజమానురాలు భార్య. డబ్బు సంపాదించి, కుటుంబపు మంచి-చెడులు చూస్తాడు యజమాని. ఆ ఇంటి ఇతరబాధ్యత అంతా నిర్వహించవలసిన బాధ్యత యజమానురాలిది. భార్యాభర్తలలో యేవొక్కరిదీ అధికారమూ కాదు, మరొకరిది బానిసత్వమూ కాదు. 'వంట' చేసినంతమాత్రాన స్త్రీ బాధ్యత తక్కువనిగాని, హీనమైనదనిగాని అనుకోవటం ఎంత పొరపాటు! సంసారంలో కొన్ని విషయాల్లో, కొన్ని సందర్భాలలో మగవాడిదే పైచెయ్యి కావచ్చు. మగవారిమాటే నెగ్గవచ్చు. అంతమాత్రాన స్త్రీలు బాధపడాల్సిన అవసరం యేమాత్రమూ లేదు. అటువంటి సందర్భాలలో మనమే వారి సలహాలను అనుసరిస్తే సరిపోతుంది.

స్త్రీలు మగవారి అండదండలతో నిలచి బ్రతకటం యేమాత్రమూ అవమానకరమైన విషయం కాదు. స్త్రీలు యెంత చదివినా, లేక వుద్యోగాలు చేస్తున్నా కొన్ని కట్టుబాట్లలో, కొన్ని హద్దుల్లో వుండటం మంచిది. అంతేగాని 'చదువుకున్నాం' కదా అనీ, 'ఉద్యోగం చేస్తున్నాం గదా' అని పురుషుడితో సమానంగా తిరగటానికి చూడటం ప్రస్తుతం వీలులేదు. (అంత విచ్చలవిడిగా తిరిగే ఆడపిల్లలు వుండరనుకోండి!) ఈ సందర్భంలో నాకు ఒక సంఘటన ఇప్పటికీ జ్ఞాపకంవస్తూనే వుంటుంది. మా లెక్చరర్ ఒకామె వుండేవారు. ఆమె 'సైకాలజీ'

## సరళ సలహా!

'ధనమూల మిదం జగత్'
అనూక్తికి మరోపేరుపరమసత్యం!!

అందుకేనేమో బహుశః వచ్చే మంచిగాని, చెడుగాని డబ్బుతో ముడి వేసుకు మరీ వుంటుంది.

'విష్ణురూపాయ, శివరూపాయ..' అని వినిపించే పావనమైన మంత్రం సైతం హరిహరులకు నిర్వచనం రూపాయే నని తేల్చివేసింది!!!

నిజానికి కలియుగంలో పైసాకన్న పరమాత్మ వేరే ఉందనుకోడం పొరబాటు. ఆ దైవం పట్ల మనం ప్రదర్శించే భక్తిశ్రద్ధలు ఈ పైసా యెడల చూపుతూనే-ఆ పవిత్ర మనోభావం కూడా దీని విషయంలో విడవకపోవడం అత్యావసరం.

త్యాగబుద్ధిలేనిధనం బంధనం.'సమార్జితవిత్తమునకు త్యాగమే రక్షణము' అంటుంది నీతిచంద్రిక. త్యాగమంటే దుబారా కాదు. పీనాసితనం అంతకన్న కాదు.

"ధనం మనం మనంధనం-ధనం లేక మనం లేదు" అని తెలుసుకోవాలి.

స్టడీ చేసిన వ్యక్తి. అందుచేత క్లాసులోవున్న ప్రతి పిల్లనీ ప్రత్యేకంగా 'ఇంటర్వ్యూ'కు పిలిచి ఆ అమ్మాయి మనస్తత్వాన్ని, పరిశీలించేది. అటువంటప్పుడు ఒకరోజు క్లాసులో లెక్చరిస్తూ, 'నేను ఇంటర్వ్యూ ఇచ్చి, మీరీ 'ట్రెయినింగ్' యెందుకు తీసుకుంటున్నారు? మీ లక్ష్యం యేమిటి?' అనిఅడిగితే క్లాసులో చాలామంది 'మా స్వంతకాళ్ళమీద మేము నిలబడటానికి అంటే పెళ్ళిచేసుకోకుండా ఉద్యోగం చేసి స్వతంత్రంగా బ్రతకటానికి అని సమాధానమిచ్చారు. పురుషుల అండదండలన నిలువబడి బ్రతకటం తప్పని వారి వుద్దేశం. అది చాలా తప్పు' అంటూ సమాధానమిచ్చారు.

నిజంగా ఆమె అన్న ఆ మాటలు నా హృదయంలో యేనాటికీ మరచిపోలేని నగ్న సత్యాలై నిలచాయి. యెందుచేతనంటే, నా అభిప్రాయమూ అదే కొబట్టి.

స్త్రీలకు పురుషుడితో సమాన హక్కులు కావాలి, రావాలి. కానీ, స్త్రీలకు యెటువంటిహక్కులు కావాలి? పురుషుడు సైకిల్ మీద తిరిగినట్లు, స్త్రీ కూడ ప్రొద్దూకులు బజార్లలో తిరిగే హక్కు కావాలా? భర్తకు ఇష్టం లేకపోయినా వుద్యోగం కోసం ప్రాకులాడే హక్కు కావాలా? పనిపాటలు చెయ్యకుండా, కుర్చీలోనే కూర్చోవాలి అనుకునే హక్కు కావాలా?

ఈ హక్కులన్నీ స్త్రీలకవసరం. సంసారానికి సంబంధించిన విషయాల్లోను, పిల్లల పెంపకంలోను స్త్రీలకు తగిన స్వాతంత్ర్యం వుండాలి. సంసారంలో భార్యకు భర్త తగిన గౌరవం ఇవ్వాలి. ఆమె వ్యక్తిత్వాన్ని గుర్తించి అభిమానించాలి. కొన్ని కుటుంబాల్లో భార్యతో సంప్రదించి చెయ్యాల్సిన పనులు కూడ, భర్త సంప్రదించకుండా తనకు తోచిన విధంగా చేస్తాడు. ఉదా:-అమ్మాయి పెళ్ళివిషయమే తీసుకోవచ్చు. లేక అబ్బాయి చదువు విషయమే తీసుకోవచ్చు. కొన్ని కుటుంబాల్లో పిల్లల పెంపకంలో కూడ స్త్రీకి భర్తకు సలహాలిచ్చే యోగ్యతలేదు. ఏ విషయంలోనన్నా భార్య భర్తకి సలహా నివ్వబూనితే 'నోర్మూసుకో' అనే అదిరింపు భర్తనుండి సమాధానంగా వస్తుంది. ఇక అమ్మాయి పెళ్ళివిషయంలో ఆ ఇల్లాలికి బొత్తిగా స్వతంత్రముండదు. అమ్మాయికి ఒక సంబంధం ఖాయం చేస్తాడు తండ్రి. ఆ అమ్మాయి ఇంకో అబ్బాయిని పెళ్లి చేసుకొంటానని పట్టుపడుతుంది. ఆ తల్లి కూతురు తరుపున మాట్లాడుతూ 'పోనీ అమ్మాయి ఇష్టప్రకారమే కానివ్వరాదుటండీ!' అంటుంది. ఆ తండ్రి ఆమె మాటలకు ఎగిరిపడ్డాడు. ఇట్లాగే యితర విషయాల్లోను జరుగుతోంది. అందుచేతే స్త్రీకి సంసారంలో తగిన వ్యక్తిత్వం లభించాలి.

పెళ్లికాని పిల్లలు సక్రమమైన పద్ధతిలో వగూడి పెన్నుకునేటంగుకు తగిన హక్కు లభించాలి. స్త్రీలకు జరుగుతున్న అత్యాచారాలు, అన్యాయాలు రూపుమాసిపోవాలి. స్త్రీపట్ల పురుషుడికిగల చిన్న చూపు పోయి, స్త్రీ కూడ తనతో సమానమైన జీవితపు విలువ గలదేనని పురుషులు గ్రహించాలి.

ఈ హక్కులు స్త్రీలకు లభించనప్పుడు స్త్రీలు తప్పక తమ హక్కులకోసం పోరాడవలసిందే. అప్పటికీ పురుషులు స్త్రీల వ్యక్తిత్వానికి గల గౌరవం ఇవ్వకపోతే, స్త్రీలు కోరుతున్న కనీసపు, సమంజసమైనహక్కుల్ని యివ్వకపోతే, స్త్రీలు యెదురు తిరిగి ఆ హక్కుల్ని పొందాలిసిందే. స్త్రీలు యెదురు తిరగనంతవరకే పురుషులు తమ అధికారాన్ని అతిగా చూపుతారు. అనేక సమస్యల్ని లేవదీస్తారు. స్త్రీలు కలగజేసుకుని, యెదురు తిరిగితే వారె మాత్రం నెగ్గ లేరు. 'కేరళలో కమ్యూనిజం ఓటమికి' స్త్రీల కృషి కారణం కాదా? అందుచేతే స్త్రీలు యెదురు తిరిగేటంతటి పరిస్థితులు తెచ్చుకోకుండా, పురుషులు స్త్రీల పరిస్థితుల్ని అర్థంచేసుకుని సహృదయంతో ప్రవర్తిస్తే, స్త్రీలు వారిని యెంతగా గౌరవిస్తారో వేరె చెప్పుకోవాలా?

'భార్యగా స్త్రీ బానిస యేనాటికీ గాదు.' ఆమె బాధ్యతాయుతమైన వ్యక్తి. సహనానికి ఆమె మారుపేరు. కుటుంబంలో ఆమెకు తగిన వ్యక్తిత్వం, అధికారం ఇవ్వకపోవటం తప్పకుండా మగవారి తప్పే. కుటుంబానికి సంబంధించిన విషయాల్లో భర్త భార్యసలహాలు తప్పకుండా తీసుకోవాలి. అనుసరణయమైతే ఆచరించవచ్చు. లేకపోతే వదిలెయ్యవచ్చు. ప్రమాదమేమీ లేదు. అంతేగాని, ఇటు ఇంటా, అటు బయటా కూడ ప్రపంచమంతాతమదేననీ, స్త్రీలు కేవలం ప్రపంచంలో పురుగులాంటివారని అనుకుని ప్రవర్తించే పురుషుల్ని యే అభూతశక్తయినా మారిస్తే యెంత బాగుండును!' ఈ సమాధానమే నేను నా స్నేహితురాళ్లకు యిచ్చాను. ★


కుటుంబంలోని
ప్రతి ఒక్కరికీ చాలా మంచిది



క్రిమిదోషాన్ని నివారించగల వేప నూనెతో ఇంపైన సుగంధంతో తయారు చేయబడిన మార్గో సబ్బు అతి లేత చర్మానికి కూడా వాడతగినది మార్గో సబ్బుకు విశేషంగా వచ్చే నురగ చర్మ రంధ్రాలలోనికి పోయి చర్మాన్ని అన్ని దోషాలనుంచి శుభ్రపరచగలదు. ఉత్పత్తి చేసేటప్పుడు ప్రతి ఘట్టంలోను పరీక్ష చేయబడిన మార్గో సబ్బు మిమ్ము మరింత పరిశుభ్రంగా, రోజంతా ఉత్సాహంగాను వుంచగలదు.



మార్గో సబ్బు

కుటుంబం మొత్తం వాడతగిన సబ్బు

ది కలకత్తా కెమికల్ కంపెనీ లిమిటెడ్, కలకత్తా-29.

CMC-14 TE

దక్షిణఇండియా ఆఫీసు 6/149 బ్రాడ్వే మద్రాసు-1.

# ఇప్పుడు

## మీకు ప్రియమైన ఆరోగ్యముచేకూర్చే

# విటమినులు కలిసిన

## వాటర్‌బరీస్ కాంపౌండ్

## తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులుతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.

దగ్గు, జలుబులకు క్రిసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



# వనితా వాణి



## విద్యార్థిని - గృహిణి

వనితాలోకం శీర్షికయందు (అనగా 30-11-60 పత్రికనందు) 'విద్యార్థిని-గృహిణి' అను వ్యాసము నన్ను బాగా ఆకర్షించినది. కాని వ్యాసమునందు ఒకచోట రచయిత్రి యగు సీతారామమ్మగారు ఒక విషయము వ్రాసినారు. అది అసందర్భముగా ఉన్నదని నా భావన. ఒకరోజున కోడలు 'ఈ పచ్చడి కూరు ఎట్లా తినను?' అన్నదట అత్తగారితో. ఇంకేముంది, ఆ అత్తగారు రెండు రోజులు బొత్తిగా కూడులేకుండా మాడ్చిందట కోడలును. ఈ విధముగా విగయ్యాళైన అత్తగారయినను కోడలు అన్న మాటకు కూడు లేకుండా మాడ్చుట అసంభవము. ఆ రచయిత్రిగారు ఒకవేళ వారి అత్తగారిని దృష్టిలో పెట్టుకొని వ్రాసివుందురు. కాని మన భారతదేశమున జన్మించిన ఏ అత్తగారయిననూ అట్లు సంచరించదు. మన హిందూ దేశము ఇంకా ఆ దౌర్భాగ్యదుస్థితికి రాలేదు, రాదు అని నా భావన. కాని మొత్తంమీద వారు వ్రాసిన వ్యాసము చాలా బాగున్నది. ఇటువంటి ఉత్తమమయిన వ్యాసములతో పత్రిక ఇంకా తారస్థాయిని అందుకొనుననుట అతిశయోక్తి కాదు.

కె. అంజమ్మ (తిరువూరు)

* * *

విద్యార్థిని-గృహిణి అను వ్యాసము చాల బాగుందని చెప్పడానికి సంతసించుచున్నాను. ఇలాగే సోదరీమణులు ఇటువంటి వ్యాసములు వ్రాసి స్త్రీలకు తోడ్పడతారని ఆశిస్తున్నాను. ఈ వ్యాసం వ్రాసిన సీతారామమ్మ గారికి మీ పత్రికద్వారా నా హృదయపూర్వక అభివందనాలు తెల్పుచున్నాను.

కె. సీత (ఒంగోలు)

* * *

సీతారామమ్మగారన్నట్టు, విద్యార్థి దశలోనే స్వేచ్ఛాజీవితం గలదు. స్త్రీకి గార్హస్థ్యంలో అడుగిడిన కొత్తలోనే సాధకబాధకాలు తెలియును. కాని స్త్రీ వివాహమైన పిదప కాలేజీ జీవితపు చదువు, నాగరికమునకు తిలాంజలినిచ్చి అత్తగారి ఇంటిలో సమయానుకూలముగా వర్తిస్తే ఏ పొరపొచ్చాలు రావు. అందుకే కాబోలు పుట్టింటికి అత్తారింటికి కీర్తిని తెమ్మని ఆశీర్వదిస్తారు పెద్దలు. కాని ఈ అధునాతనయుగమందు అత్తగారిని కేర్ చేయక ప్రవర్తించేవారు అధికం. ఎందుకంటారా, ఉన్నత విద్యల ప్రభావము. ఈ చక్కని వ్యాసం రాసిన సీతారామమ్మగారికి నా అభివందనాలు.

నండూరి సుధామణి (అనంతపురం)

సీతారామమ్మగారు వ్రాసిన 'విద్యార్థిని-గృహిణి' అను వ్యాసము చాలా బాగున్నది. అత్తలు కోడండ్లను అనటం సహజమే ననుకోండి. కాని అత్తింటి కోడళ్లు 7 నిద్ర లేవటం తప్పే కదా. కోడళ్లు అత్తవారింట్లో మాట పడకుండా వుండాలంటే ఆమె తలిదండ్రులు చదువుతోపాటు పనీ పాట కూడా నేర్పి పంపాలి. ఇక అన్నీ చేతనయిన కోడళ్ళనే అంటున్నారంటే, వారి భర్తలు వారికి అలుసే కారణం. "ముగుడు ముండా అంటే ముష్టికొచ్చినవాడు కూడా ముండా అంటాడట" అలాగే భర్త గౌరవంగా చూస్తే ఎదుటివారు కూడా ఆమెను గౌరవిస్తారు. ఈ మధ్య వనితాలోకంలో వ్రాస్తున్న వ్యాసములన్నింటిలోను సీతారామమ్మగారి వ్యాసము సహజముగా నున్నది. వారికి నా హృదయపూర్వక అభివందనములు.

ముండాది రుక్మిణి (కర్నూలు)

* * *

ఈ వారము మీ పత్రిక చాలా బాగుంది. వనితాలోకంలో ప్రచురింపబడిన "విద్యార్థిని - గృహిణి" అన్న వ్యాసము నాకెంతో నచ్చింది. మీ పత్రికకు సొబగులు కూర్చేంత ధైర్యము నాలో లేనందుకు ఒకందుకు విచారిస్తున్నా, మీ పత్రికలో నుండే రసాన్ని ఆనందంగా ఆస్వాదిస్తున్నందుకు ఇంకొకందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. మీ సంపాదకత్వము ఒకవైపు, శంకర్ (బాపు



చోళీ డిజైన

చిత్రకారిణి: ఎమ్. సుశీల (తిక్కవరం)

గారు ఇపుడు చిత్రములు వెయ్యడము లేదను కుంటున్నా) గారి ఆకర్షణీయమైన చిత్రాలు ఒకవైపు మమ్మల్నెంతో ఆనందపరుస్తున్నాయి. ప్రతివారము పత్రిక చదువవలెననే ఒక గాఢమైన కోరిక ప్రగాఢంగా మా మనస్సులలో వేళ్లు తన్నుకపోయింది. మీరు

# వనితావాణి

శంకర్ గారి "ఎప్పుడూ ఇంతే" చిత్రాలు వనితాలోకం శీర్షికనుండి తీసి వేయమని చెవిన ఇల్లు కట్టుకొని పోరాడుతున్నా మీరు వినకుండా ఉండడము చాలా శోచనీయమైన విషయం.

డి. నర్సమ్మ (పెద్దదిన్నె)

*　　*　　*

విద్యార్థిని - గృహిణి వ్యాసములో సీతా


30 ఏళ్లనుంచి డాల్డా శ్రేష్ఠతను మెచ్చినవారు వేనకువేలు

మీకుటుంబము ఎందుకు వెనుక బడాలి ?









డాల్డా శుద్ధమైనది. అది అతి శుద్ధమైన కాయగూరల మానెలనుంచి తయారు చేయబడినది. డాల్డా పుష్టికరమైనది! అది ఆరోగ్యము కోసం విటమిన్‌లు చేర్చబడి నట్టిది.

డాల్డాతో వండిన కూరలు, వేపుళ్లు, పోపు వేసిన పచ్చళ్లు చాలా రుచి కరంగా నుండును. వేనకు వేలు గృహిణులు తమ వంటలన్నిటికీ డాల్డాను ఎన్నుకొంటున్నారు, ఆశ్చర్యం కాదు. మీ కుటుంబమునకు కూడా అట్టి దివ్యమైనది అక్కర్లేదా ?

డాల్డా వనస్పతి

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

DL-34-X52TE

# స్వాదు - పాకం

## కా జా లు

కావలసిన వస్తువులు :— ½ వీశ మైదా పిండి, ½ వీశ పంచదార, ½ వీశ నెయ్యి లేక డాల్డా, చిటికెడు సోడా ఉప్పు, చిటికెడు మామూలు ఉప్పు.

మైదా పిండిని శుభ్రంగా జల్లించి, అందులో చిటికెడు సోడా ఉప్పు, చిటికెడు మామూలు ఉప్పు వేసి, పూరీలపిండివలె కలిపి, రెండు గంటలు నానబెట్టాలి. పిండి మెత్తగా నానిన పిమ్మట కొంచెం పెద్ద ఉండలు చేసి పూరీల పీట మీద కొద్దిగా మందంగా ఒత్తాలి. ఒత్తిన పూరీలకు పేరు నెయ్యి రాచి పూరీని మడతలు మడతలుగా చుట్టాలి. అంటే మొదట పూరీని సగానికి, తరువాత దానిని సగానికి చుట్టాలి. ప్రతి మడతకి నెయ్యి రాస్తుండాలి. మనకు కావలసిన సైజులో మడతలుగా పూరీని చుట్టుకోవాలి. ఈ చుట్టిన పూరీలను అంగుళంపొడుగు ముక్కలుగా చాకుతో కోసుకోవాలి. ఈ విధంగా పూరీల నన్నింటిని చుట్టి, ముక్కలుగా కోసిపెట్టుకోవాలి. మూతి వెడల్పు గిన్నె కుంపటిపై ఉంచి, ఆ గిన్నెలో ½ వీశ పంచదార, ½ గిద్ద నీళ్లు పొయ్యాలి. కొంచెంసేపటికి పాకం తుకతుకమని ఉడుకుతుంది. పాకం తీగ పాకం రావాలి. అంటే చేతో పట్టుకు చూస్తే తీగ నిలబడాలి. తరువాత ఈ గిన్నెను కుంపటి మీదే సన్నని సెగపై ఉంచాలి.

తర్వాత పొయ్యిమీద బాణలి (బూరెల మూకుడు) ఉంచి. నెయి లేక డాల్డా పోసి,

కాజ వెంకటకమల

బాగా కాగిన తర్వాత ముందుగా కోసుకుని ఉంచుకున్న పూరీ ముక్కలను కొన్నింటిని, నెయ్యిలో వేసి, దోరగా వేయించుకోవాలి. వేయించిన ఈ ముక్కలను పంచదార పాకంలో వెయ్యాలి. మళ్ళీ బాణలిలో ఈ పూరీ పిండి ముక్కలనువేసి, దోరగా వేగాక, ముందుగా పాకంలో వేసిన కాజాలను తీసి వేరుగా పెట్టుకొని, మళ్లీ వేయించినముక్కలను పాకంలో వేయాలి. ఈ విధంగా పూరీ ముక్కలన్నింటిని వేయించి పాకంలో వేసుకోవాలి. ఏ వాయికి ఆవాయి పాకంలో వేసిన కాజాలను వేరుగా తీసి పెట్టుకోవాలి. అన్నింటిని ఒకేసారిపాకంలో వేస్తే కాజాలు సరిగా రాక ముక్కలుగా విరిగిపోతాయి. సోడాఉప్పుకలపటంవలన ముక్కలువేయించేటప్పుడు గుల్లబారి, పాకం బాగా పీల్చుకుంటాయి. చివరిలో పాకం మిగిలిపోతే వృధా చెయ్యకుండా కాజాల మీద పోసుకోవచ్చును. కాజాలు తినుటకు చాల రుచిగా ఉంటాయి. డాల్డా కంటె నేతితో చేసుకుంటే కమ్మగా ఉంటాయి. వారంరోజులు నిలవ ఉంటాయి.

## చంద్రకాంతలు

చంద్రకాంతలు పెసరపప్పుతో గాని, సెనగపప్పుతో గాని చేసుకోవచ్చును. పెసరపప్పుతో చేస్తే గుల్లవిచ్చి, కరకరలాడుతూ ఉంటాయి. సెనగపప్పుతో అయితే కొంచెం గట్టిగా ఉంటాయి.

కావలసిన సామానులు :—1 శేరు పెసరపప్పు, చెటాకు బియ్యం, శేరుంపావు పంచదార, ఒక కొబ్బరికాయ, అరతులం యాలకులు.

పెసరపప్పు, బియ్యం బాగు చేసుకుని, పొద్దున్న చంద్రకాంతలు చేసుకుంటామనగా రాత్రే బియ్యం, పెసరపప్పు నానపొయ్యాలి. పొద్దున్నే దాన్ని శుభ్రంగా కడిగి రోటిలో వేసి మరీ మెత్తగా కాకుండా, అలాగని బద్దలు బద్దలుగా కాకుండా సమంగా, గట్టిగా రుబ్బుకోవాలి. యాలకులు గుండకొట్టి వుంచాలి. కొబ్బరికాయ కోరి, నెయ్యివేసి వేయించాలి. పంచదారను సన్నటి సెగ మీద తీగపాకం పట్టి అందులో రుబ్బి ఉంచిన పిండి, యాలకుల గుండ, వేయించిన కొబ్బరికాయ వేసి, కలియబెట్టి, కొంచెం గట్టిపడగానే, దాన్ని తడిబట్టమీద పరచి మనకు కావలసిన ఆకారంలో ముక్కలు కోసుకోవాలి. ఈ ముక్కలను నేతిలో కొంచెం ఎరుపురంగు వచ్చేవరకు వేయించుకోవాలి. ఇవి వారం రోజులు నిలవ ఉంటాయి.

## 'సగ్గుబియ్యం జంతికలు'

కావలసిన వస్తువులు :—సగ్గుబియ్యం 1పావు శేరు, గట్టి పెరుగు 1 శేరు, బియ్యంపిండి 1 శేరు, కారంపొడి I టేబుల్ స్పూను ఉప్పు తగినంత.

జంతికలు చేయుటకు రెండుగంటల ముందు సగ్గుబియ్యం ఒక పాత్రలో వేసి, పెరుగుపోసి నానబెట్టాలి. నానిన తరువాత బియ్యంపిండి, కారం, ఉప్పువేసి బాగా కలపాలి. బాణలి పొయ్యిమీదపెట్టి, నెయ్యిపోసి, బాగా కాగిన తర్వాత కలిపిన పిండి జంతికల గొట్టములో ఉం , పిండవలయును. దోర గ కాగిన తర్వాత జంతికలను నేతిలోనుండి తియ్యాలి.



---

రామమ్మగారు విద్యార్థినుల అగచాట్లను చాల చక్కగా వర్ణించారు. అసలు అత్త అనే హోదా వచ్చేటప్పటికి ప్రతిగృహిణి సహజంగామారి కోడలిపై అధికార, ద్వేషాలను పెంచుకుంటుంది...ఐనా మన బంగారం మంచిదైతే అన్నట్లు చాలమంది విద్యార్థినులకు గార్హస్థ్య జీవితం తప్పదు. కాబట్టి ప్రతివారు విద్యతోపాటు వనిపాటలు, ఇల్లు చక్క దిద్దుకోవటము నేర్చుకొని అత్తలతో సాధ్యమైనంతవరకు అనుకూలంగాపోతే కుటుంబకలహములు కొంతవరకైనా తీరగలవు. రచయిత్రిగారికి ప్రత్యేకాముఖంగా అభివందనాలు అందచేస్తున్నాను.

టి. దేవకీదేవి (ధూళిపూడి)

* * *

30_11_60 సంచికలో వనితాలోకం శీర్షికలో ప్రచురించిన 'విద్యార్థిని, గృహిణి' శీర్షిక ఏమీ బాగులేదు. రచయిత సీతారామమ్మగారు ఒక విషయంగూర్చి వ్రాయబోయి వేరొకవిషయంలోకి వెళ్ళారు. అదీ కాక అందరూ 'అత్తగార్ల'పై దండెత్తారేమిటి! 'అత్తగార్లు – ఆడబడుచులు' తప్ప వీరికింకేమీ వ్రాయడానికి కనిపించటం లేదా?

కుమారి పెద్దాడ రుక్మిణి
(సిర్పూర్ - కాగజ్ నగర్)

* * *

23_11-60 పత్రికలో "మార్పులేని వ్యాసాలు" అని అన్నపూర్ణగారు వ్రాసిన విషయము చాలా బాగున్నది. ఆమె వ్రాసినట్లు ఈ మధ్య వ్యాసములన్నియు ఒకే పద్ధతిగాయుండి చదువుటకు విసుగు కల్గించుచున్నవి. ఇకమీదనైనా సోదరీమణులు వ్యాసములు క్రొత్తపద్ధతిలో వ్రాస్తారని తలుస్తాను.

అదే పత్రికలో జె. సరోజానాగరాజ్ గారు వ్రాసినట్లు"సాంఘిక విషయములు కూడ" వనితాలోకములో వ్రాస్తే బాగుండును.

"గృహవైద్యము" అనే శీర్షికను ప్రచురించుట మానివేసినారు. అది చాలా ముఖ్య విషయము కనుక దానిని మళ్ళీ ప్రచురించిన బాగుండును.

ఆర్. సావిత్రీదేవి (రాజమండ్రి.)

అనేకవందలసంవత్సరాల క్రితం రాజపుత్రస్థానంలో, ఒక వూరిలో ఒక దొంగలముఠా ఉంటుండేది. దానివల్ల రాజ్యంలో శాంతిభద్రతలకు చాల భంగం కలుగుతుండేది. ఆ ముఠాపేరుచెపితే ప్రజలు సరిగా నిద్రపోయేవారు కాదు. ఆకలిదప్పులు కూడ మరచిపోయేవారు. ఆముఠాలో అందరికంటె తెలివైనవాడు కాలచూరి. కాలచూరి, స్త్రీలకు తెలీకుండా కళ్ళకాటుక అతి తేలిగ్గా తీసెయ్యగలడనే ప్రతీతి. కాని ఆముఠాలో అతని ప్రతిభను పొగడిన వారెవరూ లేరు.

ఒకరోజు కాలచూరి "ఈ ముఠాలోనివాళ్ళు నాశక్తిని గ్రహించుట లేదు. ఎలాగైనా సరే ముఠాల్నుంచి బైటకువచ్చి నాప్రతిభను ప్రదర్శించాలి" అని అనుకొన్నాడు. అనుకొన్న ప్రకారం మర్నాడు రాజధాని నగరమైన కనోజికి ప్రయాణమయ్యాడు. ఆకాలంలో కనోజి రాజధానిగా చంద్రరాజు రాజపుత్రస్థానాన్ని పరిపాలిస్తుండేవాడు.

రాజధాని నగర మంతా తిరిగిన కాలచూరి, ఎక్కడెక్కడ ఏముందో వివరంగా తెలుసుకొని, చంద్రరాజు కోటలోంచి దొంగతనం ప్రారంభించాలనుకొన్నాడు. కాని కోట చాలపెద్దది. చుట్టూరా పెద్ద ప్రహరీగోడ, దానికి రక్షకభటులు కాపలా కాస్తున్నారు. అదీగాక రాజుకి పెద్ద సైన్యం కూడ వుంది. పట్టుబడకుండా లోనికి ప్రవేశించడం చాల కష్టం. రాత్రింబవళ్ళు కాలాన్ని సూచించటానికి కోటలో ఉన్న పెద్దగంట, గంటలు కొడుతోంది. ఆశబ్దం వినే సరికి కాలచూరికి మెఱుపులాంటి ఆలోచన తట్టింది.

కాలచూరి పెద్దపెద్ద ఇనుప మేకులు కొన్ని సంపాదించాడు. రాత్రి పన్నెండుగంటలకాలం సమీపించింది. అతడు ప్రహరీగోడ సమీపించాడు. గంటలు కొట్ట నారంభించాయి. ప్రతీగంట శబ్దంలోనూ కలసిపోయేలా ఒకోమేకును ప్రహరీగోడకు నాట నారంభించాడు. ఆ

'విజయ'

విధంగా మేకులు నాటినశబ్దం ఇతరులకు తెలీకుండా, పన్నెండు మేకులు పన్నెండుగంటల శబ్దంలో అతినిపుణతతో నాటాడు. వాటి సహాయంతో కోటలో ప్రవేశించి, చంద్రరాజు ధనాగారంలోని విలువైన నగలన్నింటిని దొంగిలించి యథాప్రకారం బయటకువచ్చేశాడు.

దొంగతనాన్ని పరిశీలించిన మంత్రులు, మర్నాడు, దర్బారులో చంద్రరాజుకు తెలియజేసారు. రాజు



కోపంతోపాటు ఆశ్చర్యంకూడచెంది మరో ఏభై మంది సైనికులను కనోజి నగరంలో రాత్రులందు గస్తీ తిరుగుటకు అదనంగా నియమించాడు. దొంగనుపట్టి తెచ్చినవారికి ఒక జాగీరు భరణ మిచ్చెదనని ప్రకటించాడు. మారువేషంలో దర్బారులోనే ఉన్న కాలచూరి ఏభైమంది సైనికుల్ని గుర్తుపెట్టుకొని, ఇంటికి తిరిగివచ్చాడు. వెంటనే అతడు సాముద్రికుని వేషంలో ఒక్కొక్క సైనికుడి భార్య అరచేతినిచూసి "ఈ రాత్రి మీకు చాల శుభమైనది. దొంగ మీ ఇంటికివచ్చి మీ భర్త కంఠంతో పిలుస్తాడు. నూనెమరగించి వుంచుకొని, పిలవగానే దిమ్మరించినట్టయితే, వళ్లు కాలటంమూలంగా ఎక్కడికీ పారిపోలేడు. అపుడు ఆ దొంగనుపట్టి రాజుగారికి ఇస్తే బహుమతి మీకే వస్తుంది. జాగ్రత్త! దొంగ చాల నేర్పరి. మీ భర్త వేషంలోనే భర్తకంఠంతోనే పిలవగలడు" అని ఒకరికి తెలీకుండా మరొకరికి సాముద్రికంచెప్పి వెళ్లిపోయాడు. ప్రతి భార్య తన భర్తయే దొంగను పట్టి బహుమతి పొందవలెనను ఆతృతతో ఉండుటచే కాలచూరి చెప్పినదంతా పూర్తిగా నమ్మారు.

తొలికోడి కూసింది. రాత్రంతా కావలాకాసి, దొంగ ఎక్కడా కనపడకపోగా, విసుగెత్తిన సైనికులు ఇంటిముఖంపట్టారు. తలుపుతట్టిన చప్పుడయింది. తలుపు తెరుచుకొంది. మరుగుతున్న నూనె వారి



మీద దిమ్మరించారు, భార్యలు. తెల్లవారి చూస్తే ఏ ముంది? గాయ పడినవారు తమభర్తలే.

మర్నాడు దర్బారులో చంద్ర రాజు ఈ వార్త విని చాల విచారించాడు. ఈసారి రాజు తన సైన్యాధిపతిని దొంగను పట్టుకొనుటకు నియమించాడు. ఆరాత్రి సైన్యాధికారి ఉత్సాహంగా నగరం నలుమూలలా తిరుగుతున్నాడు. ఒకసందు మలుపు తిరిగేసరికి అతనికో సుందరమైన యువతి ఎదురైంది. ఆమెనుచూసి, సైన్యాధికారి "నీవెవరవు?" అని ప్రశ్నించాడు.

"నేను దొంగను" అని ఆమె సమాధానం చెప్పింది.

ఆయువతి తనతో పరాచిక మాడుతున్నదని తలచి "ఇది వేళాకోళానికి సమయం కాదు. నీవే దొంగవైనచో నిన్ను బంధించవలసి ఉంటుంది." అన్నాడు. సైన్యాధికారి అధికార గర్వంతో.

"నేను నిజంగా దొంగనే" అందామె.

"అయితే నాతో పద" అన్నాడు సైన్యాధికారి.

ఆమెముందు, సైన్యాధికారి వెనుక నడుస్తున్నారు. కొంతదూరం నడిచాక అతడు ఆగమన్నాడు. ఆసమీపంలోనే ఉన్న సంకెళ్ళ బండదగ్గరకు ఆమెను తీసుకెళ్లాడు. వాటిని ఆమె ఆశ్చర్యంగా చూచి "ఇవి ఏమిటి?" అని ప్రశ్నించింది.

"వీటిలోనే దొంగల్ని బంధిస్తారు" అని సమాధానం చెప్పాడు.

"ఏలాగ?" — ప్రశ్నించిందామె.

"నేను బంధించే విధానం చూపించేలోపులో నీవు పారిపోవచ్చు." అని అనుమానం వెలిబుచ్చాడు సైన్యాధికారి.

"నీవు అడగకుండ, నాఅంతట నేనే నీకు పట్టుబడ్డప్పుడు పారిపోగలనని ఎలా అనుమానిస్తున్నావు?" అందామె.

అతని అనుమానం తీరింది. తాళాలు తెరచి, బండను ఉపయోగించే విధానం చెప్పడానికి సైన్యాధికారి దాంట్లో తనకాళ్ళు, చేతులు పెట్టాడు. వెంటనే ఆమె తాళాలు వేసేసింది. ఇపుడు సైన్యాధికారి బంధింపబడ్డాడు. ఆమె తన మారు వేషం తొలగించింది. ఇంకేముంది— కాలచూరి! ..."నన్ను పట్టడానికి ప్రయత్నించిన వారికి అవమానం తప్పదు." అని హెచ్చరించి నిశ్చింతగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు కాలచూరి.

దర్బారులో ఈ వార్త విన్న రాజుకి ఆశ్చర్యంతోపాటు, కోపం కూడ రెట్టింపయిపోయింది. ఎలాగైనా సరే దొంగను బంధించాలని రాజు పట్టుదల. అంచేత ఆ రోజు రాత్రి తనే స్వయంగా బయలుదేరాలని నిశ్చయించుకొన్నాడు, చంద్ర రాజు. మారువేషంలో దర్బారులో ఉన్న కాలచూరి ఇదంతా తెలుసుకొన్నాడు.

ఆ రాత్రి కాలచూరి సాధు రూపం ధరించాడు. ఊరిచివర చెట్టుకింద హోమకుండం తయారుచేసి, బావిముందు కూర్చొని ధ్యాన నిమగ్నుడయాడు. ఊరంతా గుఱ్ఱం మీద సంచారంచేస్తున్న చంద్ర రాజు రెండుసార్లు సాధుని పరిశీలించాడు. ఆతడు తపస్సులో నిమగ్నుడై ఉన్నాడు. మూడోసారి సాధుని సమీపించినపుడు అతనిదగ్గరకు వచ్చి "ఇటువైపు ఎవరైనా వెళ్లడంచూచారా?" అనిఅడిగాడు అతని నిమగ్నతను పరీక్షించేందుకుగాను.

"నేనింతవరకు తపసులో ఉండుటచే ఎవరువెళ్లిందీ, లేందీ చూడ

లేదు. కావలిస్తే మీరే ఇక్కడ కూర్చొని చూడవచ్చు. నేనిపుడు స్నానం చేయుటకు నదికివెళ్తున్నానని" చెప్పి సాధు సిద్ధమయ్యాడు. ఈ మాటలు విన్న రాజుకి ఓ ఆలోచన తట్టింది. తను సాధు రూపంలో అక్కడ కూర్చుని, సాధు తన రూపంలో నగరమంతా తిరిగితే, దొంగ అటువైపురావచ్చు. అపుడు దొంగను సునాయాసంగ బంధించవచ్చునని తలచి సాధు ధరించినబట్టలు తనకిమ్మని రాజు అడిగాడు. కాని అందుకు సాధు అంగీకరించలేదు. తనతపోసాధనకు భంగం కలుగుతుందని జవాబు చెప్పాడు. అప్పుడు రాజు "స్వామీ, తపోసాధనవలన మీకొక్కరికే క్షేమం కలుగవచ్చు. కాని నేను చేసే పని నగరవాసులకందరికీ శాంతి భద్రతలు కలుగజేయును. అందుచేత దయవుంచి మీ దుస్తులు నాకిచ్చి, నా దుస్తులు మీరు ధరించి, నగరమంతా సంచారం చేయండి" అని వేడుకొన్నాడు! అందుకు సాధు అతికష్టంతో అంగీకరించాడు. ఒకరిదుస్తులు మరొకరు మార్చుకొన్నారు. కాలచూరి రాజు గుఱ్ఱం మీద, రాజు వేషంలో బయద్దేరాడు. రాజభవనం చేరుకొని, రాజు పడకగదిలో హాయిగా నిద్రించాడు. రాజు ఊరిచివర చెట్టుకింద తెల్లవారు ఝామున నాలుగు గంటల వరకు మంచులో, నిద్రలేకుండా పడిగాపులు పడి కూర్చున్నాడు. దొంగరాలేదు. రాజుదుస్తుల్లో వెళ్ళిన సాధూ తిరిగి రాలేదు. విసుగెత్తిన రాజు కోటకు బయద్దేరాడు నడచుకొంటూ. కోట గుమ్మం దగ్గర కావలాదార్లు సాధు వేషంలో ఉన్న రాజును బంధించి తెల్లవార్లూ చెఱసాలలో ఉంచారు.



రాజు ఎంత అరచినా, అతని అరుపు లెవ్వరూ వినిపించుకోలేదు.

ఉదయం పగటికాంతిలో చంద్రరాజు ముఖాన్ని గుర్తించిన జైలు కావలాదారు నిలువునా నీరైపోయాడు. గడగడ వణకిపోతూ రాజుకాళ్ళమీదపడి, క్షమాపణ వేడుకొని రాజుగార్ని వదలి పెట్టేశాడు. రాత్రి జరిగిన సంగతంతా రాజు మూలంగ మంత్రులంతా విని, పడకగదిలో చూశారు. ఎవరూ లేరు! గుఱ్ఱాలశాలలో రాజుగారి గుఱ్ఱం కూడ కనుపించలేదు.

చంద్రరాజుకి జరిగిన పరాభవానికి ఆ రోజు దర్బారంతా విస్తుపోయింది. అందరూ విచారంలో మునిగిపోయారు. అందరి ముఖాల్లోను ఆందోళన కనిపిస్తోంది. కాని ఎవరూ నోరెత్తి మాట్లాడలేకపోతున్నారు. నిశిరాత్రిలోని నిశ్శబ్దం ఆవరించింది.

దర్బారును ఆ నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తూ చంద్రరాజు "దొంగ తనంతట తానే పట్టుబడితే, అతనిని క్షమించడమే కాకుండా, అతని తెలివికి తగ్గ బహుమతికూడా ఇవ్వబడును!" అని ప్రకటించాడు. దర్బారులో సాధు వేషంలో ఉన్న కాలచూరి, ఆ మాటలు విన్న వెంటనే ముందుకు వచ్చి తనేదొంగని తెలియపరిచాడు. రాజుగారి ధనాగారంలో దొంగిలించిన నగలు, సైన్యాధికారిని బంధించిన తాళంచేతులు, రాజుగారి గుఱ్ఱం దుస్తులు అందుకు సాక్ష్యాలు. దర్బారులోని వారందరూ ఆశ్చర్యచకితులయ్యారు. కొన్ని నిముషాల ముందున్న నిశ్శబ్దమంతా తారుమారయింది. అలజడి! దర్బారంతా అలజడి! కొందరు దొంగ శిక్షింపబడునని తలచారు. ఇతరులు దర్బారులో ప్రవేశించ గలిగినందుకు తమపై నేరము మోపెదరేమోనని రక్షకభటులు భయపడ్డారు. కాని అవేమి జరుగలేదు. చంద్రరాజు కాలచూరిని హృదయపూర్వకంగా అభినందించాడు. అతని ధైర్యసాహసాలకు, తెలివికి మెచ్చుకొని నాలుగు గ్రామాలు బహూకరించాడు.

అంతటితో ప్రజలలో భయాందోళనలు పోయి నిర్మలత, ప్రశాంతత వ్యాపించింది. కాలచూరి నాలుగుగ్రామాలకు అధికారి. ఈ వార్త విన్న అతని ముఠాలోని వారందరూ కాలక్రమేణ అతనిదగ్గరకు జేరుకొన్నారు. కాలచూరి నాయకత్వంలో వారందరూ దొంగతనం వదిలి, వ్యవసాయం, గ్రామరక్షణ మొదలైన వృత్తులను చేపట్టి, దేశాభ్యుదయానికితోడ్పడుతూ హాయిగా కాలం గడిపారు. రాజపుత్రస్థానానికి దొంగలముఠా పీడ వదలిపోయింది. ★

## నవోదయము

చిట్టిప్రోలు కృష్ణమూర్తి

వెలుఁగురేకలఁ గబళించి విశ్వజగతి
గలఁతవెట్టఁ దమిస్రంబు కడఁగుఁ గాని
బయలుపడవొక్కొ! దాని గర్భము చీల్చి
వెలుఁగురేకలు క్రొంగ్రొత్తపొలుపు తోడ

సప్తవారాసులందలి జలముఁ బీల్చి
పుడమి సుడికింప గ్రీష్మంబు పూనుఁ గాని
దాని నంతంబు గావించి తరలి రావొ!
సలిలధారలు క్రొంగ్రొత్త చవుల తోడ

గాను పిలిచి డాక్టరు దగ్గరికి వెళ్ళి రమ్మంటే వాడు వెళ్ళనని మొండికేశాడు. హేమ ఎంత బతిమాలినా వాడు సనేమిరా వినలేదు. ఇంట్లోవాళ్ళు మామూలుగా కాంతారావును అలుసుగా చూడటం గమనించి వాడూ అలాగే చూడటం నేర్చుకున్నాడు. వాడికి కాంతారావు పట్ల మంచి అభిప్రాయంగాని, గౌరవంగాని లేవు.

హేమ వాణ్ని అలా బతిమాలుతుంటే రత్నమ్మ అక్కడికివచ్చి అంది: "ఈమాత్రానికే ఆసుపత్రికి మనుషుల్ని తరమాలిటమ్మా, నీ యిల్లు బంగారంగానూ! ఎంతగా ఆసుపత్రివాళ్లు మనకోసం మందులు పెట్టుకూర్చున్నా ఇంత చోద్యమటమ్మా మరీను! మా చిన్నప్పుడివన్నీ ఎరుగుదుమా? ఎన్ని రోజులు మంచంలో పడ్డా అలాగే ఏకధాటిని లంఖణం వేయించేవాళ్లు మావాళ్లు—"

"ఏడిచావులే" అని స్వగతం చెప్పుకుంది హేమ. "ఇప్పుడదంతా నువ్వు ఏకరూపెట్టక్కర్లేదు లేవమ్మా!" అంది ప్రకాశంగా, కోపం పట్టలేక. ఎదుటి మనుషు లెటువంటివాళ్లైనా కోపంవస్తే అణుచుకోలేదు హేమ.

మళ్లీ మందు ప్రసక్తి పెట్టుకోలేదు. ఆ సాయంత్రం టెంపరేచరు నార్మలుకు వచ్చాక కాంతారావు మెల్లగా మేడ దిగివచ్చి రిక్షాలో ఆసుపత్రికి వెళ్లి మందు తెచ్చుకోవటం చూసిన హేమ మనస్సు విలవిల లాడింది.

# మనసు లూ మనసు లూ

(11-వ పేజీ తరువాయి)

రోజూ పొద్దున టెంపరేచరు ఎక్కువై సాయంత్రం నార్మలుకు వస్తోంది. అలా వచ్చిన జ్వరం నాలుగైదు రోజులకుగాని పూర్తిగా తగ్గలేదు. వారం రోజులకుగాని నీరసంపోయి కోలుకోలేదు కాంతారావు.

ఈ వారం రోజులూ అతడు యూనివర్సిటీకి రాని కారణం తెలీక తికమక పడింది అనూరాధ. ఏమైనా సుస్తీగావుంటే సెలవుకోసం ప్రొఫెసరుకు రాయాలిగదా! ప్రొఫెసరు నడిగితే తన కేమీ తెలీదన్నాడు. జ్వరం వచ్చిన వారం రోజులూ—సెలవుకోసం ఓ కాయితం రాసి పడేద్దామనైనా తోచనేలేదు కాంతారావుకు.

బహుశా అత డారోజు జరిగినదాన్ని మనసులో వుంచుకుని బాధ పడుతున్నాడేమో! అనుకుంది అనూరాధ...కావచ్చు. సున్నితమైన హృదయం కావటంవల్ల, అతడు ప్రతిచిన్నవిషయాన్నీ కొండంత చేసుకుని అనవసరంగా బాధపడుతుంటాడు.

ఈ ఊహాగానమంతా దేనికి? ఒకసారి వాళ్లింటికి వెళ్తేస్తే ఏసంగతీ తేలిపోతుంది అని నిశ్చయించుకుంది చివరకు.

ఆ సాయంత్రం అనూరాధ వెళ్లగానే గుమ్మంలో హేమ ఎదురయింది. హేమ చిరునవ్వుతో ఆప్యాయంగా పలకరించింది. ఇద్దరూ కాసేపుమాటల్లో పడ్డారు. హేమ కాంతారావుకు సుస్తీచేసిన సంగతి చెప్పి, మేడమీద వున్నాడని చెప్పింది.

"ఇరవై రోజుల్నుంచీ బొత్తుగా నల్లపూసవై పోయావు. నాకోసం కాకపోయినా పోనీ మా మేష్టారుకోసమైనా రాకూడదా?" అంది హేమనవ్వుతూ. ఆమధ్య కాంతారావు అనూరాధకు ట్యూషను చెబుతుండటం గురించి తెలిసివున్నందువల్ల అలా అంది హేమ.

"సుస్తీ అని నాకేం తెలుసు హేమా? ఆ అసామి సపుమనిషి లీవుకేనా అప్లయిచేస్తేనా?" అంది అనూరాధ.

మరి ఎక్కువసేపక్కడ కూచోకుండా మేడపైకి వెళ్లింది అనూరాధ. ఆమె వెళ్లేసరికి కాంతారావు మంచంమీద అటుతిరిగి కూచుని శూన్యంలోకి ఎటో చూస్తున్నాడు.

అనూరాధ చప్పుడుకాకుండా వెనకగా వెళ్ళి, చనువుగా బుజాలమీద చేతులు వేసింది. కాంతారావు ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు.

అనూరాధ!!

ఆశ్చర్యం ఇనుమడింపగా, అలాగే నిర్మలంగా ముసిముసిగా నవ్వుతున్న ఆమె





అందమైన అలంకరణకు ఆఖరు హంగు

అసలైన ఫ్రెంచి తయారు, సువాసన.
ప్రపంచంలో కోటానుకోట్లకు ప్రియమైనది.

అన్ని ఋతువుల్లో, అన్ని వేళల్లో వాడదగింది




ఇంటర్నేషనల్ ఫ్రాంచైసెస్ ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి

**PAKCO** పాకో స్లో-స్పీడ్, కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజనులు

—: ప్రత్యేక లక్షణములు :—

* పనిచేయ ప్రారంభించుట తేలిక
* తక్కువ ఇంధన ఖర్చు
* క్రమమైన నడక
* దిట్టమైన నిర్మాణం
* ఎక్కువ మన్నిక
* అద్భుతంగా పని చేయును
* బాష్-ఫ్యూయల్, ఇంజక్షన్ పరికరములు




మద్రాసు ఆంధ్ర, కర్ణాటక కేరళ రాష్ట్రములకు ఏజెంట్లు:

Grams: LAMP' కె. శి. SHIVJI & CO, (Estd. 1903)

Phone:3617 పోస్టు బాక్సు నెం. 5, 178-79 బ్రాడ్వే, మద్రాసు-1.




## తరుచి అమ్మబడు అన్ని షాలిమార్ పెయింట్ వస్తువులు మెట్రిక్ పద్ధతికి మార్చబడినవి

ఈ వస్తువులు క్రొత్త మెట్రిక్ స్టాండర్డ్ ప్యాకింగులో గాని, ప్రస్తుత స్టాండర్డ్ ప్యాకింగులోనే మెట్రిక్ సరి సమానములు చూపిగాని, ఇప్పుడు దొరకుచున్నవి.

మీరు సరిగా లెక్కచూచుకొనుటకు ఈ క్రింది విషయములు సహాయపడును :

| ప్రస్తుత స్టాండర్డ్ ప్యాకింగులు | మెట్రిక్ సరిసమానములు చూపబడినవి | స్టాండర్డ్ మెట్రిక్ ప్యాకింగులు | క్రొత్త పాతవాటిల్లో షుమారు బేధము |
|---|---|---|---|
| 56 పౌండ్లు | 25.4 కిలోగ్రాములు | 20 కిలోగ్రాములు | —5.4 కిలోగ్రాములు (11 పౌ. 15 ఔ.) |
| 28 పౌండ్లు | 12.7 కిలోగ్రాములు | 10 కిలోగ్రాములు | —2.7 కిలోగ్రాములు (5 పౌ. 15 ఔ.) |
| 14 పౌండ్లు | 6.35 కిలోగ్రాములు | 5 కిలోగ్రాములు | —1.35 కిలోగ్రాములు (3 పౌ.) |
| 7 పౌండ్లు | 3.18 కిలోగ్రాములు | — | — |
| 4 పౌండ్లు | 1.81 కిలోగ్రాములు | 2 కిలోగ్రాములు | +190 గ్రాములు (6.7 ఔ.) |
| 3 పౌండ్లు 8 ఔ. | 1.59 కిలోగ్రాములు | 1.5 కిలోగ్రాములు | —90 గ్రాములు (3.1 ఔ.) |
| 1 పౌండు | 454 గ్రాములు | 500 గ్రాములు | +46 గ్రాములు (1½ ఔ.) |

తూనికకు తూనిక, ప్రమాణమునకు ప్రమాణము, ధరమాత్రము ఇదివరకు వలెనే—నాణ్యతగూడా

1 వ అక్టోబరు 1960 నుండి 1 వ ఏప్రిల్ 1961 వరకు స్టాండర్డ్ ఆఫ్ వెయిట్స్ అండ్ మెజర్స్ ఆక్ట్ 1956 ప్రకారము షాలిమార్ పెయింట్ వారిచే తయారు చేయబడిన వస్తువులన్నియు (తూనికవల్ల, ప్రమాణమువల్ల అమ్మబడేవి) మెట్రిక్ పద్ధతికి మార్చబడును. మీకు మరల మరల తెలుపుతూ ఉంటాము.




be-BRIGHT-buy




SHALIMAR PAINT, COLOUR & VARNISH COMPANY PRIVATE LIMITED

CALCUTTA . BOMBAY . MADRAS . NEW DELHI . KANPUR . (Agents overseas)

TSPW 587 TEL

# మనసులూ మనసులూ

మొహంలోకి చూస్తూవుండిపోయాడు. ఆమెను పలకరించూదామనుకుంటే సిగ్గు, భయం అడ్డొచ్చాయి.

అతడికి దగ్గరగానే మంచంమీద కూచుంటూ, "మూగనోము పట్టారా?" అన్నది అనూరాధ.

"లేదండీ-" అన్నాడు పొడిగానవ్వుతూ.

"లేకుంటే ఎందుకు మాట్లాడరు? ఎవరో అపరిచితుల్ని చూచినట్టు అలా చూస్తారేమిటి నావేపు? కనీసం నేను అనూరాధనన్నైనా జ్ఞాపకంలేదా?...ఇప్పుడు చెప్పండి. మూగనోము పట్టకపోతే ఇన్నాళ్ళుండి యూనివర్సిటీలో నాకు కనిపించటంగాని, మాటాడటంగాని ఎందుకు మానేశారో చెప్పండి' నేనుచేసిన తప్పేమిటి?"

అతడు జవాబు చెప్పలేకపోయాడు. న్యాయమూర్తి ఎదుట తప్పుబడ్డ ముద్దాయిలాగా ఆమె చూపుల్ని తప్పించుకుంటూ వుండిపోయాడు.

"ఆఖరికి- వారంరోజులు సుస్తీగావుండీ కూడా, ఆ సంగతి నాకు కబురన్నా చెయ్యలేదు. ఆ పాటికికూడా తగనా నేను?" అంది మళ్ళీ అనూరాధ.

"ఎవరిచేత కబురుచేసేది చెప్పండి? లెటరు రాసి పంపిద్దామనుకున్నా ఈ యింట్లో నా మాట ఒక్కరూ వినరు. జ్వరంవచ్చిన రోజు నుంచీ యిప్పటిదాకా కాళ్ళూ చేతులూ విరిగిపోయిన వాడిలాగా పడివున్నాను... ఏంచెయ్యను?" అన్నాడు.

అనూరాధ మనస్సు నీరైపోయింది.

"మీ కేమన్నా బాధ కలిగించివుంటే క్షమించండి." అంది.

"అబ్బే-లేదు." అన్నాడతడు.

తరువాత వో అరగంటసేపు అక్కడే కూచుంది అనూరాధ. అక్కణ్ణుంచీ వచ్చేటప్పుడు అతడి నొసటి మీద చెయ్యివేసి చూసింది. వేడిగావుంది.

"రేపు యూనివర్సిటీకి వస్తాను." అన్నాడతడు. అనూరాధ నవ్వి, "భలేవారే!... అలాంటి పిచ్చి పనులేం చెయ్యబోకండి. నామీద ఒట్టు....ఇంత నీరసంతోనైనా మీరు రాకపోతే అక్కడేం మునిగిపోదు లెండి. నేను ప్రొఫెసరుకు చెప్పుకుంటాను గాని—" అంది.

తిరిగి యింటికివెళ్ళేటప్పుడు అనూరాధ మనస్సేం బాగులేదు. కొంతొంగావు మాటలు ఆమె మనసును ద్రవీభూతం చేశాయి. నిస్సహాయతను ప్రకటిస్తూ అతడన్న మాటలు ఆమె మనసునంతా ఆక్రమించి కలవరపెట్టాయి.

అతడికంత దైన్యం దేనికి? తన సౌఖ్యాన్ని గురించి ఆలోచించుకునే పాటికూడా యీ

లిసెర్చి స్కాలరుకు తెలీదన్నమాట!...అయిన వాళ్ళంటూ వెర్రి మమతలు పెట్టుకుని పంచ జేరిన అతణ్ని ఇంటిల్లిపాదీ వెలి వేసినట్టు చూశారు.

తెల్లగా కనపడేదంతా మంచి అనుకునే కాంతారావుకు తన స్వంత జీవితంగురించి జాగ్రత్త తీసుకోవటం తెలీదు. ఆ జాగ్రత్త తీసుకునేందుకు ఇంకొక వ్యక్తి అవసరం. అతడిబాధ్యత అంతా నెత్తిన వేసుకుని, పసి బిడ్డలాగా అతణ్ని సంరక్షించుకునేందుకు తనలాంటి వ్యక్తికావాలి.

ఆలోచనలతో పరధ్యానంగా నడుస్తున్న అనూరాధ తమయిల్లు దాటిపోవటం కూడా మరిచిపోయి సాలార్ జంగ్ మ్యూజియం దాకా వెళ్ళింది.

## 8

అనూరాధకూ కాంతారావుకూ పెళ్ళి నిశ్చయమయింది. ఊరినుంచీ కాంతారావు తండ్రివచ్చి ముహూర్తాలు పెట్టుకున్నాడు. పెళ్ళి హైదరాబాదులో జరుపుదామని అనూరాధ తరఫువాళ్ళనుకున్నారు గాని, ఆయన ఒప్పుకోలేదు. ఒక్కగానొక్క కొడుకు పెళ్లి తన పట్టింట్లో జరగాల్సిందే నన్నాడాయన.

తరువాత వారంరోజులకు కాంతారావుకు స్కాలర్ షిప్పు గ్రాంటయి వచ్చింది. హాస్టల్లో సీటుకూడా దాంతోబాటే వచ్చింది.

ఆరోజు పొద్దున హాస్టల్లోకి మకాం మార్చేందుకని కాంతారావు పెట్టె బెడ్డింగూ గైరాలన్నీ సర్దుకుంటున్న సమయంలో అనూరాధవచ్చింది. ఆమె చేతిలో శుభలేఖలున్నాయి.

ఇద్దరూ చెరొక శుభలేఖనూ హేమకు బహూకరించారు.

శుభలేఖను చదివి దాచుకుంది హేమ. అలా దాచుకుంటుంటే ఆమె కళ్లలోంచి రెండు వెచ్చనైన అశ్రుకణాలు టపటపామని వాటిమీద పడ్డాయి. ఎవ్వరూ గమనించకుండా అటువేపు తిరిగి కళ్లొత్తుకుంది.

తిరిగి అంతలోనే నవ్వు పెదాల మీదికి తెచ్చుకుంటూ, "అయితే హాస్టలులోకే గృహప్రవేశం చేస్తావా యేమిటన్నయ్యా?" అంది.

కాంతారావూ, అనూరాధా కూడా నవ్వారు.

కాంతారావు తన మామూలు ధోరణిలో పెళ్లి ప్రయాణపు ప్రోగ్రామునుగురించి చెప్పుకుపోతున్నాడు: బావగారిచేత ఆఫీసుకు ఎన్నిరోజులు సెలవు పెట్టించవలసిందీ, వాళ్లు ఎప్పుడు బయల్దేరవలసిందీ—ఇలాంటి సంగతులు. అనూరాధ అతను చెప్పేదంతా వింటూ ముసిముసిగా నవ్వుకుంటోంది.

హేమమాత్రం సరిగ్గా వినటంలేదు. ఆమె ఆలోచనామగ్నమై వున్నది... ఇప్పటి దాకా, తను ఆదరణతో చూచినా చూడక

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు
లోధ్ర
Lodhra
కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14
ఆంధ్రప్రదేశ్ కు ఏజంట్లు: సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్, విజయవాడ సికిందరాబాదు

R.S.
DAYAL
INK REGD.
దయాళ్ ఇంక్
BEST FOR ALL PENS
DAYALBAGH INK FACTORY
KAKINADA



పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన చర్యనుగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామా యున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీల గాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచి నెలలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1 4-0 లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతి చేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన ఫోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మా అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

పోయినా అన్నయ్యే తనకి సన్నిహితంగా వున్నాడు. చిన్నతనంనుంచీ తనను ప్రాణప్రదంగా చూచుకున్న అన్నయ్యే అదే పసివూహాలతో తనయింటికి వచ్చాడు...

కాని అన్నయ్యకు తనయింట్లో సముచితమయిన స్థానం లభించలేదు. చివరకు తను కూడా బుద్ధిపూర్వకంగానే అతడికి దూరంగా జరిగింది. ఇప్పుడు అన్నయ్య

## మనుషులూ-మనసులూ

అనూరాధవా డవుతుంటే ఏదో అవ్యక్తమైన బాధకలుగుతోంది. తన హృక్కులోవున్న అమూల్య వస్తువును ఎవరో బలవంతంగా తన దగ్గర్నుంచి లాక్కుపోతున్నట్టుగావుంది.

సామాను లంతా ప్యాక్ చేసి వెళ్లేందుకు సిద్ధమవుతున్న కాంతారావూ అనూరాధా మళ్ళీ రెండోసారి పెళ్ళిప్రయాణపు సన్నాహాలను హెచ్చరిస్తున్నారు హేమను. ఆమె బరువుగా నవ్వింది.

భవిష్యత్తులోనికి తొంగి చూస్తున్నాయి వాళ్ళ హృదయాలు.

గతాన్ని తవ్వి కన్నీళ్లు తెచ్చుకుంటోంది హేమ.

(అయిపోయింది)


"అన్నట్టు
నా హెర్క్యులిస్
తాళం వేశానో లేదో
చూసుకొని వస్తా"

హెర్క్యులిస్ అతని అమూల్యమైన చరాస్తి

మీరు సైకిలు కొనుక్కోవాలంటే మీరూ మీ వాళ్లూ కూడా అనేకవిధాల ఖర్చులు తగ్గించుకోవలసి రావచ్చు – ఐస్క్రీలకనండి, కాఫీ ఫలహారాలకనండి, చీరా సారే అనండి, నగా నట్రా అనండి ....

అందుచేత ఆ కొనేదేదో ఉత్తమోత్తమమైనదే కొనాలనిపించడం సహజం. హెర్క్యులిస్ కొనండి. కంటికి ఇంపైన రూపం, ఎదురుగాలిలో కూడా సునాయాసంగా వెళ్లడానికి అనువుగా తీర్చిదిద్దిన రూపురేఖలు, హాయిగా, సాఫీగా సాగిపోయే నడక – ఇవి దీనికి ప్రథమస్థానం సంపాదించిపెట్టాయి. ప్రపంచావధిని 134 పైచిలుకు దేశాల్లో హెర్క్యులిస్‌నే మిగతావాటిమీద ఎన్నిక చేస్తున్నారు.

ఇండియాలో అన్నిటికన్నా పెద్దదైన ఫ్యాక్టరీలో, సర్వాంగ సమగ్రమైన సాధన సంపత్తితో నిర్ణీత ప్రమాణాలకు తూ. చ తప్పకుండా తయారుచేసిన విభాగాలతో హెర్క్యులిస్ సైకిలు నిర్మింపబడుతోంది.



"స్ప్రే-గ్రేనొడైజింగ్" పద్ధతిలో తుప్పు పట్టడానికి ఏమాత్రం ఆస్కారం లేకుండా కట్టుదిట్టం చేస్తారు. ఆపైన ముమ్మారు ఎనామెల్ వేయడంవల్ల సైకిలు ధగధగ మెరుస్తూ వుంటుంది.

మీ సైకిలు పెట్టుబడిలాటిది- హెర్క్యులిస్ మీ సొమ్ముకి పూర్తి విలువనిస్తుంది.

హెర్క్యులిస్ సైకిల్ కంటె ఎక్కువైనది –, అది మీ ప్రాణమిత్రుడు

తయారీ : టి.ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు – మద్రాసు దగ్గర



IWT. TIC 1144a

# సినిమా

## వార్తాభరణం
### (బొంబాయి)

‘పెళ్లికానుక’ చిత్ర నిర్మాతలు వీనస్ పిక్చర్సువారు ఆచిత్రాన్ని హిందీలో నిర్మిస్తున్నారు. ‘నజరానా’ అని చిత్రానికి పేరుపెట్టారు జనవరిలో చిత్రం పూర్తి అవుతుందని తెలుస్తోంది వైజయంతీమాల, రాజకపూర్, ఉషాకిరణ్, ఆగా, సవితాఛటర్జీ అచలాసచ్‌దేవ్, నిరంజన్‌శర్మ నటిస్తున్నారు. రచన రాజేందర్ కిషన్, సంగీతం రవి, దర్శకత్వం శ్రీధర్.

* * *

జె. బి. ప్రొడక్షన్స్‌వారి ‘ఇసీకా నామ్ దునియా హై’ పదకొండు రీళ్ళవరకు పూర్తి అయింది అశోక్ కుమార్, శ్యామా, మహమూద్, సాయిరా నటిస్తున్న ఈ చిత్రానికి సంగీతం రవి సమకూరుస్తున్నారు. దర్శకుడు శక్తిసామంత.

* * *

జె. యస్. కాశ్యప్ సంగీతచిత్రం ‘పియా మిలన్‌కీ ఆస్’ జనవరిలో విడుదలకు ముస్తాబు అవుతున్నది. సంగీతం, దర్శకత్వం ఎస్. ఎన్. త్రిపాఠీ. అమితా, మనోజ్ కుమార్, జీవన్, డెయిసీ ఇరానీ, సుందర్‌లు ఇందు నటీనటులు.

* * *

మమతా, మూవీస్‌వారి ‘దేఖాప్యార్ తుమ్హారా’లో అచలాసచ్‌దేవ్ అపూర్వమైన పాత్ర ఒకటి ధరించనున్నది నటనకు, ఆవేశప్రదర్శనకు మంచి అవకాశంగల ఈ పాత్ర నిర్వహణ కష్టతరమని, ఆమెకు ప్రథమమని చెబుతున్నారు. కుమారినాజ్, సుబిరాజ్, భగవాన్, హెలెన్ సాధనా చౌధురీ, మదన్



అంజలీపిక్చర్సవారి ‘ఋణానుబంధం’లో గిరిజ, నాగేశ్వరరావు.



ఎన్. ఏ. టి. వారి 'సీతారామకళ్యాణం'లో రావణాసురుడుగా యన్. టి. రామారావు, మండోదరిగా బి. సరోజ.

కూరీ, లోటన్ వగైరాలు నటిస్తున్నారు. దర్శకత్వం కె. పార్వేజ్. సంగీతం రాజ్ కిరన్.

*　　*　　*

భారీ తారాగణంతో ప్రేమసంగీతరస నిర్భరంగా పెద్దయెత్తున డూబేప్రొడక్షన్స్ వారు నిర్మిస్తున్న 'ఆషిక్' ఈమధ్య కొంత కాలం ఆగి తిరిగి సెట్స్‌పైకి వెళ్లింది. రాజ్ కపూర్, పద్మిని, నంద, అభి భట్టాచార్య నటిస్తున్నారు. దర్శకత్వం హృషీకేశ్ ముఖర్జీ, సంగీతం శంకర్, జైకిషన్.

*　　*　　*

కేవల్ కపూర్ నిర్మిస్తున్న 'ఏ హైగా స్తే ప్యార్ కే'లో సునీల్ దత్, లీలానాయుడు ప్రధానపాత్రలు ధరించి అపూర్వంగా నటించినట్లు టాకీగా వార్తలు. ఆర్. కె. నయ్యర్ దర్శకుడు, సంగీతం రవి.

*　　*　　*

ఏషియాటిక్ ఆర్ట్స్ చిత్రం 'మేరే గుడియా మేసనప్ నే'లో అశోక్ కుమార్, మాలాసిన్హా, అశిశ్ కుమార్, నజ్రిన్, నటి

# వార్తాభరణం

స్తున్నారు. దర్శకుడు సూరజ్ ప్రకాష్. సంగీతం కళ్యాణ్ జీ ఆనంద్ జీ.

*　　*　　*

ప్రఖ్యాత గుజరాతీ రంగస్థలనాటకం 'సంస్కార్ లక్ష్మి'కి హిందీలో తెర అనువాదం ఫణీ మజుందార్ చేస్తున్నారు. అశోక్ కుమార్, మీనాకుమారి, ప్రదీప్ కుమార్, శశికళ, విజయచౌధురి, రాజేంద్రనాథ్, రమేశ్ దేవ్ నటస్తున్నారు. సంగీతం రోషన్.

*　　*　　*

ప్రతి చిత్రానికి సాధ్యమైనన్ని అనువాద చిత్రాలు నిర్మించి చిరకాలంగా ఉత్తర, దక్షిణ భారతాలలో మంచిపేరు తెచ్చుకున్న వాడికగా ప్రబద్ధ్రువారు 1961 లో అగ చిత్రాలు తీయాలని సంకల్పించారు. ఈ ఆరింటికీకూడా అనువాదాలు ఉంటాయనుకుంటే రైటే.

పగటికలల మగటిమి చిత్రించే 'చార్ దర్వేష్' మొదటిచిత్రం హేమంతకుమార్ సంగీతం సమకూరుస్తారు.

'న్యూ ఇండియా' అనే మరో చిత్రం వాడికగా దర్శకత్వంలో రానున్నది.

ఇవికాక, 'శ్రీ గణేశ్' 'పత్రకర్ ప్రదీప్', 'జింబోది మైటి', 'పారాన్‌మానీ' అనే చిత్రాలుకూడా తీసారు. చివరి చిత్రానికిమాత్రం బాబూ బాయ్ మిస్త్రీ మేస్త్రీ.

ప్రస్తుతం వీరు 'ఝబక్', 'సంపూర్ణ రామాయణం' చిత్రాలు నిర్మిస్తున్నారు. చిత్రగుప్త, వసంత్ దేశాయ్ ఈ రెంటికీ వరుసగా బాణీలు కడుతున్నారు

*　　*　　*

పి. యల్. సంతోషి దర్శకత్వంలో, సంగీతచిత్రం 'బర్సాత్ కీ రాత్' తయారయింది. బొంబాయిలో విడుదల అయింది కూడా.

మధుబాల, భరత్ భూషణ్, నాయికా



ప్రగతి ఆర్ట్ పిక్చర్స్ వారి 'మా బాబు'లో అభినేత్రి సావిత్రి.

నాయకులు. శ్యామా, చంద్రశేఖర్, కూడా నటించారు. సంగీతం రోషన్.

* * *

అభిభట్టాచార్య, జయశ్రీ రాముడు, సీత పాత్రలు ధరిస్తున్న సంగీతమయ పౌరాణిక చిత్రం 'రామ్ లీలా' చంద్రకాంత్ దర్శకత్వంలో తయారవుతున్నది. ఎస్. ఎన్. త్రిపాఠీ సంగీతం.

* * *

అశోక్‌కుమార్, చిత్ర, అనూప్‌కుమార్, సాహిరా, మదన్‌పురీ, రవికాంత వగైరాలతో దర్శకుడు సి. పి. దీక్షిత్ 'ఛోటేఆద్మీ' అనే చిత్రం నిర్మిస్తున్నారు. సలీల్ చౌదరీ సంగీతం.

* * *

టానీవాకర్ నిర్మిస్తున్న 'వాంటెడ్' చిత్రంలో సయీదాఖాన్, విజయకుమార్, జానీవాకర్, అన్వర్ హుస్సేన్, మనోరమ, షమ్మీ, హెలెన్ నటిస్తున్నారు. రవి సంగీతం.

* * *

ఆర్. ఎస్. బి. ఫిలిమ్స్‌వారి 'రంగోలీ' చిత్రంలో వైజయంతీమాల, కిశోర్‌కుమార్ నాయికానాయకులు, ఇటీవల బొంబాయి సమీపానగల జుహూబీచ్‌లో కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలు తీశారు. శంకర్, జైకిషన్ సంగీతం, చిత్రం 14 రీళ్లు తయారయింది.

* * *

సునీల్‌దత్, వహీదా రెహమాన్, జానీ

## వార్తాభరణం

వాకర్, నటించిన ప్రభాత్ ఫిలిమ్స్ 'ఏక్ ఫూల్ చార్ కాంటే' సెన్సారు అయింది. శైలేంద్రరచన, శంకర్ జైకిషన్ సంగీతరచనగల ఈ చిత్రం త్వరలో విడుదల కానున్నది.

* * *

సిద్ధూఫిలిమ్స్ పేరిట జ్యోతిష్ చక్రవర్తి నిర్మిస్తున్న 'భరోసా' చిత్రంలో అశోక్‌కుమార్, నిమ్మి నటిస్తున్నారు, కళ్యాణ్ జీ ఆనంద్ జీ సంగీతం.

* * *

మోహన్ సైగల్ నిర్మిస్తున్న కిరాన్ ప్రొడక్షన్స్ వారి 'అప్‌పథ్' లో నూతననటుడు ధర్మేంద్ర ప్రముఖపాత్ర ధరిస్తున్నారు. మాలాసిన్హా, బాల్‌రాజ్ సాహనీకూడా ఇందులో నటిస్తున్నారు. మోహన్‌కుమార్ దర్శకత్వం వహిస్తున్నారు. సంగీతం మదన్‌మోహన్ కూరుస్తున్నారు.

* * *

ఈస్ట్‌మన్‌కలర్‌లో సుబోధముఖర్జీ నిర్మిస్తున్న 'జంగ్లీ' చిత్రంలో షమ్మీకపూర్, సాయిరాబాను, లలితాపవర్, శశికళ, ఆగా, శివరాజ్, అసిత్‌సేన్ నటిస్తున్నారు. శంకర్, జైకిషన్ సంగీతం, ఎన్. వి. శ్రీనివాసన్ ఛాయ నిర్వహిస్తున్నారు.

ఫిలోమ్రదయావారి ప్రథమచిత్రం (నామకరణం జరగలేదు)లో అశోక్‌కుమార్, నూతననటి లీలానాయుడుతో నటించనున్నారు. జాయ్‌ముఖర్జీ, నందా ప్రేమికులుగా నటించే ఈ చిత్రానికి సంగీతం ఇక్బాల్ ఖురైషీ ఇస్తున్నారు.

* * *

నసీర్ హుసేన్ ప్రొడక్షన్స్ నిర్మాణం 'జబ్ ప్యార్ కిసీసే హోతా హై'లో హిమాలయాల దృశ్యాల చిత్రీకరణకు హెలికాప్టర్లను ఉపయోగిస్తున్నారు. దేవానంద్, ఆశాపరేఖ్ నటిస్తున్న ఈ చిత్రం సంగీతం శంకర్ జైకిషన్‌ల సృష్టి ★

## 'వెలుగునీడలు'

### అన్నపూర్ణావారి చిత్రం

జీవితంలో వెలుగునీడల అడుగుజాడలు ఎలా మిగిలిపోతాయో చూపగల హృదయంగమమైన కథావస్తువుతో అన్నపూర్ణా (దొంగరాముడు, తోడికోడళ్లు, మాంగల్యబలం) వారు ఇప్పుడు 'వెలుగునీడలు' నిర్మించారు. ఈ చిత్రం పేరు మొదట 'సుఖదుఃఖాలు' అని తెలిసింది. కాని అది పొరబాటు.

జనవరి 12 వ తేదీన ఈ చిత్రం విడుదల కాగలదని నిర్మాత మధుసూధనరావు తెలిపారు. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు, కళ కృష్ణారావు, దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు నిర్వహిస్తున్నారు. ★



అన్నపూర్ణావారి 'వెలుగునీడలు'లో సావిత్రి, నాగేశ్వరరావు వగైరాలు.

# చిత్రకథల విచిత్రకథలు

చిరకాలంగా పుడుతున్న కుక్కగొడుగుల్ని ఆదర్శంగా తీసుకుని మరీ పుట్టుకొస్తున్నాయి నేటి సినిమా కథలు. అసలు సినీ మనీషులు సినిమాలకోసం తెచ్చుకునే కథల కన్న వాళ్ల సొంత కథలకే కొంత వాస్తవికత చేర్చి చిత్రీకరిస్తే మేలని, పేలని, అవే కావాలని చాలామంది అంటారు.

నాటి స్వర్గసీమ, మాలపిల్ల, గృహలక్ష్మి అన్నీ మనవే. ఇప్పటికీ వాటితో చనవు, వాటిమీద అపేక్ష మనకు పెరుగుతున్నది. తెలుగుతనం వెలిగే కథలు అరిపోయి గట్టిగా దశాబ్దం గడచిపోయినా పొరపాటున తెరపాటు పడిన కొన్ని తెలుగుకథలు లేకపోలేదు. అవి చేసిన పొరపాటుకు దర్శకుడు రజతపతకాలందుకున్నా, నిర్మాతలు బాధపడిన ఘట్టాలు లేకపోలేదు. కావాలంటే తోడుదొంగలువంటి చిత్రాలు సాక్ష్యమిస్తాయి.

పొరుగింటి పొట్టుకథలు మనకు రుచి. మనవైనా రసపట్టు కథలు మనకు నచ్చవు. ఇక్కడ అప్పనా, తన మన విభేదాలతో నిమిత్తం లేదు. మంచి సర్వత్ర గ్రాహ్యమే. అయినా మన తనం మనకొటుం. అది మన మనుగడకు దర్పణం. దానికి తర్పణం సమర్పిస్తే మిగిలేది



ఎన్. ఎ. టి. వారి 'సీతారామకళ్యాణం'లో రావణుడుగా ఎన్. టి. రామారావు.

యోవాసన. తెలుగుకథలు ఎన్నో చారిత్రికంగా, జానపద రీతిగా, సాహిత్యపరంగా ప్రసిద్ధి పొందినవి ఉన్నాయి. కాల్పనిక మేధాసంపన్నుల తెలుగుటూహాలు కట్టుకున్న కట్టుకథలూ ఉన్నాయి. ఇంతకు మించి తెలుగుతనంలో నేకృత్రిమంగా కథలు కట్టుకోడానికి కావలసినంత కల్పనా శిల్పము ఉంది.

అయినా నేటి తెలుగు సినిమాకథ తెలుగు కథ కాదు. తెలుగు తెరకు తెలుగుకథ రాదు.

దీనికి ఏమిటి కారణం అంటూ బెంగాలీ కథ ఆధారంగా తెలుగు సినిమా తీసే నిర్మాతలు, దర్శకులూ కూడా ఆలోచిస్తున్నారు వళ్లు మరచి.

ఆత్మవిశ్వాసం లేక అన్యకథలకు ఎగబడుతున్నారని వీరంటే, ఆత్మస్తుతి చేసుకుంటే గొప్పవాళ్లం కాబోమంటారు వారు!

బెంగాలీభాయిని తెచ్చి తెలుగు పంచెకట్టి, తెలుగుభాష నేర్పి, కేవలం గోంగూర ఆవకాయ పెట్టించి వంట పట్టించినా ఎక్కడో ఒకచోట అతని వంగజాతీయత తొణుక్కు మనకమానదు. తెలుగువారికి అది విజాతీయంగా తోచకపోదు. తెలుగుదనం అనేది సహజంగా ఉంటే గుబాళిస్తుందే గాని, లేనిచోట తెచ్చి పెడితే వచ్చేది కాదు. మరాఠీ, బెంగాలీ తమిళ కథలను తెలుగులో రాసుకుని – తెర కెక్కించే నిర్మాతలు ఇది గ్రహించాలి.

హిమబిందు, చెలికులికట్టు, జేబుదొంగలు, ఏకవీర, మాబాబు, వంటివనలలకే ఆ ఇతర కథలకు చేసే మార్పులు చేస్తే ఎంత గాణిస్తాయి? ఏ అరేబియన్ నైట్సు కథలో, రాబిన్‌హుడ్ కథలో ఆధారం చేసుకుని కథలు కట్టేబదులు కల్పన అనేది మన తెలుగు కథలకే కొంత ఎందుకు తగిలించరాదు. 'అల్లూరి సీతారామ

## సొహరాబ్ మోడీ చిత్రవేదాంతం!

"మీరు పిల్లలను కనవచ్చు. పెంచి పెద్ద చేయవచ్చు. సంకీర్తిత గాత్రులుగా చేయనూ వచ్చు. అయితే వాళ్ళు మీవాళ్ళు అనుకోవద్దు. పిల్లలు కొత్తగా వికసించిన ఆత్మకుసుమాలు. వాళ్ళు మీలోంచి పుట్టుకురాలేదు. ఈ లోకంలో వాళ్ళ ప్రవేశానికి మీరు నిమిత్తమాత్రులైన ద్వారాలుమాత్రమే. వాళ్ళకు మీ ప్రేమ, పెంపకం కావాలి. అవి చవిచూపండి. కాని మీ ఆశయాలు ఉద్దేశాలు, పద్ధతులు వాళ్ళకి మప్పకండి. వాళ్ళు మీరు చూడలేని భవితవ్యంలో బ్రతకవలసిన రేపటి పౌరులు. మీపాత భావాలు నూరిపోసి రేపటికి పనికిరాని వాళ్ళను చేయకండి"

ఈ మాటలు ప్రసిద్ధ తత్వవేత్త ఖలీల్ గిబ్రన్ భావాలు.

ఆమాటలకు రూపస్ఫూర్తి కల్పించి రూపకం తయారుచేశారు ప్రసిద్ధ దర్శక నిర్మాత సొహరాబ్ మోడీ. అదే మినర్వామూవీటోన్ వారి 'మేరాఘర్ మేరే బచ్చే.' త్వరలో విడుదల అవుతుంది.

రాజు' కథలలో అంగుడు కట్టుకుపోయినంత చోటుంది, కేవలం కల్పనే అయినా భట్టి విక్రమార్కుడి కథలు, పాతాళభైరవివంటి తెలుగు కథలు ఎంతరాణ కెక్కలేదు? పరాయివాసనలేని సాంఘికం మనం తీయలేని ఈ హీనస్థితి ఎంత అవమానకరం?

ఇలాటి పొరుగింటి కథల భాషాంతరీకరణ

## చిత్రకథల విచిత్రకథలు

చిత్రాలకు కైతం భారత ప్రభుత్వం రజతపతకాలు చదివించడం మరింత అన్యాయం.

కనీసం రాష్ట్రప్రభుత్వాలైనా ఇకనుంచి పూనుకుని అచ్చతెలుగు కథలు, ఆధారంగా తీసే చిత్రాలకు బహుమతులూ, ప్రోత్సాహం కల్గించడం అత్యవసరం. అప్పడు గాని మనతనం మన్నుతుందని చెప్పలేము. అంతవరకు ఈ చిత్ర కథలు తెలుగుతనానికి చిత్రవధలే!

★

—చిత్రశర్మ.


# పేరు చెప్పుకోండి...

పూర్వం ఒక మిల్లు వర్తకుడు. అతడికో కుమార్తె. మంచి అందగత్తె. ఒకరోజు రాజుదగ్గరకువెళ్లి తనపిల్ల ఎంతో తెలివైందని ఎండుగడ్డిని బంగారపు పోగులు చేస్తుందని గొప్పలుపోయాడు. రాజు వెంటనే ఎండుగడ్డి పెట్టిన గదిలోకి పిల్లను రప్పించి "ఈ గడ్డిని బంగారం చేస్తే నేను నిన్ను పెళ్లాడతాను చేయలేకపోతే తల కొట్టేస్తాను" అన్నాడు. దిక్కుతోచక వెర్రిపిల్ల కూర్చుని ఏడుస్తూంది. ఇంతలో ఓ పొట్టివాడొచ్చి "నీ మొదటి కాన్పు బిడ్డను నాకిస్తే నీకు సహాయం చేస్తా"నన్నాడు. సరే అంది వెనుక ముందు లాలోచించకుండా! మర్నాడు చూస్తే గదంతా బంగారపు పోగులే. రాజు ఎంతో సంతోషించి ఆ పిల్లను రాణి చేశాడు.

కొన్ని ఏళ్లకి రాజకుమారుడు పుట్టాడు. పొట్టాడు రాణి దగ్గర తయారై వాగ్దానం జ్ఞాపకంచేశాడు. ఏడ్చి మొరపెట్టుకుంది. పొట్టివాడు కనికరంతో ఒకరోజులోగా తన పేరు చెప్పకుంటే బిడ్డను ఇవ్వక్కరలే దన్నాడు. తెల్లవారింది. రాణి ఊహించిన పేర్లు ఒకటీ నిజమవలేదు. తెగించి గదిలోకి పరుగెత్తి సందుకు పెట్టొకటి తెచ్చి పొట్టాడికిచ్చి తెరచిచూడమంది. గునుస్తూ అయిష్టంతో పెట్టె తెరిచాడు — కళ్లు జిగేలుమన్నాయి. "రాణీగారిచ్చిన పారితోషికం అమోఘమైనది. తమ బిడ్డను తమరే ఉంచుకోండి" అని జనా పేరు తెలుసుకోవాలంటే "కేనామాగో విమత్రి త్రాశీ హృపదా" అని సంతోషంతో సందుకు పట్టుకుపోయాడు.

సందుకులో ఏముందో ఊహించండి ... చెప్పాలా! అందమైన ప్యారీవారి బిళ్లలడబ్బా.





నీతి: ప్యారీవారి Parry's బిళ్లల పారితోషికంతో ఎప్పుడూ అందరినీ సంతోషపెట్టవచ్చు

ప్యారీవారి బిళ్లలు రుచికరమైనవి, స్వచ్ఛమైనవి, పుష్టికరమైనవి.
విడిగా కొనుక్కోవచ్చు లేదా అందమైన ఫ్యాన్సీడబ్బాలలో కొనవచ్చు.

తయారీ:
ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

చదరంగం:

# ముమూపై ఆరన్ విజయం సాధించినవిధం

ఇటీవల మద్రాసులో జరిగిన 'ప్రీ-జోనల్ టూర్నమెంటు'లో భారతదేశ ప్రతినిధి-జాతీయ ఛాంపియన్ మాన్యూల్ ఆరన్ మంగోలియా ఛాంపియన్ ఎస్. ముమూను 3—1 గేమ్సులో ఓడించారు. మనదేశంలో ఇదివరకు ఎన్నడూ అంతర్జాతీయ పోటీలు జరుగలేదు. కనుక ఇది నిజంగానే మనదేశం చతురంగం చరిత్రలో గొప్ప సంఘటన.

ఆస్ట్రేలియాలో త్వరలో మరొక 'ప్రీ—జోనల్ టూర్నమెంటు' జరుగనున్నది. దానిలో గెలిచినవారితో ఆరన్ 1961 జనవరిలో పోటీ చేస్తారు.

ముమూతో మూడవ గేములో ఆరన్ విజయం సాధించిన విధం ముచ్చట అయినది. ఆ ఆట సాగిన క్రమం ఇది:

తెలుపు—ఎస్. ముమూ;

నలుపు—ఎమ్. ఆరన్.

## సిసిలియన్ డిఫెన్స్;

1. బ-రా 4; బ-మశ 4.
2. గు-రాశ 3; బ-మ 3.
3. బ-మ 4; బ×బ.
4. గు×బ; గు-రాశ 3.
5. గు-మశ 3; బ మ ఏ 3.
6. శ-రా 2; బ-మగు 4.
7. శ-శ 3; బ-రా 4.
8. గు-గు 3 (అ); శ-గు 2.
9. శ-గు 5; శ-రా 2.
10. మ-మ 3; మగు-మ 2.
11. బ-రా ఏ 4 (ఆ); మ-శ 2.
12. బ-గు 4; మఏ-శ 1.
13. ం-ం-ం (మంత్రివైపు కోట) (ఇ); బ-గు 5.
14. గు-రా 2; బ-మ ఏ 4.
15. గు-గు 3; బ-ఏ 5.
16. గు-ఏ 1 (ఈ); గు-శ 4.
17. మ-గు 5 షా; శ-శ 3.
18. మ×గు బ (ఉ); బ-మ 4.
19. మ-శ 3; బ×బ.
20. శ-రా 2; బ-ఏ 6.
21. బ-గు 3; బ-రా 6.
22. బ-శ 3; గు-మ 4 (ఊ).
23. ఏ×గు; శ×ఏ.
24. శ-గు 5 షా; రా-శ 1.
25. శ×శ షా; మ×శ.
26. మ×బ (రా 3); మ-శ 3 (ఎ).
27. గు-రా 4; శ×గు.
28. బ×శ; మ-శ 5.
29. మ×మ; బ×మ.
30. ఏ-రా 1; రా-రా 2.
31. బ-గు 4; గు-రా 3.
32. గు-గు 3 (ఏ); ఏ శ 6.
33. శ-మ 3; ఏ-మ 1.
34. రా-మ 2; ఏ-శ 2.
35. ఏ-రాశ 1; బ-ఏ 3.
36. గు-శ 5; బ-గు 4.
37. బ×బ; బ×బ.
38. బ-శ 4; ఏ-రాఏ 1 (ఐ).
39. రా-శ 3; ఏ-ఏ 6.
40. గు-గు 3; ఏ-మ 2.
41. గు-శ 1; బ-శ 6.
42. ఏ-శ 2; గు-శ 5 (ఒ).
43. రా-మ 2; ఏ-ఏ 3.
44. ఏ×బ; ఏ×గు.
45. రా×ఏ; ఏ×శ.
46. ఏ-శ 1; ఏ-శ 6 షా.
47. రా-మ 2; ఏ×బ (ఓ).

మరికొన్ని ఎత్తుల తరువాత తెలుపు ఓటమి అంగీకరించినది.

(అ) 'రా 2' గడి ఖాళీ చేసుకొని కూడా గుర్రాన్ని 'గు 3'లో వేయడం అనవసరం. ఏమంటే అది మళ్లీ ఆటలోనికి రావడానికి కనీసం రెండు ఎత్తులు అయినా వ్యర్థం చేయవలసి ఉంటుంది.

(ఆ) నలుపు రాజువైపు 'కాజిల్' చేయక ముందే రాజువైపు దాడి మొదలు అయినది. దీనివల్ల నల్ల బలానికి నష్టమేమీ లేదు. పైగా తెలుపు స్థితి బలహీనం అవుతుంది.

(ఇ) తెల్లమంత్రి వైపునే నలుపు దాడి చేయడానికి బలం అంతా కేంద్రీకరించి ఉంచగా ఆ వైపునే తెలుపు 'కాజిల్' చేయడం నలుపు వాడికి సహాయం. అదీ కాక ఇప్పుడు బ-గు 5 ఎత్తు వేస్తే రాబోయే ప్రమాదం అరికట్టడం అత్యంతావశ్యకమై ఉన్నది. ఇందుకు బ-మఏ 3 చాలా ఉపకరించి ఉండేది.

(ఈ) ఈ స్థితిలో గుర్రం చేయగలిగినదల్లా శకటు బంటును కాచుకొని ఉండడం మాత్రమే.

(ఉ) ఈ బంటును తీసుకొనడంవల్ల తెల్ల బలానికి ముప్పు సంభవిస్తుంది.

(ఊ) ఇప్పుడు తెలుపు గుర్రానికి ఏనుగును ఇవ్వక తప్పదు. లేకపోతే ఆట ఈ విధంగా సాగుతుంది: 23. మ-శ 4; గు-గు 3. 24. మ-శ 3; బ-శ 3. 25. శ×రా బ; గు-మ 4. అప్పుడు అయినా ఏనుగును ఇవ్వక తప్పదు.

(ఎ) రెండింటి మీదకు దాడి వచ్చింది గనుక తెలుపు తప్పనిసరిగా జంతువులను 'ఎక్స్ఛేంజి' చేయవలసి వస్తుంది. అది నలుపు విజయానికే తోడ్పడుతుంది. భయపడవలసిన ఎత్తులు ఇవి: మ×శబ;...బ-రా5.

(ఏ) 32. బ-శ 4 అయితే 32.—; గు-మ 5. 33. శ-ఏ 6; ఏ-శ 3. రాజు ముందు ఉన్న బంటు పోయినట్లే.

(ఐ) ఏనుగు ఏ-8 కి వస్తే ఇంక తెలుపు చేయగలిగినదేమీ ఉండదు. నలుపు గెలవడం తథ్యం. ఎన్ని ఎత్తులలో అన్నదే ప్రశ్న.

(ఒ) దీని తరువాత 43.—; గు-రా 7షా వేస్తే ఆట ఇలా సాగుతుంది: 44. గు×గు; బ×గు. 45. ఏ×బ; ఏ×శ షా.

(ఓ) ఈ ఎత్తు తరువాత తెలుపు ఆడడం అనవసరమే.

—వి. విశ్వనాథశాస్త్రి.

## సమస్యకు సమాధానం

నవంబరు 16 వ తేది సంచికలో ప్రచురించిన సమస్యకు సమాధానం ఇది:

(1) మ-ఏ 8.






దృష్టికి తీసుకొనివచ్చి, ఈ దేశానికి నిజమైన సేవ చేసింది. ఈవిషయమై పార్లమెంటులో ప్రశ్నలు రాగా ప్రధాన మంత్రి ఆ వార్తలను ధృవపరిచారు. ఇది ఎంతో ముఖ్యమైన విషయం. మనదేశంలో నెలకొల్పుకున్నామని చెప్పుకుంటున్న పాశ్చాత్య ప్రజాస్వామిక వ్యవస్థవల్ల కలిగే ప్రయోజనాన్ని కమ్యూనిస్టులు పూర్తిగా వినియోగించు


# తరచుగా మూత్రవిసర్జన

తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్ల చేయడమేకాకుండా ఈవ్యాధి, తనబంధంలో చిక్కినవారిని ఆరోజుకారోజు మృత్యువుకు ఆసన్నుని చేయును. ప్రథమదశలో శారీరక మానసిక శ్రమలకు యిచ్ఛగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడల్లో తిమ్మిరి, నరముల బలహీనతతో యీ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు నోరు ఎండుట, దురదలు, కాళ్ళలో పగుళ్లు, తూకం తగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ళ నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు ఎన్నో సంభవింపవచ్చును.

"వీనస్ ఛారమ్" మాత్రలు వాడి అనేకవేల మంది తమబాధలనుండినివారణపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి. "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యునానీ వైద్యవిధానం ప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థముల,స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. "అమిత దాహముతగ్గి... పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము 2 లేక 8 రోజులలోనే మీకు చాలాభాగము నివారణయగును. కొద్ది రోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "వీనస్ ఛారమ్"కొద్దివ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేక పథ్యము లేదు. నిరాహారముతోనుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై ఇదివరకటికంటే ఎక్కువ రకాల ఆహారపదార్థములు తీసికొనవచ్చును. వివరములుగల ఇంగ్లీషుకరపత్రములు అడిగిన వారికి ఉచితముగా పంపబడును.

ధర : 50 మాత్రల సీసా రు. 6-75. ప్యాకింగు పోస్టేజి ఉచితము. లభించు స్థలము :

Venus Research Laboratory (A. P. W)
P O Box No 587, Calcutta


# న్యూఢిల్లీ లేఖ

(15-వ పేజీ తరువాయి)

కున్నారు. ప్రధానమంత్రి ప్రకటనను సవాలు చేసి, శ్రీ హీరేన్‌ముఖర్జీ లేనిపోని చిక్కులు కొనితెచ్చుకున్నారు. సరిహద్దు ప్రాంతంలో కమ్యూనిస్టులు సాగించిన భారతవ్యతిరేక కార్యక్రమాల నన్నింటిని ప్రధాన మంత్రి పూసగుచ్చినట్లు ఏకరువు పెట్టారు.

రష్యా, చైనాలు రెండింటిపైన భక్తి విశ్వాసాలు వెల్లడించక తప్పదని కమ్యూనిస్టులు భావించినంతకాలం భారతదేశంలో అంతర్జాతీయ కమ్యూనిజంకు భవిష్యత్తు అనేది ఉండదు. చైనాకు అనుకూలంగా ప్రస్తుతం వారు అనుసరిస్తున్న వైఖరిని విడనాడితే, ఆ అవకాశం (భవిష్యత్తును చూచే అవకాశం) పూర్తిగా నశించదు. ఏది ఎట్లా ఉన్నా పార్లమెంటులో కమ్యూనిస్టులు సమర్థవంతమైన ప్రతిపక్షంగా వ్యవహరించారని చెప్పకతప్పదు. కనీసం ఈమారు జరిగే ఎన్నికల తరవాతకూడా వారు ప్రతిపక్షంగా ఉండితీరుతారు. కేంద్రంలో మళ్లీ కాంగ్రెసుపార్టీయే అధికారంలోకి వస్తుందంటే, కమ్యూనిస్టులుకూడా కాదనటం లేదు.

* * *

ఏ కారణంవల్లనో జమయత్-ఉల్-ఉల్లమాయ్ హింద్ సంస్థ కార్యక్రమాలకు విరివిగా ప్రచారం లభించలేదు. కమ్యూనిస్టు వారపత్రిక "న్యూ ఏజ్" మాత్రమే వీటిని గూర్చి ప్రస్తావించింది. ఆ పత్రికలో వెలువడిన కొన్ని విషయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

"మహాసభలో ప్రధానమైన అంశం సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎం. అబుల్ లయిస్ నద్వీ చేసిన ఉపన్యాసం.

మతవిషయాలలో భారతదేశం అనుసరిస్తున్న తటస్థవిధానాన్ని దుయ్యబట్టారు. ఈ విధానంతో ప్రభుత్వం ప్రజలను మతభ్రష్టులను చేస్తోందని ఆరోపించారు. ముస్లింలు ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యలను చర్చించారు. ఇస్లాంపేరుమీద, ప్రధానంగా మతసంబంధమైన విజ్ఞప్తి చేశారు. "విద్య, సంస్కారణలద్వారా భారతదేశంలోని ముస్లింలను సిసలైన ఇస్లాం మతానుయాయులుగా చెయ్యాలని మా సంకల్పం." అని సంస్థ అధ్యక్షుడు ప్రకటించారు.

జమాయత్ ప్రథమ మహాసభ 1951 లో రాంపూర్ లోను, ద్వితీయమహాసభ 1952లో హైదరాబాదులోను జరిగాయి. ఆ తరువాత నిరాడంబరంగా సంస్థను బలపరుచుకునే కృషి జరిగింది. ఇప్పుడు ఢిల్లీలో పవిత్రమైన జుమ్మామసీదునీడలో, ఎర్రకోట గోడలకు అత్యంత సమీపంలో తృతీయ మహాసభను జరుపుకోగలిగేటంత శక్తి సమకూరిందని సంస్థ భావిస్తోంది. జమాయత్ సంస్థలో ప్రస్తుతం 840 మంది సభ్యులున్నారు. వీరంతా కాకలుతీరిన కార్యకర్తలు, ప్రచారకులు. సంస్థకు ప్రజల మద్దతు ఉన్నది. ప్రస్తుతం 150 స్థానిక సంఘాలు, 18 ప్రాంతీయ సంఘాలు ఈ సంస్థకు అనుబంధంగా పనిచేస్తున్నాయి.

జమాయత్ ప్రధానకార్యాలయం ఇప్పుడు ఢిల్లీకి తరలించబడింది. ముస్లింలు విరివిగా నివసించే ప్రాంతంలో నట్టనడుమ ఈ సంస్థ కోసం ఒక భవనం కొన్నారు. మరొక భవనం కొనడానికి ప్రయత్నిస్తున్నారు. సంస్థ యాజమాన్యంలో, లోగడ వారానికి మూడుసార్లు వెలువడుతూన్న పత్రిక ఇప్పుడు దినపత్రిక అయింది.

స్వాతంత్ర్యంసిద్ధించకమునుపు, కాంగ్రెస్ పార్టీ జమాయత్‌తో పొత్తు పెట్టుకొనడం పెద్ద తప్పిదమని దేశచరిత్ర వ్రాయడం పూర్తి అయిన తరువాత స్పష్టమవుతుంది. దీనిమూలంగా హిందువులకు,ముస్లింలకుమధ్య గల సంబంధాన్ని గూర్చి అపోహ ఏర్పడింది. నిజానికి ఈ పొత్తు, ముస్లింలలో మతపిచ్చి తలకెక్కినవర్గంతో పెట్టుకున్నది. స్వర్గీయ మౌలానా అబుల్ కలాం ఆజాద్ నాయకత్వం క్రింద, ముస్లింలు దేశవిభజనను నివారించడానికి ఏమాత్రం ప్రయత్నించలేదనటం నిర్వివాదమైన విషయం. దేశవిభజనకు కాంగ్రెసు అంగీకరించిందని మౌలానా అజాద్ ఆరోపించారు. కాని ముస్లింలను, ముస్లింలీగ్ నుంచి చీలతియ్యడానికి తాము చేసిన ప్రయత్నాలేమిటో వివరించలేదు. శ్రీ కబీర్ వ్రాసిన మౌలానా అజాద్ జీవిత చరిత్రను చదివినట్లయితే, వెయ్యి సంవత్సరాలుగా భారతదేశంలో సాగిన ముస్లింల ఆధిపత్యం, విభజనవల్ల అంతమైనందుకు మౌలానా ఆగ్రహించినట్లు విదితమవుతుంది. తమ అనుయాయులనుఅస్తవ్యస్తమైనస్థితిలో వదలి మౌలానాసాహెబ్ వెళ్ళిపోయారు. ఇప్పుడు కేరళ ముస్లింలీగ్, జమాయత్ భారతీయ ముసల్మానులను సంఘటితం చేస్తున్నాయి.

దేశంలో ఇతరమతసంస్థలు పని చేస్తున్నంతకాలం ముస్లింలసంస్థకు అభ్యంతరం చెప్పే వీలులేదు. అయినప్పటికి ముస్లింలు ఇతర మతవర్గాలపై దురాగతాలకు పూనుకోకుండా నిరోధించేందుకు జాగ్రత్తపడటం అవసరం. ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ల నుడికట్టు-31

## ఆ ధా రా లు

### అడ్డం

1. పూతరేకులలో బొత్తిగా కొరుకుడుపడనివి కూడా కనిపిస్తున్నాయి.
3. కొత్త పరాగ్గా ఉండేసరికి అదంతా గందరగోళం అయిపోయింది.
5. తల పెడితే సరి ఆలోచనలు అవేవస్తాయి
6. అటెన్నించి రాకుసుమీ!
8. ఒకతే, మరియొకతే.
9. అదియొక—విషాద గాథ, వింటే...
11. వనితలు విహరించే తోట వారిలోనే ఉంది.
13. "ప్రథమావిభక్తులు"లు!
16. కుచేలుడివి కావు అంచేతే తిండిగింజలకి తడుముకోవలసి వచ్చింది.
17. తెలుగు సినిమాలు తయారీలో ఉండగా వాటి వేగాన్ని దీనితో పోలుస్తారు.
19. "సరిగాని సరి" గాని చక్కని చుక్క ముక్కున ఉంటే మెరిసిపోతూ ఉంటుంది.
21. గోడలకి వుంటాయి సుమండీ!
24. పిలవని ఈ ముచ్చటికి వెళ్తే అపద్రిష్ట ముచ్చట కాదూ!
26. పనికిమాలిన వాళ్ల నేస్తాలు గాని వాళ్ళలో ఏ తోటపని చేసే వారుండకపోరు.
27. తమ్ముడికీ వాళ్లక్క కూతురికీ వున్న సంబంధం.
30. కందకంలో నీళ్లు తీసేసి తవ్వి చూస్తే 34 నిలువులో దురదవేసే రకం కనిపిస్తోంది.
32. రోకలి కనబడలేదు గాని రోలు తిరగబడినట్టుంది.
34. అత్తరాలా కాలే.
35. ముదితలో ముసలితనం కనిపిస్తోంది.
37. 31 నిలువులో ఉన్న తోట.
38. సుజాత కంటే అదృష్టవంతురాలు లేదు. ఆమె అదృష్టం దేనిదో తెలుస్తూనేవుంది.
39. సాక్షాత్తు భగవంతుడికి ఆతిథ్యమిచ్చిన అదృష్టవంతురాలు.

### నిలువు

1. ఒకరే బహువచనం అయేసరికి రాత్రులు వస్తాయి.
2. ఊ అంటే ఉలుకొస్తుంది.
3. రచయితను పోషించేదీ, మనిషిని జీవితంలో నడిపించేదీ ఇంతే.
4. ఈ నుడికట్టు పైకప్పుకి గుచ్చుకుని వేలాడుతున్న బాకు.
5. అమ్మాయి పెళ్ళి సంగతెత్తడంతో అబ్బాయి వలపు తలకిందులై పోయింది.
7. పోరాటంలో తిరిగేది.
8. ఏదీ తేలు అని వెతికేసరికి తారీఖులు కనిపించాయి.
10. బజారులో పెరిగేవి.
12. ముని శపించిన వేళ రాత్రేమో చూడండి.
13. ముందర ఆకారం కనిపిస్తే ఆడుమనచ్చు.
14. ఉసిరికాయలో శిక్షు.
15. మోసం! దగా! బెంబేలు పడకుండా చూడండి తిరగేసి వుంది.
16. పుదుచేరి దగ్గరకు వెళ్లి —
18. సర్పమున్న భ్రాంతి కలిగిస్తుంది కాని భయం లేదు. తాడే. చూడండి.
20. మాయదారి జడ! "తలిదండ్రులు పెట్టని సొమ్ములు" తక్కువైన వారి పాలిట వరం.
21. మంచ తిక్కడ లేవుగాని ఎక్కడో ఒక జతగత్తె దాగివుంది.
22. పొందబోయే మేలు సంగతి తెలీదు గాని పొందిన మేలు సాధారణంగా తలక్రిందులుగా కనిపిస్తుంది గదా.
23. చెడుగుడులో ఇది దాటితే గుక్క తిప్పుకుందికి వీల్లేదు.
24. పేక చిత్తము ముడిసరుకు అందులోనే వుంది.
25. ఆటంకంగురించి బెంగెందుకు—తెగేసి మళ్లీ అతికే సదుపాయం వుండనేవుంది.
26. సామాన్యులలో కూడా గొప్ప వాళ్లు, మన్నన చేయతగ్గ వాళ్లూ వుంటారు.
28. తన వలపులో ఒక పెద్ద గ్రంథం అంతా ఇమిడివుందని ప్రతి వ్యక్తీ అనుకుంటే, అదేమీ తప్పు కాదు.
29. కప్పమంటే కప్పమన్న మాట. మళ్లీ మాటాడితే సుంకం కూడాను.
31. మరువం సాటిది. వనమంత వెదకుడు.
33. సరోజాలలో విజాతీయ పుష్పం.
34. శాకాహారులు తినేది.
36. విదిశా నగరంలో ఒక దిక్కు.
37. 16 అడ్డంలో నిలువుగా పండేది. ఎవరికేనా సరే.





## 30-వ గళ్ల నుడికట్టుకు జవాబులు



### భగ్న ప్రేమికుడు

పోస్టాఫీసు దగ్గర ఒక వ్యక్తి నిలబడి ఎవరికోసమో ఎదురు చూస్తూ ఉన్నట్లున్నాడు. సన్నగా, పొడుగ్గా, పైజమా, లాల్చీ వేసుకొనివున్నాడు. గడ్డం కూడ కొద్దిగా పెరిగినట్లే ఉంది.

ఇంతలో ఓ లావుపాటి బట్టతలాయన వచ్చాడు. ఆ యువకుడు, ఆయనకు ఎదురుపడి,

"డబ్బు లేమయినా ఉంటే ఇప్పించండి?"—అన్నాడు మంచి నీళ్ళు అడిగినట్టు. ఆయన విస్తుపోతూ "ఎందుకేం?" అన్నాడు.

"ఉత్తరం వ్రాయాలి అర్జంటుగా! డబ్బుల్లేవు!!"

ఆయన జాలిపడి ఓ అణా యివ్వబోయాడు. ఆ యువకుడు తీసుకోలేదు. ...పోన్లే అనుకొని ఓపది నయాపైసలు, ఐదునయాపైసలు బిళ్ళలు ఇచ్చాడు.

యువకుడు డబ్బులు పట్టుకెళ్ళి కవరు పట్టుకొచ్చాడు. ఇందాకటి ఆయన దగ్గిరకే వచ్చి "కాస్త పెన్ను వుంటే ఇవ్వండి- ఇప్పుడే ఇచ్చేస్తాను!" ఆయన జేబులోంచి కలంతీసి ఇచ్చాడు.

చిన్న కాగితం ముక్క- కూడా—!" అదీయిచ్చాడు.

ఆయువకుడు అక్కడికక్కడే నాలుగు అక్షరాలు వ్రాశాడు.

"ప్చ్! పావం భగ్నప్రేమికుడు కామోసు!!"—అనుకున్నాడు లావుపాటి బట్టతలాయన.

ఆ యువకుడు వ్రాసిన కాగితం కవర్లో పెట్టేసి, అతికించేస్తూ "అట్లాగే కాస్త శ్రమ అనుకోకుండా.........

ఇంకా ఏం అడుగుతాడో నని ఎదురు చూస్తూ వున్నాడు ముసలాయన.

"—మీఅమ్మాయి అడ్రస్ కూడా చెప్పేస్తే చాల సహాయం చేసినవాళ్ళవుతారు." అంటూ ముగించాడు!

ఇంత సహాయంచేసిన తాను అదికూడా చేయాలో లేదో తేల్చుకోలేక తికమకపడుతూ నిల్చుండిపోయాడు ముసలాయన.

"కేశవగోపాల్" (కడప)




చిత్రకారుడు : ఎం. ప్రసాదరెడ్డి (ప్రొద్దుటూరు)

## పొట్టి కథలు

* * *

### మోసపోయిన వైద్యుడు

"ఒక ధనిక ప్రౌఢ ఒకవైద్యుని వద్దకువెళ్లి యిలాఅంది. "నన్ను యిరవైఐదు సంవత్సరాల యువతిగా మార్చగలవా?"

"చేస్తాను. కాని దీనికి రెండు వేలరూపాయలు యివ్వవలసివుంటుంది." అన్నాడు డాక్టరు.

"15 సం॥ వయస్సు గల దానిగా చేయటానికి ఎంత తీసికొంటావు?"

"ఇరవై వేలు."

సరేనన్నదా మహిళ. డాక్టరు శల్యచికిత్సద్వారా ఆమెను పదిహేను సంవత్సరాల బాలికగా చేశాడు. డబ్బడిగితే ఆమెయివ్వటానికి నిరాకరించింది.

"అయితే నేను కోర్టులో దావావేసి తెచ్చుకొంటాను" అన్నాడు డాక్టరు.

"నేనిప్పుడు మైనరును. నామీద ఎటువంటి దావాలు చెల్లవు తెలుసా?" అందా బాలిక.

బి. శ్రీనివాసులురెడ్డి (తిరుపతి)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.


# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

రోజంతా హాయిగా మరియు సువాసన
వెదజల్లుతూ ఉండేలా ఉంచుతుంది

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును ఒళ్లంతా జల్లుకొంటే తీక్షణమైన ఎండలుగల వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. దీనిని జల్లుకొని ఉత్సాహమును మరియు పూల పరిమళపు హాయిని రోజంతా అనుభవించండి!




పెద్ద మరియు మధ్యమ రకపు రెండు అనువైన సైజులలో లభిస్తోంది

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితము)